# పెరుగుతున్న తలసరి ఋణం

భారతీయ పత్రికా రచయితలకి రాజీవ్‌గాంధి ఇంటర్‌వ్యూలు ఇవ్వరంటే దానికి అర్థం వాళ్లంటే ఆయనకి ఇష్టంలేదనికాదు, సగానికి సగం రోజులు ఆయన ఈ దేశంలో ఉండకపోవటమే దానికి కారణం. అందుకే నేనో తెలివైన పని చేశాను. ఇందిరాగాంధి విమానాశ్రయంలోని వి.ఐ.పి. లాంజ్‌లో మకాం పెట్టి ఆయన ఎక్కవలసిన విమానం వచ్చే లోపుగానే ఆయనని దొరకపుచ్చుకున్నాను. అప్పుడు ఆయన హరారే వెళ్తున్నారనుకుంటాను. మరి నేను మాత్రం ఎక్కడికీ వెళ్లటంలేదు. అందువల్లనే నేను ఆయనతో దాదాపు ఒకగంటసేపు మాట్లాడగలిగాను. డూన్ స్కూలు కుర్రవాడెవరితో అయినా విసుగు చెందకుండా మీరు అంతకన్నా ఎక్కువసేపు మాట్లాడలేరు.

నేను : మీరేదో కొత్త 20 సూత్రాల కార్యక్రమం చేపట్టినట్లు తెలిసింది. అందులో కొత్తదనం ఏమిటి?

రాజీవ్ గాంధి : మేము పేదరికంపై కొత కార్యక్రమం ఒక దానిని చేపట్టినట్లు నాకైతే తెలియదు. దానిని గురించి నేను నా గణతంత్ర దినోత్సవ, క్షమించాలి, స్వాతంత్ర్య దినోత్సవ ఉపన్యాసంలో చెప్పాను. పాతకాలం మహారాజులు ఏనుగులని గురించి చెప్పినట్లుగా మా కాంగ్రెసువాళ్లం పేదరికం గురించి చెప్తూ ఉంటాము. సహజంగానే అది మాకు అబ్బుతుంది. కానీ ఇంతలోనే అధికారవర్గం దానికి ఒక కార్యక్రమాన్ని రూపొందించారన్న సంగతి నాకు తెలియదు. దాన్ని గురించి మీకు అంతా తెలుసు. అందులోని కొత్తదనం ఏమిటో చెప్పండి, వచ్చే స్వాతంత్ర్య దినోత్సవంనాడు నేనా విషయం చెప్పాలి కదా?

నేను : వచ్చే స్వాతంత్ర్య దినోత్సవానికి ఇంకా చాలా సమయం ఉంది. ఈలోగా ఎన్నో విషయాలు జరగవచ్చు.

రా. గాం. : మచ్చుకి అవి ఏమిటో ?

నేను : మీరు ప్రధానమంత్రిగా ఉండకపోవచ్చు.

రా. గాం. : అలా అని జ్యోతిష్కుడెవరైనా చెప్పారా?

నేను : లేదు. ప్రణబ్‌ముఖర్జీ అన్నారు. అసలు మీరు కాంగ్రెసువారే కాదని ఆయన అంటారు. మీకు పార్టీని గురించి కానీ, శ్రీమతి గాంధీని గురించి గానీ ఏమి తెలియదని అంటారాయన. మిమ్మల్ని పదవిలోనించి దించి వెయ్యాలని ఆయన నిశ్చయించుకున్నారు.

రా. గాం. : మరి నా స్థానంలో వాళ్ళు ఎవరిని పెడతారుట?

నేను : కమలాపతి త్రిపాఠీని.

రా. గాం. : (నవ్వుతూ) కమలాపతా? కాటికి కాళ్ళు చాచుకున్న ఆయనా?

నేను : కాంగ్రెసులో అత్యధిక సీనియారిటీ ఉన్న వ్యక్తి కమలాపతి, సీనియారిటీని బట్టి పోవాలని పార్టీ నిర్ణయించింది. అసలు మొరార్జీదేశాయి అందరికన్నా సీనియారిటీ ఉన్నవారు కానీ ఆయన మళ్ళీ ఢిల్లీ రావటానికి ఇష్టపడకపోవచ్చు.

రా. గాం. : అయినా నాకున్న ప్రచారం మరెవరికీ లేదు. అన్ని చోట్లా నా పేరు మారుమోగుతున్నది - లండన్, హరారే, ప్రాగ్, మాస్కోలలో ...

నేను : కానీ భారతదేశంలో కాదు. నిజానికి మీరు అసలు దేశంలో ఉండటమే అరుదని జనం అంటున్నారు. ఇంకా చెప్పాలంటే మీ చిరకాల మిత్రుడు అరుణ్‌నెహ్రూకి మరింత ప్రచారం ఉన్నది.

రా. గాం. : నా కుర్చీని లాక్కోడానికి అరుణ్‌నెహ్రూ ప్రయత్నం చేస్తున్నారా?

నేను : మీ కుర్చీని లాక్కోడానికి చాలామంది ప్రయత్నిస్తున్నారు. అన్నిటినీ మించి అరుణ్‌నెహ్రూ ఒక నిజమైన నెహ్రూ కదా. అది అలా ఉండనివ్వండి. మళ్ళీ పేదరికం విషయానికి వద్దాము ...

రా. గాం. : భారతదేశంలో పేదరికం గురించి అంత చెప్పుకోవలసినది ఏముంది? మిగతా దేశాలతో పోలిస్తే భారతదేశంలో ప్రతి వ్యక్తీ పేదవాడే. నన్నే తీసుకోండి, ప్రపంచంలో అతి పేద ప్రధానమంత్రిని నేనే అయి ఉంటాను. పన్నులన్నీ పోను నా చేతికి వచ్చే జీతం నెలకి రు. 1869-40 కంటే ఎక్కువ ఉండదు. నేను పైలట్‌గా ఉన్నప్పుడే ఇంకా ఎక్కువ వచ్చేదని సోనియా అంటుంది. రాబర్ట్ ముగాబే కూడా ఎక్కువ సంపాదిస్తారు, ఆయన ఎలాంటి అందమైన సూట్లు వేస్తారో చూడండి.

నేను : వాటిని శావిల్రోవ్‌లోనో లేదా జోహాన్స్‌బర్గ్‌లోనో కుట్టించి ఉంటారు.

రా. గాం. : బాండ్ స్ట్రీట్‌లో నేనొక చేతి రుమాలు కొనటానికి శివశంకర్ దగ్గర విదేశీమారక ద్రవ్యం అప్పు తీసుకోవాల్సి వచ్చింది.

నేను : అంటే శివశంకర్ మీకన్నా ఎక్కువ సంపాదిస్తున్నారనా మీ ఉద్దేశ్యం? విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ ఒక రూపాయి మాత్రమే జీతంగా తీసుకుంటారని విన్నాను. ఆయన వసూలు చేసిన పన్నులన్నీ ఏం చేస్తారు?

రా. గాం. : ఆయన్నే అడగండి. ఎప్పుడూ ఆయన నాతో డబ్బు లేదనే అంటూ ఉంటారు, చివరికి మరో ఆసియా క్రీడోత్సవాలకి కూడా.

నేను : ప్రపంచ బాంక్‌నించీ, అంతకుమించి అంతర్జాతీయ ద్రవ్యనిధినించీ మీరెప్పుడైనా అప్పు

( 73 వ పేజీ చూడండి)

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి






## కలల అలల మంచు తెరలంత పల్చన

పొగమంచుకన్నా పల్చన, ఎగిరే ఈకకన్నా తేలిక, అదే మీరు కోరే నిశ్చింత నిస్తుందిక. డ్యూరెక్స్ ఫెదర్ లైట్ అంతఃరరాష్ట్రీయ కాండోము లిప్పుడు ఇండియాలో లభిస్తున్నాయి.

ప్రపంచానికి తెలిసిన అతి తేలికైన, సున్నితమైన సంరక్షతను తెలుసుకోవడానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము.






MAA (S) LRDF 2A TEL 85

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

26 సెప్టెంబర్-2 అక్టోబరు 1986
శ్రీ అక్షయ నామ సం. భాద్రపద బ. అష్టమి
సంపుటము 79 : సంచిక 4

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్టులో 12నెలల చందా | రు. 143.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి రాధ
(ఫోటో ఎం కె రామమూర్తి)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :






## ముఖచిత్రం

15-21 ఆగస్టు, '86 అందాలరాశి "కిర్తిసింగ్" ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆకర్షణీయంగా ఉంది.

—ఆచంటి శ్రీవల్లీదేవి, పొందూరు

★ ★ ★

నటి మాధవి ముఖచిత్రం పత్రికకే వన్నె తెచ్చింది. ప్రచురించిన నాలుగు కథలలో "వెన్నెల కురిసిన రాత్రి" కథ వాస్తవానికి బహు దగ్గరగా వుంది. రచయిత ఈ కథను చాలా మెలకువతో ఆలోచించి వ్రాసారు.

—షేక్ మస్తాను, రేపల్లె

## సీరియల్స్

'కరిగిన శిల', 'నిశ్శబ్ద సంగీతం', 'జీవితం చేజారిందా?', 'సంకెళ్ళెవరికి?' సీరియల్స్ వైవిధ్యంతో కూడి, మా ఇంటిల్లిపాదిని ఆకట్టుకుని వచ్చే సంచికకోసం ఎదురు చూసేలా చేస్తున్నాయి.

-కొల్లి సీతామహాలక్ష్మి, కె. సాయిలీల,
కె. శివరామిరెడ్డి, నందివెలుగు

★ ★ ★

అందాలరాశి కిర్తిసింగ్ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఆకర్షణీయంగా వుంది. కాకాని కమలగారి "జీవితం చేజారిందా" సీరియల్ అద్భుతం!

—యస్. వరలక్ష్మి, టి. విజయలక్ష్మి, కదిరి

★ ★ ★

29 ఆగస్ట్ 4 సెప్టెంబర్ '86 సంచిక నటి మాధవి ముఖచిత్రంతో చాలా అందంగా ముస్తాబయి మాకందింది. సీరియల్స్‌లో కాకాని కమలగారి 'జీవితం చేజారిందా' చాలా చక్కగా మంచి కథతో నడుస్తూంది. రచయిత్రిగార్కి నా అభినందనలు.

—పోలోజు వెంకటాచారి, హైదరాబాదు

## కథలు

నటి మాధవి ముఖచిత్రంగా వెలువడిన సంచికలో ప్రచురించిన శ్రీమతి శేషు అప్పారావుగారి 'ఏరు' కథ చాలా బాగుంది.

—పి. రాము, గుంటూరు

## వ్యాసాలు

చిలిపి చూపులతో ఆలరించే అందాల నటి "మాధవి" ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది

"కృష్ణతత్వాన్ని చాటి చెప్పే గోవర్ధనం" వ్యాసం చాలా బాగుంది.

—బళ్ళారి మహమ్మద్ సలీమ్, గుత్తి

## శోకంలో తెలుగు నేల

సృష్టి మోమున ఆవేశవృష్టి కురిసె,
రుధిర నయనాలతో అగ్ని పొదలు నిలిచె
ప్రళయవిలయాలలో నృత్యకళలు వెలసె-
తట్టుకోవడ మెవ్వరి తరము జెపుమ?

నింగి గర్జించె అడవిలో సింగమువలె
ప్రకృతి వికటాట్టహాసపు ప్రతిన బూనె
కాళరాత్రిలో వినిపించె ప్రళయభేరి
ఆంధ్ర ధాత్రిలో కనిపించె యముని భటులు

తేలుచున్నవి అవిగొ శవాలవెన్నొ!
వేల జంతువుల మృతదేహాలవెన్నొ!
ఏమి పాపము జేసెనో రామ రామ!
ఇంత ద్రోహము జేసినావేమి వరుణ!

చూతుమెక చోట విశ్రాంతి వాతబడిన
కూలిపోయిన గుడులెన్నొ! గూడులెన్నొ!
సృష్టి భీకర కోపాగ్ని చేతబడిగ
బ్రద్దలైనట్టి మేడలు మిద్దెలెన్నొ

—డి. లక్ష్మణాచార్య, పటాన్‌చెర్వు

## వరద గోదారి

సీ. గోదారి తల్లికి గొబ్బంగి పూదండ
అనిజనుల్ పాడుట వినగలేదొ!
'పల్లెలు, పట్టణాల్ పంటభూములెన్నొ
నిను నమ్ముకొనియుంట కనగలేదొ!
మా తల్లి గోదారి మంచి చల్లని తల్లి
అని నిన్ను పొగడుట వినగలేదొ!
నీ నీటికొసంచి నీ తీరముల వెంబ
డిని కాపురములుంట కనగలేదొ!

ఆ. వె. వినగ చెవులు లేక కనగ కన్నులులేక
పాపభీతి లేక భయములేక
వరదతో ద వచ్చి విరుచుకపడి దేశ
మెల్ల ముంచి చిచ్చుపెట్టినావు.

తే.గీ. ఎలనోయమ్మ గోదారి! ఇంత ఆగ్ర
హమ్మునిను భక్తిగొల్చెడి ఆంధ్రులపయి
ఉగ్రరూపమ్ము దాల్చి ఆంధ్రోర్వినెల్ల
ముంచినావమ్మ! కొంపలు ముంచినావు.

ఆ.వె. నీదుదారివెంట నీవు పోవక ప్రక్క
దారులంటి తిరుగ! తగునె నీకు!
నమ్ముకున్నవారి నట్టేట ముంచుట
నీ స్వభావమేమొ? ఎవ్వడెఱుగు?

తే.గీ. "కదలుమిట మాని దివిజ గంగాభవాని"
అనుచు ఆంక్షల బెట్టుచు రనకవీంద్రు
డిపుడు లేడయ్యె, గాకున్న విచ్చలవిడి
వక్రదతులను చరియింప వశమె నీకు?

ఆ.వె. ఒక్క మాట చెప్పి పోవమ్మ గోదారి!
నీవు ముంచినట్టి నీటియందు
వెనుకబడినవారి దెంత శాతమొ, మరి
అగ్ర కులమువారి శాతమెంతొ

—వేదుల బాలకృష్ణమూర్తి, పెద్దాపురం ☐

సీరియల్

# పావని



సి. విమలాగణేశ్

(గత సంచిక తరువాయి)

అందమయిన జీవితాన్ని మరచి పోలేక మధుర మయిన వూహాలోకంలో విహరిస్తూ యిల్లు చేరింది పావని. స్వర్గం నుంచి ఒక్కసారిగా నరకం చేరింది. వచ్చావా రా నీ పని పడతా అన్నట్లు చూసింది సవతితల్లి.

"పరీక్ష లన్నీ బాగా రాశావా?" అడిగింది సవతి తల్లి విశాలి. పేరు మాత్రమే విశాలి హృదయం చాలా యిరుకు.

"బాగానే రాశాను పిన్నీ!"

"అబ్బా పెద్ద బాధ్యత తీరింది నీ చదువు పూర్తి అయింది. ఆ భగవంతుడి దయవల్ల మంచి వుద్యోగం వస్తే నా కష్టం ఫలించినట్లే." అంటున్న విశాలి మాటలు పావని మనసులో తుపాకి గుళ్ళలా దూసుకుపోయాయి. తన చదువు కోసం ఆవిడేం కష్ట పడింది? యేనాడైనా ఓ పది రూపాయలు పంపిందా? కనీసం ఓ చీరయినా కొనిచ్చిందా? తన స్కాలర్‌షిప్ తోనే అన్నీ గడుపుకుంది. అడగాలనిపించింది. గయ్యాళి నోటితో వేగడం కష్టమని తెలిసిన పావని వూరు కోవడమే వుత్తమం అని వూరుకుంది.

"అలా నిలబడే చూస్తావే లోని కెళ్ళి పనిచూడు" అప్పుడే అధికారం మొదలు పెట్టింది విశాలి. లోపలికి నడిచింది.

"అక్కా మాకేం తెచ్చావ్?" ఎగబడ్డారు పిల్లలు. తాను వారి కోసం తెచ్చిన వన్నీ యిచ్చింది. భోజనాలయ్యాయి. అందరూ బయట కూర్చున్నారు.

"పావనీ" పిలిచింది విశాలి.

"పిలిచావా పిన్నీ?" వచ్చి యెదురుగా నిలబడి అడిగింది.

"ఆ... కూర్చో" కూర్చుంది.

"యింకా పరీక్షలు తెలవడానికి ఎన్ని రోజులు పడుతుంది?"

"రెండు నెలలు పట్ట వచ్చు!"

"సరే అంత వరకు ఖాళీగా కూర్చోవటం దేనికి?"

"యేం చేయను?"

"అదే రామనాథం మేష్టారి బడిలో ఓ పంతులమ్మ లీవు పెట్టిందట నిన్ను వేయిస్తానన్నారు".

జరిగిన కథ-2: లక్షల ఆస్తికి వారసుడయిన విజయ్ తల్లి, తండ్రిలేని అనాథ. పావనికి తల్లి లేదు. స్కాలర్‌షిప్‌తో చదువుకుంటోంది. రోజీ, దినేష్, మదన్, ఆనందరావులు విజయ్, పావనిల క్లాస్‌మేట్స్. తనను అవమానపరిచిన పావనిమీద కారాలు, మిరియాలు నూరుతూ వెళ్ళిపోతాడు మదన్. విజయ్, పావని ప్రేమించుకుంటారు. పెళ్ళిచేసుకోవాలని కలలు కంటారు. పరీక్షలు ముగిశాయి.పావని విజయ్‌ని వదిలి వెళ్ళాలంటే బాధగా ఉందని కన్నీరు పెట్టుకుంటుంది. ఆమెను అనునయిస్తాడు విజయ్.

"అలాగా!"

"ఔను వెళితే నెలకు రెండొంద లొస్తాయి. ముష్టి వెధవ వచ్చిందంతా యిచ్చి చావడుగా. ఓ వంద తీసుకొంటాడు. పోతే పోనీ వూరికేనే కూర్చొంటే యేమొస్తుంది"?

"అలాగే పిన్నీ".

"యేమిటో నిన్ను యింత కష్టపడి చదివించా. రేపు నీ చెల్లెళ్ళనీ తమ్ముళ్ళనీ యెలా చదివిస్తావో!" మళ్ళీ అదే మాట! తన కోసం యేం కష్టపడింది? నోటికి జడిసి వూరుకుంది.

"పెద్ద దాన్ని డాక్టరు చదివించాలి. యిక వాణ్ణి యింజనీరుకు పంపాలి" ఆలోచనలు బాగానే వున్నాయి. వెనుకటి కెవరో అన్నారట. "బుద్ధులు భూము లేలుతుంటే రాతలు గాడిదలు కాస్తున్నాయని" కోరిక లుండగానే సరా! వాళ్ళు చదవొద్దూ?

"సరే ఆ గేదెకు కాస్త మేతవేసి నువెళ్ళి పడుకో" ముసుగు పెట్టు కుంటూ అంది విశాలి.

పడుకొన్న దన్న మాటే గాని పావని కంటికి నిద్రదూర మయింది. రాకాసి పిన్ని రాక్షసిలా కన్పిస్తోంది. తన కోసం రవంత కష్టపడక పోయినా చిన్న నాటి నుంచి వెట్టి చాకిరి చేయించి చితకదన్ని ఈ వాళ తన కష్టం ఆశిస్తోంది. తన పెళ్ళికి ఒప్పు కుంటుందా? తన విజయ్‌తో పెండ్లి కానిస్తుందా? లేక యింక వూహించ లేక పోయింది. తన పిన్ని చేసే కిరాతకానికి హద్దే లేదు. ఆవిడ లాభం కోసం యేం చేయడాని కయినా వెనుకాడని రకం. యెలాగయినా తన పట్టు వదలక కార్యం సాధించే రకం అవన్నీ తలచుకొన్న కొలదీ పావని మనసులో భయం చోటు చేసి కొని చిన్న నాడే పోయిన తల్లి జ్ఞాపకం రాగా కన్నుల వెంట నీరు జలజల రాలింది.

"భగవాన్ నువ్వే దిక్కు. నా విజయ్ లేకుండా బ్రతుకలేను. చిన్న వయసులో నన్ను నా తల్లి నుండి వేరు చేసి నా జీవితాన్ని నరకం చేశావు. కనీసం యీసారయినా చల్లగా చూసి నన్ను అతని భార్యగా చేసి యీ నా కోర్కె తీర్చు కలకాలం నీకు ఋణపడి వుంటాను. బాధగా మూలిగింది మనసు. మరో ఆలోచనకు తావివ్వకుండా బలంగా నిద్ర కుపక్రమించింది పావని.

* * * * * * *

యిల్లు చేరాడు విజయ్. మేనమామ నరహరి చిరు నవ్వు చిందించి–

"యేం బాబూ వస్తున్నట్లు ఓ వుత్తరం ముక్క రాస్తే నేనే స్టేషనుకు వచ్చే వాడినిగా. యేమేవ్ నిన్నే అల్లుడొచ్చాడు" అంటూ కేకపెట్టి చేతిలోని సూట్ కేసు అందుకున్నాడు.

"అనుకోకుండా బయలుదేరాను మామయ్యా. అందుకే వుత్తరం రాయలేక పోయాను" అంటూ లోనికి నడిచాడు. చేతులు తుడుచుకుంటూ ఎదురుగా

వస్తున్నారు అత్తగారు అనసూయమ్మ.

"ఏం బాబూ కులాసేనా? ప్రయాణం బాగా జరిగిందా?"

"బాగానే జరిగిందత్తయ్యా! అందరూ కులాసానా? ఏరి పిల్లలు?"

"చిన్న వాళ్ళు బడి కెళ్ళారు. యిక లత నువ్వొస్తావని తెలియక కుట్టు నేర్చుకొనే స్కూలు కెళ్ళింది, వచ్చేటైం అయింది".

"యేంటి లత కుట్టు నేర్చుకుంటుందా? ఆశ్చర్యం!"

"అలా ఆశ్చర్య పోకు! మునుపటి లత అనుకున్నావా? యిప్పుడెంతో మారింది. మనం పది మాట్లాడినా అది ఒక్క మాట మాట్లాడదు. యింటి పనంతా అదే చేస్తుంది." గొప్పగా చెప్పింది అనసూయమ్మ.

"అలాగా"?

"నువ్వే చూస్తావుగా"!

"ఏమిటే నీ సోది అలా నిలబెట్టే..... నిన్ననగా బైలు దేరి యీ వాల్టి కొచ్చాడు. ముందు స్నానం, భోజనం కానీ తరువాత విశ్రాంతిగా మాట్లాడు కోవచ్చు" విసుక్కుంటూ అన్నాడు నరహరి.

"నామతి మండా మర్చే పోయాను, ముందు స్నానానికి రాబాబు.

"వేడి నీళ్ళు పెట్టు" నరహరి అన్నాడు.

"యేమిటండోయ్ మరి మీరు ప్రతిదీ చెప్తే నేను చెయ్యాలా! ఆ మాత్రం నాకూ తెలుసు" మూతి తిప్పింది.

"ఔను మరి తెలిసే సోది. కానీ త్వరగా".

"రా బాబూ".

"లేదత్తయ్యా వేడినీళ్ళొద్దు రోజూ నేను చన్నీళ్ళే చేసేది".

"ఏమిటి చన్నీళ్ళా అదేం కుదరదు. నువ్విక్క డున్నంత కాలం మేం చెప్పినట్టు వినవలసిందే. ఏమిటి? యింకా నిలబడి చూస్తావ్ కానీ".

"యిదో ఒక్క నిముషం" వేగంగా కదలింది అనసూయ..

"నువెళ్ళి స్నానం చేసిరా బాబు, నేనలా బజారు వరకు వెళ్ళి వస్తాను".

"అలాగే వెళ్ళిరా మామయ్యా". నరహరి బయటికి నడిచాడు. విజయ్ స్నానానికి వెళ్ళాడు. అంతలో లత రానే వచ్చింది. లోపల బూట్లూ, సూట్ కేసూ చూసి–

"అమ్మా యెవరే వచ్చింది" అంది లత.

"ఎవరా? నీ కాబోయే మొగుడు".

"బావా!? నాకేం తెచ్చాడే?"

"నోర్మూసుకో వయసు పెరిగినా బుద్ధి పెరగలా. పిచ్చి గంతులు పిచ్చి చేష్టలు మాటలు మాను యికనయినా. పట్నంలో పెద్ద చదువు చదివొచ్చాడు. గుర్తు పెట్టుకో. చక్కగా అందంగా మాట్లాడడం నేర్చుకో. ప్రవర్తించటం నేర్చుకో. యిలాగే వెళ్ళకు. ముందు బట్టలు మార్చుకో. చక్కగా తల దువ్వుకొని పౌదరు బొట్టూ పెట్టుకో. వెళ్ళు".

"అలాగే లేవే" వేగంగా వెళ్ళి పోయింది.

నిజంగా చెప్పాలంటే లత అందమయినది కాదు. నల్లని నలుపు దానికి తగ్గట్టు ఓ కన్ను మెల్ల. అంతే కాదు వట్టి అల్లరిది, మాటకారి. చదువు పూర్తిగా వంట బట్టలేదు. ఎప్పుడూ ఏదో ఒకటి తింటూ అందరి తోనూ అనవసరంగా పోట్లాట పెంచు కుంటుంది. యిదీ లత స్వభావం. ఎలాగయినా లతను విజయ్ కిచ్చి వివాహం జరిపించి ఆస్తినీ అల్లుడినీ సొంతం చేసుకోవాలనే కోరిక



# పావని

అనసూయమ్మలోనూ, నరహరిలోనూ జీర్ణించుకు పోయింది. విజయ్ స్నానం ముగించి గదిలో కొచ్చాడు తల తుడుచుకుంటూ. కాఫీ కప్పుతో లోనికి వచ్చిన అనసూయమ్మ–

"అయ్యో అదేంటి బాబు తలకు పోసుకున్నావా?"

"సబ్బుతో పోసుకున్నా"!

"నాతో చెబితే కుంకుడు కాయలు కొట్టే దాన్నిగా"!?

"పరవాలేదత్తయ్యా".

"త్వరగా తుడుచుకో తల నాని పోతుంది." అనసూయమ్మ మాటలు విన్న విజయ్‌కి కాస్త చిరునవ్వు వచ్చింది. వాళ్ళు తనపై చూపిస్తున్న ప్రేమకు నిజంగానే ఆనందం పొంగి పోయింది.

"త్వరగా తుడుచుకొని కాఫీ తాగు బాబూ".

"పిల్లలింకా రా లేదా అత్తయ్యా"?

"లతొచ్చింది".

"యేదీ కన్పించదే"?

"బావను చూచి సిగ్గు పడుతున్నది కాబోలు"

"ఏమిటీ మన లతకు సిగ్గా"? చిన్నగా నవ్వాడు.

"కాలం యెప్పుడూ ఒక లాగే వుండదు నాయనా! అప్పుడంటే చిన్న పిల్ల యిప్పుడు వయస్సుతో బాటు అన్నీ తెలిశాయి".

"నాకు చాలా ఆశ్చర్యంగా వుందత్తయ్యా".

"సరే కాఫీ తాగు మీ మామయ్య వస్తే "నా అల్లుడి కింకా భోజనం పెట్ట లేదా" అని నా మీద కొస్తారు". అంటూ చిరునవ్వుతో పోయింది.

అద్దం ముందు కూర్చున్నదే కాని అలంకారం పూర్తి చేస్తున్న లత మనసు బావ చుట్టూ పరిభ్రమిస్తూంది. అసలే నల్ల దయిన ఆ ముఖానికి తెల్లగా మేకప్ వేసింది. కన్పించక పోయినా కాటుక పై రెప్ప నిండా పూసి కొమ్ములు దిద్దింది. అందంగా యెర్ర బొట్టు పెట్టింది. తల దువ్వి చెంపల ప్రక్కన కర్లింగ్స్ తిప్పింది. ఆ నల్లని ముఖంలో యెర్రని బొట్టు మాత్రం చక్కగా తెలుస్తుంది. ముళ్ళగోరింట పూలు పెద్ద చెండుగా తలలో పెట్టుకుంది. పండక్కి కొన్న లంగా ఓణీ వేసుకుంది. అద్దంలో ఒక సారి చూసుకొంది. సినిమా తారలంతా తన ముందు బలాదూర్ అనే నిర్ణయాని కొచ్చి బైటి కొచ్చింది.

"అమ్మా యెలా వుంది"? అందంగా పైట సరిచేసుకుంటూ అడిగింది

"ఏమిటే ముఖం మరీ తెల్లగా వుంది తుడుచుకో".

"అబ్బా నీకు తెలియదులే యిదే ఫాషన్".

"సరే ఆ చంద్రహారం గొలుసు వేసుకో" అంది అనసూయమ్మ.

గబ గబా వెళ్ళి బీరువా తెరచి తల్లి చెప్పిన నగలు ధరించి నెమ్మదిగా బావ గది సమీపించింది. గదిలో విజయ్ ఫుల్ స్పీడ్‌లో ఫాన్ పెట్టి తాపీ ధర్మారావు గారి "దేవాలయాల మీద బూతు బొమ్మ లెందుకు" పుస్తకం చదువు తున్నాడు. ఆ పుస్తకం చాలా కష్టపడి సంపాదించాడు. ఆసక్తి కరంగా వున్న ఆ పుస్తకాన్ని వుదాహరణలతో సహా వివరించారు ధర్మారావుగారు. కాని ఆ రచనలోని సత్యాలన్నీ నమ్మ శక్యం కానట్లుగా కన్పించాయి విజయ్‌కి. పూర్తిగా పుస్తకంలో లీనమై పోయాడు. విజయ్ గదిలో ప్రవేశించిన లత తన వంక బావ చూడక పోవడం సహించరాని బాధగా నిలిచింది. కోపంతో బయటికి వెళ్ళి పోవాలను కుంది. కాని రెండు గంటలు కష్టపడ్డ తన అలంకారం బావ చూసి మురిసి పోవద్దూ! అందుకే నెమ్మదిగా మంచం సమీపించింది.

'బావా' అతి నెమ్మదిగా అంది. 'ఆ పిలుపుతో తల తిప్పాడు విజయ్. ఎదురుగా లత సిగ్గుగా నిలబడి వుంది. ఆ అలంకారం విజయ్‌కి యెబ్బెట్టు కలిగించి మరో సారి ఆమె ముఖం లోకి చూడ బుద్ధిగాకుండా చేశాయ్. అంతలోనే నవ్వు కూడా వచ్చింది.

"అదేం పుస్తకం బావా అంత దీక్షగా చదువుతున్నావ్"?

"అదా! నవల కాదులే".

"నాకు యివ్వు బావా చదువుతాను".

"నువ్వు చదవ కూడదు. అన్నట్టు మీ తమ్ముళ్ళేరి"?

"స్కూలు నుంచి యింకా రాలేదు".

"ఏంటి యీ మధ్య నువ్వు చాలా మారిపొయ్యావట. కుట్లు నేర్చు కుంటున్నావట ఏమిటి విశేషం?"

"పో బావా నాకు సిగ్గేస్తుంది " అతి అందంగా తిప్పుకుంది

"బాగానే వుంది సిగ్గు." విజయ్ కాస్త యెబ్బెట్టుగా చూశాడు.

"బావా! యీ లంగా బాగుందా"?

"ఆ బాగానే వుంది".

"మ్యాచ్ జాకెట్ తెమ్మంటే నాన్న తేలేదు".

"మ్యాచా? అంటే"?

"నీకేం తెలీదు. లంగా లాంటి జాకెట్టే వేసుకుంటే అందంగా వుంటుంది". ..

మూతి మూడు వంకరలు తిప్పుతూ అంది. నిజంగా ఆ అలంకారంలో మాళిగేద దూడకు నగలూ బట్టలూ కట్టినట్లుగా కన్పించింది విజయ్‌కి అతిగా మాట్లాడ బుద్ధి కాలేదు.

"ఏం బావా మాట్లాడ కుండా మళ్ళీ చదువులో పడ్డావు"?

"ఏం మాట్లాడను"?

"అదే యేమేం సినిమాలు చూశావ్"?

"అన్నీ".

"బాబోయ్ అన్నీనే".

"ఔను".

"బావా బావా మనూళ్ళో 'శివరంజని' ఆడుతుంది వెడదామా"?

"నే నెందుకు నువెళ్ళు".

"ఛో బావా నువ్వెప్పుడూ యింతే"!

"సరే నువెళ్ళు".

"ఏం యిక్కడుండకూడదా?" చిరుకోపం

"ఉండ కూడదని యెవరన్నారు? నన్ను మాట్లాడించకు". ఆ మాట విన్న లతకు నిజంగానే కోపం ముంచుకొచ్చింది.

"లతా నువ్విక్కడున్నావా? బాబూ! భోజనానికి రా" యిద్దరినీ తృప్తిగా చూస్తూ అంది అనసూయమ్మ.

"అలాగే వస్తున్నా" పుస్తకం మూసి లేచాడు భోజనం సిద్ధంగా వుంది. భోజనానికి వుపక్రమించాడు. దూరంగా నిలబడింది లత.

"ఏం యెందుకలా చూస్తావ్ మీ బావ కొడ్డించు" అంది అనసూయమ్మ. కోపాన్ని అణచుకొంటూ దగ్గర కొచ్చింది లత ఖర్మ అనుకున్నాడు విజయ్ మనసులోనే

"ఆ టేబిలో కటి కొనండి అని యెంత గోలపెట్టినా వినరు గదా"!

"టేబులా! దేనికి"? విజయ్ లతవంక చూడకుండానే అడిగాడు.

"అదే బాబూ కుర్చీలో కూచుని భోంచెయ్యడానికి".

"ఓ. అదా యిలా క్రింద కూర్చొని తింటేనే బాగుంటుంది లే అత్తయ్యా"

"అలవాటుండొద్దూ"?

"భలే దానివే"!

"అలా చూస్తూ వుంటావేమే? వడ్డించు".

"చాలు చాలు" మాంసం కూర వడ్డించ బోయిన లత చేతికి తన చేయి అడ్డు పెట్టాడు విజయ్.

"అలాగే అంటాడు వెయ్యవే! ఆ హొటళ్ళల్లో తిని తిని నాలుక చప్పబడి వుంటుంది". విందు భోజనం పెట్టారు. రోజూ కన్నా చాలా యెక్కువే తిన్నాడు విజయ్ నెమ్మదిగా లేచి చేయి తుడుచుకుంటూ గదిలో కొచ్చాడు.

"బావా" కిళ్ళీ అందించింది లత.

"కిళ్ళీయా యిదెందుకు"?

"అన్నీ తెలియనట్టే"

అందుకొని నోట్లో వేసుకున్నాడు.

"లతా! కాసేపు పడుకుంటాను లేపకు" మంచంపై కూర్చుంటూ అన్నాడు విజయ్.

"అలాగే" అంటూ బైటి కొచ్చింది లత.

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

టైం దాదాపు నాలుగు కావచ్చింది. విజయ్ యింకా నిద్ర నుంచి లేవలేదు. వంట గదిలో అనసూయమ్మ పిండి వంటలతో నానా యాతన పడుతూంది. మైసూరు పాక్ చేసి జీడిపప్పు పకోడీలు చేస్తున్నది. అంతలో నరహరి ప్రవేశించాడు.

"ఎక్కడా"?

"వంటింట్లో! యేమిటి విషయం"? కాస్త పెద్దగానే అంది అనసూయమ్మ.

"ఏం చేస్తున్నావ్"? వంట గది దగ్గరగా వచ్చాడు.

"అల్లుడికి టిఫిన్ చేస్తున్నా".

"రేపు కోడిని కోస గారెలు వండు".

"మీరు చెప్పాలా నాకు తెలియదూ".

"సరే ప్రతిదీ నువ్వెళ్లి యివ్వకు అమ్మాయితో పంపు".

"ఆ మాత్రం నాకూ తెలుసు".

"మంచిది".

"యిందా నోట్లో వేసుకోండి" ప్లేటు అందించింది. నరహరి అక్కడే పీట మీద చతికిలబడి తింటున్నాడు.

"నే చెప్పేది వినపడుతూందా?"

"సణుగుడు ఆపి సరిగా చెప్పు".

"ఈ మాసంలో మంచి ముహూర్తా లున్నాయట యిందాక శాస్త్రి గారన్నారు"!

"అప్పుడే శాస్త్రి దాకా వెళ్లావా"?

"మరి మీరు పట్టనట్టు వూరుకుంటే నాకు తప్పుతుందా"?

"సరే లేవోయ్ అక్కడకు నాకు తొందర లేనట్టు".

"ఉండి యేం లాభం"?

"వాడేమో చదువుతో నే సరిగ్గా మునిగి తేలుతున్నాడు".

"అయిందేదో అయింది. యీ సారి వదలకుండా ఆ మూడు ముళ్లూ వేయించండి. యే రోజు యెటు వంటిదో"? కాఫీకి నీళ్లు పెడుతూ అంది.

"అలాగే".

"అని వూరుకోవటం కాదు".

"అలాగే అన్నాగా".

"అమ్మా బావ లేచాడే" లత వచ్చింది.

"అలాగా ముఖం కడుక్కోమను. టవలూ సబ్బూ యిచ్చి యీ టిఫిన్ పట్టుకెళ్ళి పెట్టు" అంది అనసూయమ్మ. తల్లి చెప్పి నట్టు గానే లత అన్నీ సర్దింది. విజయ్ అది చూచి–

"యిప్పుడివన్నీ దేనికి"? అదో లా అన్నాడు.

"ఫర్వాలే పట్నంలో యేం తిన్నావో లేదో అన్నీ మనింటి నేతితో చేసినవి. చాలా రుచిగా వున్నాయి తిను" లోనికి వస్తూనే అన్నాడు నరహరి.

"కూర్చో మామయ్యా"!

"లతా. కాఫీ పట్రా" కూర్చుంటూ అన్నాడు. లత కాఫీ తెచ్చే నిమిత్తం బైటికెళ్లింది గదిలో నుండి.

"చదువు పూర్తి అయినట్లేనా? బాబూ" నరహరి అడిగాడు.

"అయినట్లే మామయ్యా"!

"ఇంకాపై చదువు చదవాలని వుంటే చదివేసెయ్ బాబూ"

"ఇంక వద్దు మామయ్యా యీ చదువే చాలు. రిజల్ట్స్ రాగానే ఉద్యోగ ప్రయత్నం చేద్దామనుకుంటున్నాను". జీడిపప్పు పకోడీ నోట్లో వేసుకుంటూ అన్నాడు.

"ఉద్యోగమా? నీకెందుకు బాబూ ఒకరికి తల వంచి పనిచేయవలసిన అవసరం నీకేమొచ్చింది?" అదో లా అన్నాడు నరహరి.

"భలేవాడివి మామయ్యా యిందులో తలవంచి చెయ్యవలసింది యేముంది? యింత చదువూ చదివిందెందుకు మరి?"

"ఏదో నీకు చదువాలని వుండింది చదివావు. ఆరేళ్ళుగా చదువు పేరుతో మాకు దూరంగా వున్నావు. కనీసం యికనయినా మా కళ్ల ముందే వుండు బాబూ" నరహరి మాటలకు నిజంగానే విజయ్ మనసు పులకరించింది.

"యేమిటి మామయ్యా మరి చిన్న పిల్లాడిలా" కొన్సేపు మౌనం.

"బాబూ"

"ఏమిటి మామయ్యా?"

"లతకు పెళ్లి చెయ్యాలనుకుంటున్నాం"

"అప్పుడే తొందరేముంది మామయ్యా చిన్నపిల్లేగా?"

"ఆడపిల్లకు చిన్నా పెద్దా తేడా ఏముంది. ఆ పెండ్లి కాస్తా జరిగిపోతే నాకూ మనసు కాస్త కుదుటబడుతుంది."

"సరే మీ యిష్టం"

"అలాగంటే యెలా? నీ సమ్మతం కావాలిగా"

"నా సమ్మతం దేనికి?"

"అయితే ముహూర్తం పెట్టించమంటావా?" కాస్త ఆనందం.

"పెళ్లికొడుకు రెడీగా వున్నాడా?" విజయ్ నోటి నుండి వచ్చిన యీ మాట విన్న నరహరికి కాస్త ఆశ్చర్యం వేసింది.

"అదేంటి బాబూ అలా అంటావు. అల్లుడివయినా కొడుకువయినా నువ్వేగా మాకు. చిన్నప్పటి నుంచీ కళ్లల్లో వత్తులేసుకుని పెంచాను. లత పుట్టగానే నీదయింది. నిన్ను కాదని ఇంకెవరికిస్తాను బాబు" తాపీగా నరహరి అన్న మాటలు

## గడుసులోకం — బాబు






## పావని

విజయ్ గుండెల్లో తుఫాన్ లేపాయి.

"మామయ్యా నువ్వనేది" నసిగాడు.

"లత నీ భార్య బాబూ!"

"మరోసారి అలా అనకు మామయ్యా. లతా నేనూ యిక్కడే పెరిగాం. నాకు మొదటి నుంచీ లత ఓ చెల్లెలనే భావం తప్ప మరో భావంలేదు ..."

వింటున్న నరహరి గుండెల్లో అగ్ని రగిలింది. అయినా తమాయించుకొని

"అలా అంటే యెలా బాబు"

"క్షమించండి మామయ్యా నా మనసు మారదు. లేనిపోని ఆశలు పెంచుకోకండి. లతకు నాకంటే అన్నివిధాలా గొప్పవాణ్ణి నేతెస్తాను."

"బాబూ ...

"బాధపడకు మామయ్యా. పెళ్ళి జీవితానికి వారధిలాంటిది. అలాంటి వారధికి చాలా గట్టి నిర్మాణం జరగాలి. చివరి వరకు నిలబడేటట్టుగా వుండాలి. అంతేగాని యిష్టం లేకుండా పెళ్ళి జరగడం యిద్దరికీ మంచిదికాదు. మిమ్మల్ని బాధ పెడితే క్షమించండి"- అంటూ మరో మాటకు అవకాశమివ్వకుండా బైటికెళ్ళిపోయాడు. కళ్ళల్లో నిప్పులూ, మనసులో శగలూ, కడుపులో విషం అన్నీ ఒక్కసారిగా విజృంభించాయి నరహరిలో. అంతలో అనసూయమ్మ వచ్చింది.

"నన్నే అవమానపరుస్తావ్ కదూ? చూడు నిన్నేం చేస్తానో?"

"యేం జరిగిందండీ?"

"యేం జరిగిందా! తినే కూట్లో మన్ను పోసుకున్నాడు."

"యెవరు?"

"యింకెవరు? పుట్టగానే తల్లిని మింగిన దరిద్రుడు".

"వివరంగా చెప్పండి?"

"లతను చేసుకోవడం వాడికిష్టంలేదట."

"నిజంగానా?"

"తెల్చి చెప్పాడే చేసుకోనని"

"దొంగ చచ్చినోడు అలా చెప్పాడా?" మెటికలు విరిచింది.

"చూస్తాను. వీడి అంతు చూస్తాను."

"యేమంటున్నారు?"

"చూపిస్తా నా తడాఖా! యీ నరహరి అంటే యేమిటో నిరూపిస్తా"

★ ★ ★ ★ ★ ★

"రాత్రి బాగా పొద్దు పోయాక విజయ్ యింటికి వచ్చాడు. అనసూయమ్మ నిద్రపోతున్నట్టు నటిస్తూంది. మునుపటి ఆప్యాయత యేమయిందో మరి. నరహరి ఇంకా ఇంటికి రాలేదు. విజయ్ గదిలోకెళ్ళి బట్టలు మార్చుకున్నాడు. వెనక్కు తిరిగి చూస్తే లత గుమ్మం వద్ద నిలబడి వుంది.

"బావా భోజనం పెట్టేదా?"

"నా కాకలిగా లేదు లతా"

"అవేం మాటలు బావా. రా త్వరగా" తొందర చేసింది. లాభంలేదని వెళ్ళాడు. లత అన్నీ వడ్డించింది. వంటలు వేడిగా శగలు కక్కడంలేదు. కూరలు పొద్దునవే అన్నీ.

"కూర్చో బావా" కూర్చున్నాడు.

"నాన్నింకా రాలేదా లతా?"

"లేదు. భోంచెయ్యి" నెయ్యి వేసి పచ్చడి వేసింది.

"చాలు"

"బావా ఒక్క మాట అడుగుతాను నిజం చెబుతావా" అతని ముఖంలో అదోలా చూసింది.

"ఏమిటి లతా?"

"నిజంగా నన్ను పెళ్ళి చేసుకోవడం నీకు యిష్టంలేదా?" సూటి ప్రశ్న.

". . . . ."

"నిజం చెప్పు బావా నేనేమీ అనుకోను" మళ్ళీ లతే అంది.

"నిన్ను నేను యెప్పుడూ ఆ వుద్దేశంతో చూడలేదు."

"ఏ ఉద్దేశ్యంతో?"

"భార్యగా". కాసేపు మౌనం.

"నిజంగా మొన్నటి వరకూ నాకూ ఆ వుద్దేశ్యం లేదు కాని అమ్మా నాన్నా నీ వుత్తరం చూచి నీ మొగుడూ అని పదే పదే చెప్పడంతో నా మనసులో నీపై ఓ భావం బహుశా అదే ప్రేమ కాబోలు? కలిగాయి" లత కన్నుల్లో నీరు ...

"లతా" అదోలా చూశాడు.

"నేను బాధపడడంలేదు బావా. నేను నిన్ను గాఢంగా ప్రేమించలేదుగా!" అమాయకంగా అంది. విజయ్ మనస్సులో యేదో చెప్పలేని బాధ.

"బావా నువ్వెవరినయినా ప్రేమించావా?" అదోలా చూశాడు లత ముఖంలోకి.

"చెప్పు బావా!"

"ఔను"

"ఎవర్ని బావా?"

"నాతో చదివిన ఒక అమ్మాయిని"

తనకే అసహ్యంవేసింది. ప్రక్క గదిలో యేవో మాటలు వినపడ్డాయి. తన ప్రమేయం లేకుండానే తన మనసు అటు పరుగెత్తింది.

"వాడు తగలడ్డాడా?" నరహరి కోపంగా అన్నాడు.

"ఆ తగలబడక యెక్కడికి పోతాడు" అనసూయ కోపంగానే అంది.

"తడాఖా చూపిస్తాను. అనాధగా వచ్చాడు. అనాధగానే సాగనంపుతాను."

"భలేవారే ఆస్తి అతనిది" ... అనసూయ జ్ఞాపకంచేస్తూ అంది.

"ఆ విషయం మర్చిపో"

"అంటే?"

"వాడు మర్యాదగా లతను చేసుకుంటాడా సరి లేదా ఒక్క పైసా వాడికి దక్కనివ్వను" నరహరి దృఢంగా అన్నాడు.

"నాకేం అర్థంకాలేదు."

"ఈ ఆస్థి వాడికి చెందదు. చెందనివ్వను"

"అదలాగని?"

"దానికి అన్ని యేర్పాట్లూ చేశాను".

"నిజంగానా!"

## కొనకొ! బొమ్మన్










"పేరు?"

"పావని"

"ఎంత అదృష్టవంతురాలో?"

"ఎందులో"

"నీలాంటి భర్తను పొందటంలో"

"లతా" నిజంగా లత యెంతో యెదిగిపోయింది. మునుపటి లతకు యిప్పటి లతకూ యెంతో వ్యత్యాసం. నిజంగా లత యెంతో మంచిదయింది.

"బావా ప్రేమంటే తెలియకపోయినా సినిమాల్లో, పుస్తకాల్లో ఎన్నో చూశాను. చదివాను. ఆ పావన్నే పెండ్లి చేసుకొని సుఖపడు" అంది మనస్ఫూర్తిగా. మారు మాట్లాడలేదు విజయ్. తింటున్న కంచంలో చేయి కడిగేశాడు.

"బావా ఏం పనిది?"

"అబ్బే యేంలేదు" గబగబా లేచిపోయాడు.

"నీ మనసు బాధపెట్టాను" కన్నీటితో అంది.

"అబ్బే లేదు." వేగంగా గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి పూర్తిగా నిద్ర కరువైంది. తాను యెందర్ని బాధపెట్టాడో? తనపై

"నిజమే."

"ఔన్లే వెధవ. పిల్లను చేసుకోడట. బాగా బుద్ధి చెప్పాలి." అనసూయ కోపంగా అంటుంది.

"బుద్ధి చపుతానో లేదో చూడు" నరహరి అంటున్న మాటలను వినలేకపోయాడు విజయ్. తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు. భగవాన్ ఎంత నాటకం! తనపై సాయంత్రం వరకూ ఎంత ప్రేమ కురిపించారు? అదంతా ఎంత స్వార్థం? యదార్థం యిప్పుడు బయటపడింది. వీళ్ళు మనుషులు కారు రాక్షసులు. తన ఆస్థి అనుభవిస్తూ తనపైనే కత్తి కట్టిన వుత్తములు. ఛీ యిటువంటి చోట క్షణం వుండకూడదు. కోర్టుకెళితే తన ఆస్థి తనకు రాకమానదు. కానీ తాను అటువంటి నీచుడుకాదు. వద్దు తనకా ఆస్థి వద్దు. తన డిగ్రీపై తన తెలివితేటలపై తనకు పూర్తి నమ్మకం వుంది. ఆ ఎంగిలాకుపై వాళ్ళనే కుక్కల్లా తిరగనీ. తనకా ఆస్థి వద్దు. వెంటనే లేచాడు. ఆ యిల్లూ మనుషులూ పగబట్టిన సర్పాల్లా భావించాడు. కాలం స్థంభించినట్లు కనిపించింది. తన సూట్‌కేసు తీసుకొని ఆ చీకట్లోనే తలుపు తెరచుకుని బైటపడ్డాడు. చెప్పలేని ఆవేదనతో లక్షాధికారి ... గోల్డు మెడలిస్టు విజయ్.

(ఇంకా ఉంది)

## వ్యక్తిగతం



చిప్కో ఉద్యమం ద్వారా పరిసరాల రక్షణకి నిరుపమాన మైన కృషి చేసిన శ్రీ సుందర్‌లాల్ బహుగుణ 1986వ సంవత్సరానికి ఇచ్చే జమునాలాల్ బజాజ్ అవార్డుకి ఎన్నిక అయినారు. ఈ అవార్డు క్రింద ఆయనకి లక్ష రూపాయల నగదు, ఒక ప్రశంసాపత్రం, ఒక పతకం లభిస్తాయి. నవంబరులో ఢిల్లీలో జరిగే అవార్డు ప్రదానోత్సవ ప్రత్యేక సభలో వాటిని అందజేస్తారు. ఈ అవార్డుల కోసం వివిధ వ్యక్తుల నుంచి, సంస్థల నుంచి మొత్తం 247 పేర్లు అందాయి. వాటిలో శ్రీ బహుగుణతో పాటు మరో ఇద్దరు ఎన్నిక చేయబడ్డారు. శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని గ్రామీణాభివృద్ధికి వినియోగించటంలో పూణేకి చెందిన శ్రీ విలాస్ బల్వంత్, స్త్రీ, శిశు సంక్షేమానికి, ఉన్నతికి విశేష కృషి సల్పిన బీహార్‌కి చెందిన శ్రీమతి వాసంతీ బెన్‌లు కూడా ఈ అవార్డుకి ఎన్నిక చేయబడ్డారు...... □



ప్రముఖ సంస్కృత పండితుడు డాక్టర్ ఇంద్రచంద్ర శాస్త్రికి రాష్ట్రపతి గౌరవ ప్రశంసాపత్రం లభించింది. స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా భారత రాష్ట్రపతి దానిని ఆయనకి ఆగస్టు 15న బహూకరించారు. ఈయన బహుగ్రంథకర్త. 70 గ్రంథాలని, 600 పరిశోధనా పత్రాలని ఈయన రచించారు. ఢిల్లీ విశ్వవిద్యాలయానికి చెందిన స్నాతకోత్తర అధ్యయన సంస్థలో సంస్కృత శాఖాధిపతిగా ఆయన అనేక సంవత్సరాలు పని చేశారు. 1961లో గ్లాకోమా అనే కంటి జబ్బు కారణంగా ఆయనకి కనుచూపు కరువైంది. కాని విద్యారంగంలో తమ అవిరామ కృషిని కొనసాగించటానికి ఆయనకి అది ఆటంకం కాలేదు. ఆ తర్వాత కూడా కొందరు సహాయకుల తోడ్పాటుతో అయన ఎన్నో గ్రంథాలని రచించారు..... □

# వారఫలం

### 26-9-1986 శుక్రవారం మొదలు 2-10-1986 గురువారం వరకు

★ **మేషం** : గ్రహమండలంలో కొన్ని మార్పులు వచ్చాయి. రాహుకేతు గ్రహాల మార్పు మీకు సత్ఫలాలు ప్రసాదిస్తాయి. ఒకవేళ, 'రాహువు' వలన అధిక వ్యయం జరుగవచ్చు. ఏమయినా రాబడి ఉన్నది గదా! నూతన ప్రయోగం వ్యాపార సంబంధంగా లాభదాయకం. స్త్రీలకు : లాభం, వృత్తి యందు మేలు, పేరుప్రతిష్ఠలుంటాయి, బంధు సమాగమం.

★ **వృషభం** : అదృష్టవంతమైన కాలం రానున్నది. అందుకు ఈ వారం నాంది. వ్యాపారం బాగా సాగుతుంది. ఉద్యోగంలో అసాధారణ మార్పులు రానున్నవి. అవి, ఆనందదాయకాలు. ఏ విషయంలో కూడా త్వరపడకండి. స్త్రీలకు : వృత్తి యందు మేలు, రాజకీయంగా మేలు, ప్రజారంగాన, ఉద్యోగాన పేరు ప్రతిష్ఠలు రానున్నాయి. గమనించండి.

★ **మిధునం** : అసాధారణమయిన కార్యాలు నిర్వహింపనున్నారు. గ్రహమండలమందలి యిటీవలి మార్పులు మీకు లాభదాయకాలు, అయినా అపుడపుడు మీలో ఉద్రేకం రావచ్చు, జాగ్రత్త. ప్రయాణాల వలన ప్రయోజనం లేదని గ్రహించాలి. స్త్రీలకు : కొందరకు గృహ మార్పులు, కొందరకు స్థల మార్పులు.

★ **కర్కాటకం** : ఆలోచించిగాని మరి కార్యారంభం చేయకండి. ఆదాయానికి మించిన వ్యయం చేయకండి. అలాంటి పరిస్థితులు ఈ వారమందు ఉన్నాయని గ్రహించండి. వృత్తి యందు పెంపు చేకూరుట గమనించాలి. స్త్రీలకు : ఆదాయం, ఆనందం, అనుకూలం. ఆత్మీయుల సమాగమం. ఆర్థికానందం.

★ **సింహం** : భాగస్వాములతో సర్వవిధాలా జాగరూకతతో మసలుకోవాలి, కుటుంబ గౌరవానికి లోటు రాకుండా చూచుకోవాలి. ఒకానొక వ్యక్తి మీరు ఆశించిన సహాయం చేస్తారు. వారికి ఎలాంటి శ్రద్ధ చూపాలో? స్త్రీలకు : అప్రయత్న ధనలబ్ధి, కుటుంబానందం.

★ **కన్య** : ఆరోగ్య విషయంలో జాగ్రత్త పడాలి. ఒకానొక వ్యవహారంలో మేలు జరుగుట వలన మీలో నూత్నోత్సాహం వెల్లివిరుస్తుంది. కుటుంబ వ్యవహారాలలో చిక్కులు రాకుండా, చుట్టుపట్ల వారితో గొడవలు రాకుండా చూచుకోవాలి, ధనాదాయమున్నది. స్త్రీలకు : కుటుంబ బాధ్యతలు అధికం కావటం, రాజకీయంగా మేలు జరుగుట సంభవం. గ్రహించండి.

★ **తుల** : గ్రహానుకూలతగలదు గాని, కేతు' గ్రహమూలాన లేనిపోని యిబ్బందులుండవచ్చు. రాజకీయరంగాన కొందరకు చికాకు కలుగవచ్చు. ఇంటిలో దొంగతనం జరుగుటకు అవకాశమున్నది. జాగ్రత్తగా ఉండాలి. స్త్రీలకు : గృహభారం, ధనాభావం, సుఖశాంతులకు లోపం.

★ **వృశ్చికం**: దూరభారాలకు పోవాలని సంకల్పించినది సాగకపోవచ్చు. ఒకవేళ సాగినా పెద్దగా లాభదాయకంగాదు. వ్యవహారరీత్యా అనుకూలం గాదు. వస్తు సేకరణకు అనుకూలం గాదు. విద్యా విషయంగా కూడ పెంపు చెప్పుటకు వీలులేదు. స్త్రీలకు : రచన, నాట్య, నాటక పరిచయము ఉన్న వారికి సదవకాశాలే కాక ఆదాయం కూడా ఉన్నది.

★ **ధనుస్సు**: రాజకీయంగా ఒక అడుగు ముందుకు పోగలరు. పెద్దల వలన కొన్ని వ్యవహారాలు సులువుగా పరిష్కరింపబడుతాయి. వారమంతా ఉత్సాహజనకంగా ఉంటుంది. ఆగిన నిర్మాణ కార్యక్రమం మరలా కొనసాగించుటకు అవకాశమున్నది. స్త్రీలకు : దూరప్రాంతాల నుండి బంధువులు యింటికి రావచ్చు. శుభ కార్యాలోచనలు.

★ **మకరం** : అనేకవిధాల మేలున్నది, కొందరకు అప్రయత్నంగా ధన వసతి ఏర్పడుతుంది., కొంత ప్రశాంతత ఏర్పడుతుంది. ముఖ్య మిత్రులతో గొడవలు రాకుండా చూచుకోవాలి. విశ్రాంతికి అనుకూలం. ఒకానొక ప్రధానమైన వ్యాపార సంబంధమైన వ్యవహారం పరిష్కరింపబడుతుంది. స్త్రీలకు : వృత్తి యందు మెరుగు, 'ప్రమోషన్' ఆశింపవచ్చు.

★ **కుంభం** : రాజకీయంగా మేలుగాదు. చాలమందికి చిక్కిన అవకాశాలు జారిపోవచ్చు. వ్యాపారం సుకరంగా సాగదు. ఇతరులకు యివ్వవలసిన డబ్బును గూర్చిన చిక్కులుంటాయి. ప్రయాణాలు సాధ్యమైనంతలో ఆపి వేయటం మంచిది. చిక్కులు తటస్థించవచ్చు. స్త్రీలకు : గృహానందం. ఆశించినట్లు ధనలబ్ధి.

★ **మీనం** : వారఫలం అనుకూలం ఆశించినట్లు పనులు నెరవేరుతాయి. పెద్దలతో పరిచయం, వ్యవహారరీత్యా అనుకూలం. స్త్రీలతో చికాకులు ఏర్పడవచ్చు. అధిక వ్యయంతో చిక్కులు రావచ్చు. గమనించి మెలగాలి. వారంలో అప్పుడప్పుడు పనిగట్టుకొని పొగడే వారున్నారు. గమనించండి. స్త్రీలకు : ధనం ఆశింపవచ్చు, ఉద్యోగరీత్యా అనుకూలత ఆశింపవచ్చు, వస్తు సేకరణకు అవకాశమున్నది. గ్రహించాలి.

–విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

# "లవంగ నూనె లేని టూత్ పౌడరు నాకు పనికిరాదు"



"నాకిష్టమైన టూత్‌పౌడరు ప్రామిస్. ఎందుకేమిటి, దీన్లో లవంగ నూనె ఉంది! అందుకే ఇది ఊరూరా పేరు మోసింది. లవంగ నూనెలో రెండు గొప్ప సుగుణా లున్నాయి. ఇది చిన్నచిన్న బాధలనుంచి పళ్లను సదా కాపాడుతుంది. పైగా పళ్లకు చెడుపుచేసే సూక్ష్మజీవులు దీనిదెబ్బకు నశించిపోతాయి.

ఇందువల్ల పళ్లు గట్టిగా ఉంటాయి. దీని మరొక గొప్ప గుణమేమిటంటే, ఇది నోటిని తాజాగా, సువాసనగా ఉంచుతుంది. అంటే మనం మాట్లాడుతుంటే ఎదుటి వాళ్లు మొహం తిప్పుకోరన్నమాట!

మరొక ముఖ్య విషయమేమిటంటే, ప్రామిస్‌లోని సద్గుణాలతో పోలిస్తే దీని వెల చాల తక్కువ. దీనిపైన పెట్టిన పైసపైసకూ మనకు ఫలితం దక్కుతుంది.




30 గ్రా. పేకెట్ కూడా లభిస్తుంది.

నన్నడిగితే ప్రామిస్ టూత్‌పౌడరే తెచ్చుకోమంటాను. ఇది లవంగ నూనెతో నిండినది. బల్సారా వారు ఎంతో ఆలోచనతో సృష్టించినది".

## లవంగ నూనెతో అద్భుత సృష్టి

# ప్రామిస్
## టూత్‌పౌడర్



బల్సారా—
టూత్‌పేస్ట్ విశేషజ్ఞులు



CHAITRA-B BLS 828 TEL

# నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు?

## జొన్నలగడ్డ లలితాదేవి

అప్పుడే కాలేజీనించి వచ్చింది వినత. ఆమె వచ్చేసరికే గుమ్మంలో నిలబడి వుంది ఆమె తల్లి విశాలాక్షి.

"వచ్చావా? నీ కోసమే ఎదురు చూస్తున్నాను. మన సుభద్రమ్మగారి మొగుడు పోయాడట. చూసి వద్దాం రా!" అంది గబగబా.

ఆ మాట వినగానే ప్రాణం చివుక్కుమంది వినతకి. ఒకసారి ఆమె కళ్ళముందు సుభద్రమ్మ, ఆవిడ భర్త, ఆవిడ పిల్లలు అందరూ గిరగిరా తిరిగారు.

ఆమెకి అట్టే వయసు లేదు- పిల్లలు కూడా చిన్నవారు. ఇంకా చేతికందని వాళ్ళు. ఆమె భర్త రెక్కలే ఆ యింటికి ఆధారం. తనకి తెలిసినంతవరకూ వాళ్ళకి పెద్ద ఆస్తి పాస్తులు కూడా వున్నట్టు లేవు.

"మరి పాపం! వాళ్ళ యింటి పరిస్థితి ఎలా?" ఇలా దిగులుపడుతూనే తల్లి వెంట నడిచింది వినత- ఆ యిల్లు చేరేసరికి ఆమె అంచనాకి భిన్నంగా ఏమీలేదు. తల్లి- పిల్లలు అంతా గోలపెడుతున్నారు.

"తల్లీ! నీ కెంత కష్టం వచ్చిందే!" అంటూ విశాలాక్షి సుభద్రను పట్టుకుని ఏడ్చింది.

"అంతా నేను చేసుకున్న పాపం అక్కయ్యా! ఏ జన్మనో నవ్వుతూ చేశాను- ఈ జన్మలో ఏడుస్తూ అనుభవిస్తున్నాను. లేకపోతే ఆయన అర్ధాంతరంగా గుండె నెప్పి వచ్చి పోవడం- మా బతుకులు ఇలా నాశనం అవడం" అంది ఏడుపుల మధ్య మూడు పదుల సుభద్ర.

"ఏం చేస్తాం? వూరుకోమ్మా! ఏది మన చేతిలో లేదు. ఆ పిల్లల్ని చూసుకుని ధైర్యం తెచ్చుకోవాలి!" అంటూ ఓదార్చింది విశాలాక్షి.

ఇలాగే అంతా ఏడుస్తున్నారు- ఓదారుస్తున్నారు వెడుతున్నారు.

వినత తల్లితో ఇంటికి వచ్చేసింది. మరో తొమ్మిది రోజులు గడిచాక-

పొద్దున్నే చీకటితో నే లేపింది విశాలాక్షి వినతని.

"వినతా! కాస్త ఈ పూటకి వంటా అదీ నువ్వు చెయ్యి- ఇవాళ పదో రోజు- ముఖం చూసి రావాలి" అంటూ గబగబా చెప్పింది.

"అంటే ఏమిటి?" అమాయకంగా అడిగింది.

"ఈ రోజుతో సుభద్ర పసుపు కుంకుమ సరి. అయినా అన్నీ నీకు వివరంగా చెప్పాలి." అంటూ విసుక్కుంది.

ఆ మాటతో చాలావరకూ వూహించేసింది వినత-

"ఈ రోజు జరిగేతంతు అంతా అమానుషంగా కనిపిస్తుందమ్మా నాకు. నువ్వు వెళ్ళకుండా వుంటే మంచిది."

"నువ్వు నోరుమూసుకో. అవన్నీ సాంప్రదాయం. పద్ధతులు. గాజులు, బొట్టూ అన్నీ తీయించాలి. అది తప్పదు."

తల్లి వెళ్ళే హడావుడిలో వుంది.

"భర్త పోయాడన్న బాధ కంటే ఆ పోయినప్పుడు అనుసరించే పద్ధతులకే దడిసిపోయి ప్రతి ఆడదీ సుమంగళిగా పోవాలనే కోరుకుంటుంది. అయితే అందరికీ ఆ కోరిక నెరవేరదు."

"జీవితాంతం తోడుగా నడవాల్సిన భర్త మధ్యలోనే చేయి వదిలి కనుమరుగైతే జీవితాంతం ఆ బాధ ఎలాగో తప్పదు. దాన్ని అలా వుంచి ఈ సాంప్రదాయాలంటూ చిన్నవారిపై రుద్దడం మంచిది కాదమ్మా! ఏదో తలపండిన వృద్ధురాలు ఏతంతువైనా ఏ మూలకూర్చున్నా ఏ రకంగా వున్నా ఇబ్బంది లేదు. పిల్లలు పెద్దవారవుతారు. ఏదో మూలవున్నా ఇంత తిండి పడేస్తారు. మరి చిన్న పిల్లల్ని పెట్టుకుని వారిని పైకి తీసుకు రావడానికి ఏదో ఉద్యోగం, సద్యోగం చూసుకోవలసిన సుభద్ర అలా మూల కూర్చోవడానికి వీలవుతుందా?" బయటకిరాక తప్పుతుందా? ఇలా బోసి ముఖం, గాజుల్లేని చేతులతో నలుగురి మధ్య తను భర్తృవిహీన అని గుర్తు తెచ్చుకుంటూ పని చేసుకుంటున్నా కుమిలి పోవాల్సిందేగా?"

"ఏదైనా నడతలో వుండాలి గాని- అది లేనివాళ్ళు, భర్త చాటున మాత్రం సాగించుకోరా వ్యవహారాలు? భర్త 24 గంటలూ కాపలా వుంటాడా, అలాంటి దుష్టబుద్ధి వున్నవాళ్ళకి."

ఇవన్నీ వినత ఆలోచనలే- ఒక్కటీ పైకి అనలేదు- అంటె తల్లికి తిమయిందని తిట్టి పోస్తుంది. పెళ్ళి పేరంటం కాని దానికి ఇన్ని ఆలోచనలా అని తిడుతుంది.

అందుకే జరిగేవన్నీ మౌనంగా చూస్తుండి పోయింది.

కాలచక్రం గిరగిరా తిరిగింది. వినత బి.కాం. ఫస్టుక్లాసులో ప్యాసయింది. తండ్రి పెళ్ళి చేస్తానన్నా వద్దని మొండికేసింది వినత.

బ్యాంకి పరీక్షలు రాసింది. అదృష్టం తన్నుకు వచ్చి ఆమెకి బ్యాంకులో జాబ్ దొరికింది. అదీ ఆ వూళ్ళో కాదు- మరో వూళ్ళో- మరో వూరుకాక పోయినా మరో వూరుకు వేయించుకోవాలనే అనుకుంది- అది వాళ్ళే చేసారు.

నెల కింతని ఖచ్చితంగా ఇంటికి డబ్బు పంపేది.

"దీని చెల్లెళ్ళకన్నా పెళ్ళి చేస్తే పోతుంది- దానికేదో దెయ్యం పట్టింది!" అని నిర్ణయించుకున్నారు తల్లీ దండ్రి విసుగ్గా.

ఆ మాటకి ఏం దడవలేదు వినత.

చేసుకోమనే రాసింది.

మరో మూడేళ్ళు గడిచాక తల్లీ దండ్రి గుండెలు బాదుకుంటూ వచ్చారు.

"ఏమే! నీకేం పోయే కాలమే- లక్షణంగా పెళ్ళి చేస్తామంటే వద్దని ఇలాంటి చాటు వ్యవహారాలు చేసి పిల్లాడిని కంటావా? అంటూ కారాలు మెరియాలు నూరసాగారు వస్తూనే.

"ఆగండి- మీ మాటలేనా నా మాటలు వింటారా?" అంది తీవ్రంగా పిల్లాడిని ఉయ్యాల్లోవేస్తూ.

"ఏమిటో చెప్పు." అంది విసుగ్గా విశాలాక్షి. పిల్లాడినే తీక్షణంగా చూస్తూ.

"మీ సాంప్రదాయాలు పద్ధతులు అంటే నాకు మంట- బయటకి వెళ్ళిన మగాడు యాక్సిడెంట్ అవకుండా తిరిగి సవ్యంగా యింటికి వస్తాడో రాడో నమ్మకంలేని ఈ రోజుల్లో ఒక మగాడిని పెళ్ళాడి అతగాడు ఖర్మంజాలక పోయాడంటే మీ సాంప్రదాయ పద్ధతుల్లో జరిపే చిత్రవధ నేను పడలేను. పడను. ఒక ఆడదాని కుంకుమ చెరపడం కోసం ఎంతమంది ఆడవాళ్ళు ఆ నాడు పోగయ్యారో నాకు సుభద్ర పిన్నితోనే తెలిసిపోయింది. అందులో

### ఆమె....!

నాడు –  
కన్నె పిల్లగా  
కలలు కనేటప్పుడు  
కట్నం అడిగిన వారి మీద  
కస్సు బుస్సు లాడేది.....  
నేడు –  
కన్న తల్లిగా  
కన్న కొడుక్కి  
కట్నం యివ్వమని  
కచ్చితంగా అడుగుతోంది....!

–క్షైప్రు ఆదిశేషారెడ్డి

ఏ ఒక్కరూ ఆమెగాని ఆమె పిల్లలుగాని ఏమయ్యారో పట్టించుకోలేదు. గ్రుక్కెడు గంజిపోయలేదు. పక్క వాటావాళ్ళు కడుపులో కాళ్ళు పెట్టుకొని ఏడుకుంటే ఇవతల వాళ్ళు పంచభక్ష్య పరమాన్నాలతో విందులు చేసుకుంటూ ఆనందంగా గడుపుతూ కేరింతలు కొడతారేగాని "పాపం వాళ్ళింట్లో పిల్లలు తిన్నారో లేదో." అని కనీసపు ఆలోచనకూడా రాని సమాజం మనది.

ఈ సమాజాన్ని ఏ యువతరం మార్చలేదు ఇంతల్లో

వివాహంలో ముఖ్యోద్దేశం సంతానం- లేవలేనినాడు కాలు చెయ్యి అవుతారనే ప్రతివాళ్ళు సంతానం కావాలని కోరుకుంటారు- అందుకే నేను ఈ బాబుని కన్నాను- ఎలాగంటావా వీడు టెస్ట్‌ట్యూబ్ బేబీ- వీడి తండ్రెవరో నాకు తెలియదు- నాకు కావలసింది మాతృత్వం- జీవితాంతం ఇలా పూలు- కాటుక గాజులుతో కళకళ లాడటం- అందుకే నాకీ పద్ధతి నా భావాలకు నా కోరికలకు అనుగుణ్యంగా తోచింది కన్నాను - అంతే- మీరేం గొంతు చించుకోనక్కర్లేదు." పెద్ద ఉపన్యాసమే ఇచ్చింది వినత తన మనస్సువిప్పి చెబుతూ - ఆ మాటవిని తెల్ల ముఖంవేశారు తల్లీదండ్రీ. "మండినట్లే వుంది తెలివి- ఎవరో అర్భాయిష్షుగా చచ్చాడని అంతా అలా చస్తారా! అంతా దౌర్భాగ్య రాళ్ళేవుంటారా?" తీక్షణంగా అడిగింది తల్లి.

నా అదృష్టం దురదృష్టం నువ్వేం చూసివచ్చావమ్మా. దౌర్భాగ్యరాళ్ళల్లో ఒకత్తెని అయితే, అందుకే ఈనాటి అభివృద్ధి చెందిన సైన్సుకు నేను అభినందనలు తెలుపుతున్నాను.

"అమ్మే రిస్నావు- సైన్సువల్ల పిల్లాడిని కన్నానంటే అక్కడ అందరూ నమ్మద్దూమాలాగో"

"నమ్మకపోతే చావని- నాకేం- చక్కగా గ్యాస్ పొయ్యిలు. కుక్కర్లు- వగైరా అధునాతన సామగ్రి అంతా మీరు వాడుకోవడంలేదూ! అవన్నీ సైన్సువల్లేగా వచ్చింది? పాతపద్ధతి ప్రకారం వండాలంటే పొయ్యితో తలపడుతూ కూర్చోవాలి. ఏది అలా వుంటున్నారా? మీ యిష్టమైనవి మీరలా వుపయోగించుకుంటున్నారో- నా కిష్టమైంది నేను



ఉపయోగించుకుంటున్నా- ఒకరు నవ్వితే ఎవరికి కావాలి- ఒకరు ఏడిస్తే ఎవరికి కావాలి.! అంది ఏకిపారేస్తూ వినత- "ఇది ముందునించి మొండిదే! మా ఖర్మ అనుకుంటూ తిరుగు బందితో వెళ్ళిపోయారు తల్లీదండ్రి. □

# మహాగాఢ మత్తులోకి దింపి చిత్తుచేసే మాదకద్రవ్యాలు!



కొకాయిన్‌ని గ్లాస్ పైప్‌లో పెట్టుకొని సేవిస్తున్న పదహారేళ్ల అమెరికన్!

మాదక ద్రవ్యాల సమస్య నేడు విశ్వవ్యాప్తంగా ఉంది. ఈ సమస్య రోజురోజుకూ తీవ్రతరమై యువతరాన్ని నిర్వీర్యం చేస్తోంది. పసి బాలలు సయితం ఈ మాదక ద్రవ్యాల రుచిలో పడి నిండు నూరేళ్ళ జీవితాలను చింకి కాయితాలుగా చేసుకోవడం చూస్తుంటే ఎంతో బాధ వేస్తుంది. ఈ మాదక ద్రవ్యాల సమస్యను కనుక అరికట్టలేక పోతే మహమ్మారిలా అది విజృంభించి మానవజాతి పతనానికి దారితీస్తుంది.

మాదక ద్రవ్యాల రవాణాకు భారత్ ముఖ్యకూడలిగా ఉండడం ఆశ్చర్యకరమే కాక విచారకరం కూడా! ప్రపంచంలో కెల్లా అత్యధిక స్థాయిలో చట్ట సమ్మతమైన నల్ల మందును ఉత్పత్తి చేస్తున్న దేశం మనదే! అయితే ఈ నల్ల మందులో 20 నుంచి 30 శాతం అక్రమ మార్కెట్‌లోకి చేరవేయ బడుతోందని ఒక అంచనా. ఈ మధ్య కాలంలో భారత్ మీదుగా మాదక ద్రవ్యాల అక్రమ రవాణా జరగడం అధిక మైందనీ, స్మగ్లర్లు నల్లమందు ఉత్పత్తులను బర్మా, పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌ల నుంచి భారత్ ప్రధాన కేంద్రంగా వివిధ దేశాలకు సరఫరా చేస్తున్నారనీ అమెరికా విదేశాంగ శాఖకు చెందిన అంతర్జాతీయ మాదక ద్రవ్య వ్యవహారాల సంఘం అభిప్రాయ పడడం ఎంతైనా వాస్తవం. భారత్‌లోని బొంబాయి, న్యూఢిల్లీ పట్టణాలు ఈ కార్య కలాపాలకు ముఖ్య కేంద్రాలుగా ఉన్నట్లు వార్తలు తెలుపు తున్నాయి.

పశ్చిమ ఆసియా, తూర్పు ఆసియా ప్రాంతాల నుంచి పశ్చిమదేశాలకు ముఖ్యంగా యూరోప్, అమెరికా సంయుక్త రాష్ట్రాలకు రవాణా అయ్యే మాదక ద్రవ్యాలతో ప్రముఖంగా పేర్కొనదగ్గవి హెరాయిన్, ఓపియమ్, హషిష్, మాండ్రాక్స్, మార్ఫిన్‌లు! వీటిలో హెరాయిన్, ఓపియమ్, మార్ఫిన్‌లను పాప్పి మొక్క నుంచి సంగ్రహిస్తారు. ఈ మొక్కను శాస్త్రీయంగా "పపావర్ సోమ్ని ఫెరమ్" అనిపిలుస్తారు. హెరాయిన్‌లోనూ ఓపియమ్ లోనూ అత్యధికంగా ఉండే ఆల్కలాయిడ్ మార్ఫినే! నొప్పిని తగ్గించ డానికి దగ్గును నివారించడానికి ఓపియమ్‌ను మందు లాగా వాడడం మంచిదే కాని, మితిమీరి వాడితే,



ఇదే నల్లమందు! దీనితో కొందరు బంగారం చేసుకొంటారు. మరికొందరు శ్మశానం చేరుకొంటారు.

వాంతులు, తల తిరగడం, కళ్ళు భైర్లు కమ్మడం వగైరా లక్షణాలు ఏర్పడుతాయి. హెరాయిన్‌ను దగ్గు నివారించడం కోసం 1898లో మొదటి సారిగా వాడారు. దీని రసాయనిక నామం డై అసిటైల్ మార్ఫిన్! ఇక పోతే హషిష్ అనేది ఇండియన్ హెంప్ మొక్క నుంచి వచ్చిన రెజిన్! "టెట్రా హైడ్రో కన్నాబినాల్" అనేది దీని రసాయనిక నామం. దీనితో పొగపీల్చడం రివాజు. హెంప్‌ను భంగ్ అనీ గంజాయి



క్రాక్ రాక్స్! మనుషుల్ని చంపుకుతినేవి!!

అనీ పిలుస్తారు! ఈ మొక్కను వృక్ష శాస్త్ర పరిభాషలో "కన్నాబిస్ సటైవా" అని అంటారు!!

ఇకపోతే ఇటీవల బ్రవున్ షుగర్ అనేది ఒకటి రంగంలోకి వచ్చింది. ఇది నాటురకపు మాదకద్రవ్యం. ఇందులో మాండ్రాక్స్ ఎక్కువ మోతాదులో ఉంటుంది. దీనితో పాటు దత్తురిన్, ఫినాయిల్, జింక్ ఆక్సైడ్‌లు కూడా ఉంటాయి. ఎలుకల మందు కూడా ఇందులో కలుపు తున్నారని వినికిడి. బ్రవున్ షుగర్‌ను సూదిమందులా వేసుకోవచ్చు లేదా పొగచుట్ట చేసుకొని పీల్చవచ్చు. మాండ్రాక్స్ వల్ల కళ్ళు భైర్లు కమ్మి తల తిరుగుతుంది. ఊహాతీత మైన అచేతన స్థాయిలోకి విభ్రాంతితో నిండిన అనుభూతిలోకి వెళ్ళిపోతారు. దత్తురిన్ వల్ల కళ్ళు మూతలు పడి సోలి పోతాయి. ఫినాయిల్ వల్ల ఒళ్ళు గగుర్పొడుస్తుంది. జింక్ ఆక్సైడ్ వల్ల శరీరం తేలిపోతుంది. ఇలాగ బ్రవున్ షుగర్ సేవించడం వల్ల స్వర్గంలాంటి తియ్యటి అనుభవం మొదలై చివరికి నరక కూపంలోకి దిగబడిపోవడం తటస్థించుతుంది.

బ్రవున్ షుగర్ భారత్‌లో వెర్రి తలలు వేస్తుంటే కొకాయిన్ అమెరికా నంతా ఊపివేస్తోంది. హెరాయిన్ సూది మందులా వేసుకోవాలి. సిరింజ్ వాడక తప్పదు. సిరెంజ్‌లను. విచ్చల విడిగా వాడడం వల్ల ఎయిడ్స్ ప్రబలే ప్రమాదముంది. అందుకని మాత్రలు లాగా మ్రింగే "క్రాక్ రాక్స్"ను (కొకాయిన్‌ను) సేవించడం ఇటీవల కాలంలో అమెరికన్‌లు మొదలు పెట్టినట్లు ది నేషనల్ కొకాయిన్ హాట్‌లైన్" సంస్థ రిసర్చ్ డయిరక్టర్ డా. ఆర్నాల్డ్ వాషటన్ వెలిబుచ్చడం విస్మయాన్ని కలిగిస్తుంది. ఆరు నెలల కాలంలోనే పది లక్షల మంది కొకాయిన్‌ను సేవించడం ప్రారంభించారని



నిషాకుషి నందించే హెరాయినే "ఎయిడ్స్" అనే మృత్యువును కూడా అందిస్తోంది!



హెరాయిన్ స్వీకరిస్తున్న ఒక్ల వ్యక్తి

**అంచనా!**

మాదకద్రవ్యాలను లేదా "నార్కొటిక్స్"ను ప్రముఖంగా ఉత్పత్తి చేస్తున్న దేశాలు ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, బర్మా, థాయిలాండ్‌లు కాగా భారత్ రవాణాకు కూడలిగా ఉంది. బొంబాయి పట్టణం ఈ రవాణాలో ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తోంది. "డయిరక్టరేట్ ఆఫ్ రెవిన్యూ ఇంటెల్లిజెన్స్" వారి అంచనా ప్రకారం బొంబాయిలో బ్రవున్ షుగర్‌ను చప్పరించేవారు 80 వేలమందికి పయిగా ఉన్నారు. రోజూ10 కిలో గ్రాముల బ్రవున్ షుగర్ స్వాహా అవుతోంది! వాస్తవానికి 1980 నుంచే బొంబాయిలో ఈ వ్యవహారాలు చురుగ్గా మొదలయ్యాయని ఊహించడం జరుగుతోంది. గుజరాత్, రాజస్థాన్‌లలో చట్ట వ్యతిరేకంగా నల్లమందును భారియెత్తున తయారు చేసు

బ్రవున్ షుగర్‌ని పొగరూపంలో పీల్చుతున్న బొంబాయి యువకుడు



న్నట్లు వార్తలు వినవస్తూనే ఉన్నాయి.

ఏ రకపు మాదకద్రవ్యాన్ని ఏ విధంగా సేవించినా చెడు ఫలితాలు మాత్రం తప్పవు. అవలక్షణాలు బయటపడేనాటికి ప్రాణాంతకం కావచ్చు. ఈ మాదకద్రవ్యాలు హృదయంమీద, ఊపిరితిత్తుల మీద, మెదడు మీద, చర్మంమీద బాగా ప్రభావాన్ని చూపెడుతాయి. హృదయ స్పందనం అధికం కావడం, రక్తపోటు పెరగడం జరగవచ్చు. మితిమీరి సేవించడంవల్ల ఒక్కొమారు గుండె కొట్టుకోవడం నిలిచిపోవచ్చు కూడా! ఊపిరితిత్తులకు ఆక్సిజన్‌ను చేరవేసే వాయునాళాలు సంకుచించుకొనిపోయి ఊపిరి ఆడకుండా నిలిచిపోవచ్చు. ఇకపోతే ఈ మాదకద్రవ్యాలు మెదడుమీద బాగా దెబ్బకొడతాయి. మెదడులోని మృదు కణజాలం విషపూరితం కావడం వలన మనిషిని నిస్సత్తువ ఆవహిస్తుంది. లేచి నిలబడే స్థితి కాదుకదా ఆఖరికి కూర్చొనగలిగే స్థాయి కూడా ఉండదు. అర్థంకాని ఆందోళన, భయం చోటు చేసుకొంటాయి. అస్థిరమైన ఆలోచనలు, పిచ్చి పిచ్చి ఊహలు, అసందర్భ ప్రేలాపనలు, ఉన్మాదం ప్రకోపించిన వికృత చేష్టలు సర్వసాధారణమై పోతాయి. సైకోసిస్, నెర్వోసిస్‌లకు దారితీసి చివరికి మనిషి మరణానికి చేరువవుతాడు. చర్మంమీద నల్లులు ప్రాకుతున్నట్లు గిజగిజలాడిపోతాడు. మాదకద్రవ్యం నిషాలో ఉన్నవారు! వీరికి ఆకలి వేయదు. ఏ కొంచెం కూడా తినలేరు. బరువును కోలుపోతారు. అందం, ఆకర్షణ, ఆరోగ్యం, పరువు, ప్రతిష్ఠ అన్నీ గంగలో కొట్టుకొనిపోతాయి. ఆత్మీయుల ఆదరణకు కూడా నోచుకోకుండా పోతారు. సమాజానికి ఏ విధమైన సేవా చేయకుండానే వ్యర్థులైపోతారు. స్వయంకృతాపరాధంతో ఆత్మ నాశనాన్ని కొని తెచ్చుకుంటారు.

ఏ విధంగా చూచినప్పటికీ మాదక ద్రవ్యాల వినియోగాన్ని అరికట్టడం అత్యంత ఆవశ్యకంగా కనిపిస్తోంది. వీటిని సేవించడం వల్ల కలిగే దుష్ఫలితాలను చిన్న వయస్సు నుంచే పసిపిల్లలకు వివరించి చెప్పడం చాలా అవసరమని మియామి యూనివర్సిటీకి చెందిన "ఫ్యామిలీ గైడెన్స్ సెంటర్" డయిరక్టర్ డా. జోస్ జాపోసిక్ అనడం గమనార్హం. ఇది ఉత్తమమైన పద్ధతిగా తోస్తుంది. ఇకపోతే ఈ మాదక ద్రవ్యాల బెడదను నివారించడానికి అమెరికా అధ్యక్షుడు రొనాల్డ్ రీగన్ ప్రకటించిన ఆరు లక్ష్యాల కార్యక్రమం కూడా ప్రపంచవ్యాప్తంగా అందరూ ఆచరించదగ్గది.



మాదకద్రవ్యాల మత్తులోంచి బైటపడ వెలుగు చూడాలని కోరుతూ ఇటీవల న్యూయార్క్‌లో జరిగిన ఊరేగింపు

మాదకద్రవ్యాల అక్రమ వినియోగానికి ఏమాత్రం సహకరించకూడదు. పాఠశాలల్లో వీటి దుష్ఫలితాలను గురించి స్పష్టంగా బోధించాలి.

వైద్య, మానసిక ఆరోగ్య కార్యక్రమాలను అభివృద్ధి చేయాలి. సర్వత్రా అంతర్జాతీయ సహకారం కొనసాగాలి. చట్టాలు కట్టుదిట్టంగా నిష్పాక్షికంగా

అమలు జరగాలి. మాదకద్రవ్యాలసమస్య గురించి ప్రజలలో మరింతగా అవగాహనను కలిగించాలి. ఈ ఆరులక్ష్యాలను సాధించగలిగితే, మాదకద్రవ్యాల

సమస్య ఉండకపోవచ్చు. అయితే ఈ లక్ష్యసిద్ధికి త్రికరణశుద్ధిగా ప్రతి ఒక్కరూ తోడ్పడితేనే తప్ప ఫలితం ఉండదు.

-డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

సీరియల్

# కరిగిన శిల




(గత సంచిక తరువాయి)

అనుకున్నట్టే పోలీసుల దగ్గర్నించి సరయుక్కూడా పిలుపొచ్చింది. వూహించనంత ధైర్యంగా వాళ్ళడిగిన ప్రశ్నలన్నింటికీ జవాబు చెప్పింది సరయు.

అవసరం అయితే మళ్ళీ పిలుస్తామనీ, ఈ కేసు తేలే వరకు వూరు విడిచి ఎక్కడికీ వెళ్ళొద్దనీ చెప్పి పంపేశారామెని.

తేలిగ్గా వూపిరి తీసుకుంది సరయు.

కేసు చకచక నడిచింది.

అనుమానించిన ఆఫీసులన్నీ తాత్కాలికంగా మూసేశారు. సంబంధం వుందన్న వ్యక్తులందర్నీ అదుపులోకి తీసుకున్నారు. పోలీసు శాఖ ఎన్నడూ లేనంత వుత్సాహంతో పనిచేసి దోషులందర్నీ పట్టుకున్నది.

హటాత్తుగా దాడి చెయ్యడం వల్ల ఆ కంపెనీ ల్లోని అవకతవకలు, నిగూఢ రహస్యాలు బైట పడ్డాయి.

స్మగ్లింగ్, వ్యభిచారం, మత్తు పదార్థాల మార్పిళ్ళు, దొంగనోట్ల వ్యవహారం, ఇంకా చాలా రకాల చీకటి వ్యాపారాలు సాగుతున్నాయక్కడ.

నల్లమందు, గంజాయి లాంటి, మత్తు మందులు, మార్ఫిన్, పెతిడ్రెన్ లాంటి ఇంజక్షన్ ఆంప్యుల్స్, ఎల్సెస్డి, మేండ్రెల్స్, గార్డినాల్ లాంటివి కో కొల్లలుగా దొరికాయక్కడ, మార్జువానీ సిగరెట్లు సరేసరి.

ఓ గదిలో పెద్ద బీరువానిండా వందల కొద్ది బ్లూ ఫిలిమ్ కేసట్స్!

మత్తు పదార్థాలకి బానిసల్ని చేసి తెలివిగా అనేక మంది యువతీ యువకుల్ని చేర్చి, వాళ్ళ చేత ఎన్నో ఘోరకృత్యాలు చేయిస్తూ, వారి తెలివిని, అందాల్ని డబ్బుగా మార్చుకుంటూ, పైకి పెద్ద మనుషులుగా తిరిగే అనేకమంది బ్రతుకులు బజారు పాలయ్యాయి.

ఎవరినోట విన్నా ఇవే మాటలు? ఏ పత్రిక చూసినా ఇవే వార్తలు! కష్టడీలో వున్నారు గానీ కనిపిస్తే కాల రాచెయ్యాలన్నంత వుద్రిక్తతలో వున్నారు జనం.

ఆ సమయంలో నే అజ్ఞాతంలో వున్న రమణ బైటికొచ్చాడు.

కేసు విచారణ పూర్తయింది.

జరిగిన కథ-13: ఎంత ప్రయత్నించినా తమ్ముణ్ని రక్షించుకోలేకపోతాడు శీను. చిన్నా మరణిస్తాడు. రమణే, శీను అని తెలుసుకుంటుంది సరయు. రమణ పట్ల ఆమెకు జాలి, సానుభూతి, అభిమానం పెరిగిపోయాయి. వనజ తీసుకువచ్చిన పెళ్లికొడుకుని చూసి ఆశ్చర్యపోయింది సరయు. అతను వేణుమాధవ్. తన ఆఫీసు గురించి పేపర్లో పడిన వార్త విని కంపించిపోయింది సరయు. తన ఆఫీసు గొడవల్లో వేణుమాధవ్‌కి సంబంధం ఉందని, అతన్ని అరెస్టు చేశారని వనజ చెప్పగా నిర్ఘాంతపోయింది. వనజ దంపతులు సరయుకి ధైర్యం చెప్పి వెళ్లారు.

ముఖ్యమైన ముద్దాయి కాంట్రాక్టర్ సాగర్‌తో సహా పెద్ద మనుషులుగా తిరిగే చాలా మందికి శిక్షలు పడ్డాయి. నిర్దోషులు బైటికొచ్చారు.

కోర్టులో, కేసు విచారణ సమయంలో రమణ చేస్తున్న వుద్యోగం తెలుసుకున్న సరయు నిర్ఘాంతపోయింది.

అతనో సి. ఐ. డి!

రౌడీగా, తాగుబోతుగా, తిరుగుబోతుగా తను వూహించుకున్న వ్యక్తి ఓ బాధ్యత గల ఆఫీసర్. దొంగల్ని, హంతకులని, దోపిడీ ముఠాల్ని తెలివిగా పట్టి ప్రభుత్వానికి అప్పజెప్పే సి. ఐ. డి ఆఫీసర్?

ఛ! తనెంత పొరపడింది! తల్లి అతనికి చేసే మర్యాదలకి మండి పడింది. ఆనాడు జ్వర తీవ్రతలో వున్నాడనైనా చూడకుండా తూలనాడింది.

అయినా అతను తనని తూలనాడలేదు! అతని చూపుల్లో చెప్పలేని భావం! అది 'ఆరాధన' అని చాలా ఆలస్యంగా తెలుసుకుంది తను!" భారంగా నిట్టూర్చింది సరయు. సూదుల్లాంటి అతని చూపులు గుర్తొచ్చి వెంటనే ఆమె పెదవుల మీదికి సన్నని నవ్వు తెర వెలిసింది.

అయితే ఆ నవ్వు ఎక్కువ సేపు నిలువలేదు. ఒక సంగతి హటాత్తుగా గుర్తొచ్చి ఆమె మొహం చిన్నబోయింది. ఆ సంఘటన కళ్ళకి కట్టినట్టు కనిపించిందామెకి

ఆ రోజు కోర్టులో తీర్పు వినగానే కిటకిట లాడుతున్న జనం హర్షధ్వానాలు చేశారు. విద్యార్థులు ఆనందంతో గంతులు వేశారు. ఈ విజయానికి ముఖ్య కారకుడైన రమణని అమాంతం పైకి ఎత్తేసి జేజేలు కొట్టారు.

ఆ అభినందనలకి వుక్కిరి బిక్కిరి అయిన రమణ ఎలాగో బైటపడి తేలిగ్గా వూపిరి తీసుకో బోయి తృళ్ళిపడ్డాడు. కారణం సరయు!

ఎదురుగా చిరునవ్వులు చిందిస్తూ పరుగులాంటి నడకతో అతనికోసే వస్తున్న సరయుని చూసి క్షణం తికమకపడి చూడనట్టు నాలుగడుగులు వేశాడు రమణ.

అయితే అతని ప్రయత్నం ఫలించలేదు.

"మిస్టర్ రమణా!' అరిచింది సరయు.

అప్రయత్నంగా అటు చూశాడు తను.

"ఏవిటి నన్ను చూడగానే అలా పారిపోతున్నారు". దగ్గరికొచ్చి చిన్నబోయిన మొహంతో అడిగింది సరయు.

"సారీ!.... మిమ్మల్ని చూడలేదు!" ఎటో చూస్తూ అన్నాడు రమణ.

"అవును మరి! ఆకాశంలోకి చూస్తుంటే నేనెలా కనిపిస్తాను!" చనువుగా అందామె.

రమణ మాట్లాడలేదు.

కంగ్రాచ్యులేషన్స్!" అంది సరయు మనస్ఫూర్తిగా.

థాంక్స్!" ముక్తసరిగా అన్నాడు రమణ.



"కేసంతా మొదట్నుంచీ విన్నాను. మీ ధైర్య సాహసాలు! అబ్బ!.... ఇంకెవరికీ వుండవు!" చిలిపిగా అంది సరయు.

"థాంక్స్!" పరధ్యానంగా అన్నాడతను.

"నా వుద్యోగం పోయింది".

"రియల్లీ – అయామ్ వెరిసారి!" దోషిలా అన్నాడు రమణ.

"సారినా? ఎందుకు?"

"నామూలంగానే ---"

"ఛ ఛ! అదేం లేదు. నా కిప్పుడే హాయిగా వుంది..... అయినా నేనే ఆ వుద్యోగాన్ని ఒదిలేసే దాన్ని! తెలిస్తే?"

"ఏం?"

"అలాంటి సంస్థల్లో పని చేసే కన్నా పస్తులుండడం మంచిదని నా అభిప్రాయం!" కాస్త గర్వంగా అంది సరయు.

"ఊఁ!"

"అందుకే నే నొకటి చెయ్యాలనుకుంటున్నాను....." అతన్నే పరిశీలనగా చూస్తూ అంది సరయు.

## కరిగిన శిల

"............"

"ఏవిఁటని అడగరేం?" దబాయించింది.

"అవును..... ఏవిఁటి?" తడ బడ్డాడు రమణ.

"అబ్బ! చిలక పలుకులు!" నవ్వేసింది సరయు.

ఆమె నవ్వుకు అతని హృదయం అదోలా పరవశించి పోయింది. కానీ ఆ భావాన్ని అతి ప్రయాసగా దాచేసుకుని–

"సారీ! చాలాటైమయింది!– అర్జంట్‌గా ఓ ఫ్రెండ్‌ని కలవాలి! వస్తానూ!" వాచ్ చూసుకుంటూ రెండడుగులు వేశాడు.

"ఆగండాగండి! – ఏవిఁటీ. మా ఇంటికి రాకుండానే వెళ్ళి పోదావఁనా మీ వుద్దేశం?" చిరుకోపంగా అంది సరయు.

"అబ్బే!..... వస్తాను....."

"ఎప్పుడు?"

"రేపు......"

"నిజవేఁనా?"

"నిజం...... !" మెరిసే ఆమె కళ్ళల్లోకి చిత్రంగా చూస్తూ అన్నాడు రమణ. ఎన్నడూ లేంది ఆమె తనతో అంత చనువుగా మాట్లాడుతుంటే ఆశ్చర్యంగా వుందతనికి.

"తప్పకుండా వస్తారుగా?" అనుమానంగా చూసింది సరయు.

"తప్పకుండా వస్తాను!"

"ప్రామిస్?" చెయ్యి చాచింది సరయు పసి పిల్లలా.

ఓ సారి ఆమె కళ్ళలోకి సూటిగా చూసి

"ప్రామిస్" అనేశాడు రమణ సున్నితంగా ఆమె చేతిలో చెయ్యేసి.

అతని హృదయం ఆనందంతో స్తంభించి నట్లయింది.

"రేపు వుదయం భోజనానికి వచ్చేయ్యాలి. మీ కోసం ఎదురు చూస్తుంటాను. ఎంత లేటైనాసరే!"

"అలాగే!"

"దెన్ ఓ ! కే!" చిన్నగా నవ్వేసి చెయ్యి వూపింది సరయు. రమణ కూడా అప్రయత్నంగా చెయ్యి ఊపాడు. ఆ తరవాత పెద్ద పెద్ద అంగలతో వెళ్ళి పోయాడు.

ఇల్లు చేరిన సరయు కూనిరాగం తీసుకుంటూ పన్లు ముగించుకుని, మధుర భావాలతో మంచం మీదికి ఒరిగింది.

"రేపతనొస్తాడు. ఏం మాట్లాడాలి? ఎలా మాట్లాడాలి?.... వంటలోకి ఏం చెయ్యాలి? .... రెండు స్వీట్స్, రెండు హాట్స్! సరిపోతాయా?

అయ్యో! అతని కేవిఁష్టమో తెలుసుకుంటే బావుండేది!....

రేపు ఏం చీర కట్టుకోవాలి? వెంకటగిరా?.... లేక ... పాలిస్టరా?.... పోనీ.... కాశ్మీర్ చీర కట్టుకుంటే.... ఛ! అయినా అతనోపూట భోజనానికొస్తే ఇంత ఆలోచిస్తున్నా నేవిఁటి?...." అనుకున్న సరయుకి జవాబు దొరకలేదు గానీ చెంపలు మాత్రం కుంకుమ అద్దినంత ఎర్రగా అయిపోయాయి.

మళ్ళీ అతని తమ్ముడి సంగతీ అదీ గుర్తొచ్చి భారంగా అయిపోయింది.

"రేపు అతను రాగానే.... ఓదార్చాలి! అతన్ని కలవడానికి తనెంత ఆరాటపడిందో చెప్పాలి!" అనుకుంటూ ఆరాటపడింది. తన చెంపలు ఎర్రబడ్డ సంగతి ఎవరో గమనిస్తున్నట్టు సిగ్గు పడింది.

అలా అతన్ని గూర్చిన ఆలోచనలతో తనని తాను మరచిపోయిన సరయు వీధి తలుపు చప్పుడవడంతో, కల చెదిరినట్టు తృళ్ళిపడి లేచి తలుపు తీసింది.

గుమ్మంలో ఓ పదేళ్ళ కుర్రాడు నిల్చున్నాడు.

"సరయు గారంటే...."

"నేనే! నువ్వెవరు?" అంది సరయు.

"ఎవరో రమణగారట! ఈ లెటర్ మీ కిమ్మన్నారు" ఆమె ప్రశ్నకి జవాబు చెప్పకుండానే ఓ కవరు ఆమె చేతిలో పెట్టేసి వచ్చినంత వేగంగానూ వెళ్ళిపోయాడా కుర్రాడు.

"రమణ రాశాడా?" ఆ కవరు కేసి ఆశ్చర్యంగా చూసి, మళ్ళీ తలుపులు వేసుకుని మంచం మీద కూర్చుని కుతూహలంగా కవరు విప్పింది సరయు.

డియర్ సరయూ!

మీరు నా దృష్టిలో ప్రాణ స్నేహితురాలు. అందుకే.... ఈ ఒక్కసారికి మిమ్మల్ని ఏకవచనంతో సంబోధిస్తాను. మరోలా అనుకోవద్దు.

సరయూ!

నిన్ను చూస్తే సంతోషమో, ఆనందమో, ఇష్టమో, అయిష్టమో.... అదీగాక మైమరపో!.... స్పష్టంగా తెలియదు గానీ నా మనసు మాత్రం నా మాట వినదు.

వద్దనుకుంటూనే నీకు మరో వుత్తరం రాస్తున్నాను. కారణం నా కోసం నువ్వు ఎదురు చూస్తుంటావేమో అని!

నేననుకున్నవన్నీ జరిగి, నా ధ్యేయం నెరవేరింది. కంపెనీలన్నీ మంచి వారి చేతుల్లో పడి పునఃప్రారంభ మయ్యాయి. వాటి వెనక జరిగే కుతంత్రాలు ఆగిపోయాయి.

నీ వుద్యోగం, నీ తెలివితేటలు త్వరలో మరో మంచి వుద్యోగాన్ని సంపాదించి పెడతాయని నాకు తెలుసు.

ఇంతకీ ఈ వుత్తర సారాంశం సూటిగా చెప్పేస్తాను. నువ్వు రమ్మనగానే రాను అని మొహంమీద చెప్పలేక వస్తానన్నాను. కానీ.... రాదల్చుకోలేదు. వచ్చి నాలో మానుతున్న 'గాయాన్ని రేపుకోలేను. అంతేకాదు. మనం ఇంక ముందెప్పుడూ కలవం కూడా!

కానీ సరయూ! నన్ను చూడగానే నీ కళ్ళల్లో కనిపించిన వెలుక్కి ఆశ్చర్యపోయాను. ఉత్సాహం చిందిస్తూ నువ్వు మాట్లాడిన మాటలకి బిత్తరపోయాను. నీ చిలిపి చూపులకి పరవశించి పోయాను. నీ ఆహ్వానానికి మురిసి పోయాను. కానీ.... ఇదంతా స్థిరం కాదనీ, కేవలం నా మీది జాలితో మాత్రమే అలా ప్రవర్తిస్తున్నావనీ గ్రహించాక కృంగిపోయాను.

నా పిచ్చి కాకపోతే.... నిజానికి నువ్వు నన్నెప్పుడు ఆరాధించావు, అసహ్యించుకోవడం తప్ప!

నాకు ఎందుకో తెలియదుగానీ ఒక విధమైన విరక్తి కలిగింది. అందుకే.... అందరికీ దూరంగా ట్రాన్స్‌ఫర్ చేయించు కున్నాను.

త్వరలో సుజాత, రఘుల పెళ్ళి జరగబోతోంది. అయినా నేనా పెళ్ళికి రాను. అన్నట్టు రఘు మామూలు మనిషయ్యాడు తెలుసా?

# శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

ఇతరులకు నన్నిమిడి తిను, హీనజాతి
కులజుడయ్యు, దా నుత్తమ కులజుడగును
పరులకుం బెట్టక తినెడి వాడు, గొప్ప
కులమునకు చెందియును హీన కులజుడగును.

పస్తులుండియు పసిడి యాభరణములను
దండిగా జేర్చి భూమిలో పాతిపెట్టి
పైన సున్నగ నలికించు వాని నోట
మట్టి నిజమని యెరుగుమా మానవుండ!

ఆవు పొదుగున నుండియు నచ్చమైన
నురుగు పాలను త్రావదు కెరలి పిదుదు
దేవుడిచ్చియు కడుపార తినని నరుడు
కడు నికృష్టుండు చూడగ పిదుదు కంటె.

–కనమలూరు వెంకటశివయ్య

సరయూ! చిన్న రిక్వెస్ట్!

తొందరపడి ఎలాంటి నిర్ణయాలూ తీసుకోకు. ఏ విషయాన్నయినా నీ ఫ్రెండ్ వనజగార్ని సంప్రదించు. మెరిసేదంతా బంగారం కాదని గ్రహించు.

మీ ఇంటికి రానందుకు క్షమించు.

సదా నీ శ్రేయస్సు కోరే

రమణ.

వుత్తరం పూర్తి చేసిన సరయు మొహం పదిలక్షణాలు చేసినట్టు వాడి పోయింది.

★ ★ ★ ★

ఆ రోజు హఠాత్తుగా అత్తగారు దిగింది ప్రభాకర్ ఇంటికి. లక్ష వత్తుల నోవుఁ నోచుకుంటున్నాను కనక ఇద్దర్నీ రమ్మని.

ఇరుకున పడ్డాడు ప్రభాకర్.

కారణం నోవుఁ మరుసటి రోజే.... స్టాఫ్ తక్కువై కొన్ని వుద్యోగాలకి ఇంటర్వ్యూకి పిల్చాడు. అది ఆపడానికి వీల్లేదు. అందుకే.... అతి ప్రయాసతో భార్యని మాత్రం తీసికెళ్ళేలా అత్తగార్ని ఒప్పించాడు. అట్నించి తల్లిదండ్రులు వెళ్తామన్నారు.

అత్తగారు కూతుర్ని మాత్రం వెంట బెట్టుకుని నిరుత్సాహంగానే వెళ్ళింది.

మర్నాడు ఇంటర్వ్యూ సమయానికి మోహన్రావు వచ్చాడు అనుకున్న ప్రకారం.

ఉదయం పది గంటలకి మొదలైన ఇంటర్వ్యూలు సాయంత్రం నాలుగు దాటేదాకా జరుగుతూనే వున్నాయి.

మరోసారి కాఫీలు సేవించి.... మిగిలిన ఒకే ఒక కేండిడేట్‌ని రమ్మని అలా రిలాక్సింగ్‌గా వాలారు ప్రభాకర్, మోహన్రావు.

స్ప్రింగ్‌డోర్ తీసుకుని లోపలికొచ్చిన యువతిని చూసి తృళ్ళిపడి చివ్వున లేచి స్టడీగా కూర్చున్నాడు ప్రభాకర్. అతని కళ్ళు ఆమె కేసి విస్మయంగా చూస్తున్నాయి.

"గుడ్‌మాణింగ్ డాక్టర్" అతని చూపులకు ఇబ్బందిగా కదుల్తూ అందామె.

"గుడ్‌మాణింగ్.... మీరు...."

"సరయు...." అందించిందామె.

"ఓ! మీ పేరు సరయు కదూ! సారీ! మర్చిపోయాను.... బావున్నారా?" అన్నాడతను.

"ఆఁ!" అందామె తలవంచి.

ఆమెని మోహన్రావ్‌కి కూడా పరిచయం చేశాడతను.

ఇంటర్వ్యూ ముగిసింది.

ప్రభాకర్‌కి చెప్పి మోహన్రావు వెళ్ళిపోయాడు.

"మీ రెక్కడ దిగారు?" చనువుగా అడిగాడు ప్రభాకర్.

చెప్పింది సరయు.

"మా ఇంటికి రండి! భోజనం చేసి వెళ్ళచ్చు!" అన్నాడు ప్రభాకర్.

"అబ్బె! ఎందుకు డాక్టర్! నేను వెళ్ళిపోతాను!" మొహమాటంగా అంది సరయు.

"ఫరవాలేదు రండి!" అంటూ బైటి కొచ్చి కార్‌డోర్ తీసి పట్టుకున్నాడు ప్రభాకర్.

"శ్యామలగారు బావున్నారా?" దారిలో అంది సరయు.

"ఆఁ! బానేవుంది. కానీ.... తను వూళ్ళో లేదు!" అంటూ భార్య ప్రయాణం గురించి చెప్పాడు ప్రభాకర్.

కాస్సేపు మౌనంగా గడిచి పోయింది. ఇద్దరికీ.... తొలి పరిచయం, ఆనాటి సంఘటనలు గుర్తొచ్చాయి.

"మీ ఆఫీసంతా నానా గొడవయిందని పేపర్లో చూశాను!" కాస్సేపు తర్వాత అన్నాడతను.

"అవును! ఎవరూ వూహించలేని సంఘటన!" భారంగా అంది సరయు.

దాన్ని గురించి మరికొన్ని వివరాలు అడిగి తెలుసుకున్నాడు ప్రభాకర్. అక్కడి జాబ్ ఎందుకు నిరాకరించిందో తెలుసుకున్నాడు.

మరి పొద్దు పోకుండా భోజనం ముగించి అతనికి థాంక్స్ చెప్పి లేచింది

# కరిగిన శిల

సరయు.

ఇంటర్వ్యూ సంగతి త్వరలో తెలియ పరుస్తానని చెప్పి ఆమెని పంపేశాడు ప్రభాకర్.

* * * *

రమణ అందరికీ దూరంగా వుండాలని వెళ్ళదల్చితే వెళ్ళాడు గానీ.... ఆ ఒంటరితనం అతన్ని మరీ కృంగదీస్తోంది. ఇటీవల ఎందుకో అతనికి సరయు పదే పదే గుర్తొస్తోంది.

చురుగ్గా వుండే ఆమె చూపులు, పదునుగా వుండే ఆమె మాటలూ వెంటాడు తున్నాయి. ఆమె పెదవుల్లోని మధురిమ, ఆమె స్పర్శలోని హాయి మరీమరీ గుర్తొస్తున్నాయి.

"ఛ! ఇలాంటి ఆలోచన నా మనసులోకి రాకూడదు!" అని అనుకున్నా అతని మనసు అతని మాట వినడం లేదు.

రఘు, సుజాతల పెళ్ళి అయిపోయింది. జానకమ్మ ఎంత బ్రతిమాలుతూ రాసినా అతను వెళ్ళ లేదు. గ్రీటింగ్స్ పంపి వూరుకున్నాడు.

కాలం అతి భారంగా నడుస్తోంది.

ఒంటరిగా వున్నప్పుడు చిన్నా స్మృతులు మనసునిండా ముసిరేసి అతని గుండెల్లోని అగ్నిని రగులుస్తున్నాయి. ఆ మంటల్ని ఆర్పడానికి ఓ చల్లని మనసు కావాలి! రెండు తియ్యని మాటలు కావాలి. ఆప్తుల ఆదరణ కావాలి!" ఆత్మశాంతి కోసం అలమటించే అతనికి–

"నేనున్నాను" అని అక్కున చేర్చుకుని ఓదార్చే ఓ అమృత హృదయం కావాలి!

మనశ్శాంతి కోసం యడారిలో నీటి కోసం వెతికే పాంథుడిలా వెతుకుతున్న రమణకి ఆ శాంతి లభించలేదు గానీ.... అశాంతిని పెంచే మరో శరాఘాతం లాంటి దెబ్బ తగిలింది. అతని మనసుని మరింత అల్లకల్లోలం చేసింది.

అదే అతనికి సరయు రాసిన వుత్తరం!

ముందా వుత్తరం చూడగానే ఆనందంతో అతనికి ఒళ్ళు తెలియలేదు. ఆతృతగా కవరు చించుతుంటే చేతులు ఒణికాయి. వుత్తరం చదువుతుంటే గుండె వేగంగా కొట్టుకుంది. తీరా పూర్తి చేసేసరికి అతనికి ఎక్కళ్ళేని నీరసం, నిస్త్రాణ ఆవహించేసింది.

అలా కూర్చుండి పోయాడు.

తరవాత కూడా ఆ వుత్తరం పదే పదే గుర్తొచ్చి అతని మనసుని అల్లకల్లోలం చేసేస్తోంది.

ఆ రోజు మళ్ళీ ఓసారి ఆ వుత్తరాన్ని చేతిలోకి తీసుకున్నాడు రమణ.

శ్రీ రమణగారికి,

సరయు నమస్కరించి వ్రాయునది. ఇదేవిఁటి.... ఈమె నాకు వుత్తరం రాయడమేమిటి అని కంగారు పడకండి. శాంతం వహించి దయచేసి పూర్తిగా చదవండి.

మీ యడ్రస్ ఎలా సంపాయించానా అని ఆశ్చర్య పోతున్నారు కదూ? కాని మనసుంటే మార్గం లేకపోతుందా చెప్పండి! అయినా ఆ సంగతి తర్వాత చెప్తాను. ముందు అసలు విషయం చెప్పనీండి.

మా అమ్మ మీ మీద నమ్మకంతో నాక్కూడా తెలియకుండా కొన్ని రహస్యపు టాలోచనలు చేసి నా బాధ్యతల్ని మీ కప్పగించింది. నా అన్నవారు నాకులేరనీ, మీ గురించిన గతం తెలుసుకునీ తన తదనంతరం నా మంచి చెడ్డలన్నీ మీరే చూస్తారన్న నమ్మకంతో నిశ్చింతగా కన్నుమూసింది.

కానీ ఆ నమ్మకాన్ని మీరు వమ్ముచేశారు. పిరికి మనిషిలా ఆ బాధ్యతల్నించి దూరంగా పారిపోయారు. ఎన్నో కష్టతరమైన పన్లని అవలీలగా చేసిన మీరు... ఓ ఆడపిల్ల బాధ్యతని స్వీకరించడానికి భయపడ్డారు. ఒక తల్లికిచ్చిన మాటని నిలుపుకో లేక మొహం చాటేశారు.

అయినా నేను బాధపడ్డం లేదు!... మిస్టర్ రమణా! ఈ లోకంలో ఎవరూ ఒంటరివారు కారు. కానీ....

ఇంటికొస్తారని ఆశగా ఎదురు చూసిన నాకు మీ వుత్తరం గుండెల్ని తూట్లు చేసింది. ఒస్తానని నమ్మకంగా చెప్పి ఓ అనామకుడితో లెటర్ పంపి నన్నో ఫూల్ని చేశారు. అదే నాకు బాధకలిగించింది. అలా కాక–

"సారీ! ఇప్పుడు రాలేను! మరో సారి వస్తాను!" అని మీరు చెప్తే సంతోషించేదాన్ని! కానీ మీరు నన్ను కావాలని అవమానించారు.

ఎందుకలా చేశారు?

మీ గురించి తెలియక ముందు మిమ్మల్ని అసహ్యించు కున్నానన్న కోపంతో నా?...

మిమ్మల్ని మాటలతో అవమానించానని నన్నూ అవమానించాలని ఇలా ప్రవర్తిస్తున్నారా?

కానీ రమణా! .... మిమ్మల్ని మొదట్లో అపార్థం చేసుకున్న మాట నిజమే!... అవమానించిన మాట కూడా నిజం. కానీ మీ గురించి పూర్తిగా తెలిశాక నా ప్రవర్తనకి సిగ్గు పడ్డాను. బహుశా ఆ సంగతి మీరు గ్రహించి వుండరు. గ్రహించి వుంటే అవమానం చేస్తారా?

యడ్రస్ ఇస్తే మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తానని కూడా భయపడి వుంటారు! తప్పించుకున్న బాధ్యత మళ్ళీ కాళ్ళకి చుట్టుకుంటుందేమో అని కంగారు పడ్డారు. అంతేకాదు. ఇంకా–

"నేను మిమ్మల్ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నాను. నా జీవిత నౌకకి చుక్కాని మీరే!..... మీతోడిదే లోకం!.... ఆ రోజు నా పెదవులపై తియ్యని ముద్ర వేసినప్పట్నించే నా హృదయం మీకోసం తపించి పోతోంది. ఆ మధుర క్షణాల్ని శాశ్వతం చెయ్య మంటోంది. అందుకే మీ రెప్పుడొచ్చినా ఈ తనువూ, మనసూ మీ కోసం ఎదురు చూస్తూంటాయి". అంటూ సినిమాల్లో లాగా ప్రాధేయ పడతానని కూడా అనుకుని వుంటారు... అవునా?

కానీ మిస్టర్ రమణా






ఈ సరయు అభిమానవతి!... ప్రాణం పోయినా అంత హీన స్థితికి దిగజారదు!

అసలు మీకో సంగతి తెలుసా రమణా! ఈ ప్రేమలూ, గిమలూ హృదయాలూ అవి పారేసుకోవడాలు లాంటివి నాకు పరమ అసహ్యం! పెళ్ళయ్యాక ప్రేమించడమే నా దృష్టిలో పవిత్రత! అది చాలా మందికి నచ్చక పోవచ్చు! మూర్ఖత్వం కింద కొట్టి పారెయ్యొచ్చు. అయినా నానమ్మకం నాది!

అందుకే ఆనాటి నిస్సహాయస్థితిలో ఒక ఆడపిల్ల పెదవులపై పశుబలంతో వేసిన ముద్ర.... ఛీ! మధురంగా కాదు వుండేది! చేదుగా, కాల కూట విషంలా వుంటుంది! ఆ చేదు అనుభవాన్ని నా కంఠంలో ప్రాణం వున్నంత వరకు మర్చిపోను.

ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే ఒకప్పుడు మీరంటే అసహ్యించుకున్నా, మీ తొందర పాటుకి బాధపడ్డా, వ్యక్తిగతంగా మీరంటే నాకు గౌరవం వుంది. మీరు చేసిన ధైర్య సాహసాలు సాధారణ మానవులు చెయ్యలేరు. మరో సంగతి!

ఇటీవల మా అమ్మ పెట్టె సర్దుతుంటే మా అమ్మ నన్ను వుద్దేశించి రాసిన ఓ వుత్తరం దొరికింది.

అందులో అంతా మీ గురించే!

ఏ నమ్మకంతో మీరహస్యాలు మీరావిడకి చెప్పారోగానీ. అవి కన్నకూతుర్నైన నాక్కూడా తెలియనీకుండా మీ నమ్మకాన్ని నిల బెట్టుకుంది.

నా మంచి చెడ్డలన్నీ మీరు చూస్తారనీ, మీ మాటకి ఎదురు చెప్పద్దనీ.... ఇంకా చాలా రాసింది. అందుకే మీకు ఇష్టం లేక పోయినా ఈ వుత్తరం రాస్తున్నాను.

మరో తమాషా తెలుసా?....

మా వనజ ఇటీవల నా పెళ్ళి చెయ్యాలని మహా ఆరాటపడి పోతోంది. ఆ మధ్య వాళ్ళ బంధువు లబ్బాయిని తీసుకొచ్చి చేసుకుంటావా చస్తావా అని కూర్చుంది. ఇంతకీ అతగాడెవరో తెలుసా?...

మీరు కారు ఫ్రెండ్ అంటూ దెప్పేవారు చూడండి! అతను. నేను సందిగ్ధంలో పడ్డాను.

ఈ లోగా అతనిక్కూడా మా బాస్ గొడవలతో సంబంధం వుందనీ– అతను ఇంకా చాలా నేరాలు చేశాడనీ తెలిసిపోయింది.

అంతే కాదు. అతగాడికి చాలామంది అమ్మాయిలతో పరిచయం వుందని, ఓ అమ్మాయికి ఇద్దరు పిల్లలు కూడా పుట్టారని.... ఇంకా చాలా తెలిసాయి. ఇదంతా అతని తల్లికి తెలుసనీ.... తల్లి కూడా పక్కా విలన్ లాంటి మనిషని. తల్లీ కొడుకులు కలిసే ఆ ఇంటి యజమానిని కాల్చుకు తింటారనీ కూడా తెలిసింది.

కనిపించేదంతా నిజం కాదనిపించింది నాకు. ఎందుకంటే వాళ్ళిద్దరు కూడా నాకు చాలా మంచి వాళ్ళుగా అనిపించారు.

దాంతో వనజ కూడా ఈ సంబంధం చెప్పినందుకు బాధపడింది. పాపం నిజంగా దానికీ గొడవలేం తెలియవు.

ఇదీ నా చరిత్ర!

నేనూ మీలాగే ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోవాలను కుంటున్నాను. ఇల్లు అదీ బేరం పెడుతున్నాను.

మా అమ్మ మాటకి మీరు విలువ ఇవ్వక పోయినా కన్న తల్లి మాటలకి నేను కట్టుబడాలిగా? మీరు నాకా అవకాశం ఇవ్వనేలేదు. కనీసం నా స్థితిగతుల్ని ఫ్యూచర్‌లో చెయ్యాలనుకున్నవీ మీతో చెప్పడం కనీస ధర్మంగా భావించి మీకీ సుదీర్ఘ లేఖ రాస్తున్నాను.

అన్నట్టు ... యడ్రస్ సుజాతని బతిమాలి సంపాదించాను. ఆమెనేం అనకండి! ఇంక మీకు వుత్తరం రాయడం గానీ, మీ దగ్గర కొచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం గానీ చెయ్యనని మాట ఇస్తున్నాను. ఇంక నిశ్చింతగ వుండండి.

గుడ్‌బై

సరయు.

వుత్తరం పూర్తి చేసిన రమణ ఆ వుత్తరాన్ని మొదటి సారిగ చదువుతున్నట్టే బాధపడ్డాడు.

(ఇంకాఉంది)




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పోషకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్యప్రముఖుని సమాధానాలు

### పి. వి. సత్యనారాయణ, కాకినాడ

ప్ర : నాకు చుండ్రు ఎక్కువగా ఉన్నది. అన్ని రకాల మందులు వాడినాను, కాని పూర్తిగా తగ్గలేదు. ప్రస్తుతము మెడిమిక్స్ సబ్బుతో తలకు స్నానం చేయుచున్నాను. పూర్తిగా చుండ్రు పోవాలంటే ఏమి చెయ్యాలి. సలహా ఇవ్వవలసినదిగా కోరుచున్నాను.

జ : తలకు సబ్బు పెట్టవద్దు. బాగా వేడి నీరు వాడవద్దు. ఔషధములు – బైద్యనాథ్ రక్త శోధక 1 టాబ్‌లెట్ మరియు బైద్యనాథ్ సురక్తా స్ప్రాంగ్ రోజుకు రెండు సార్లు ఉదయం, సాయంత్రం 2 చెంచాల మందు రెండు చెంచాల నీటిలో కలిపి కడుపులోకి పుచ్చుకోండి. మంచి సికాయ పొడి, ఉసిరిక పప్పు పొడితో తల స్నానము చేయండి. బైద్యనాథ్ మహా భృంగరాజ్ తేల్ తల నూనెగా వాడండి.

### పి. శాంతకుమారి, హైదరాబాద్

ప్ర : ఎలర్జి, ఎర్రటి దద్దుర్లు వచ్చి తరువాత నల్లగా మారుతాయి.

జ : ఏ వస్తువులు తింటే ఎలర్జి ఎక్కువ అవుతుందో అవి తినకూడదు. బైద్యనాథ్ రక్త శోధక టాబ్‌లెట్స్ సురక్తా స్ప్రాంగ్ ఔషధముతో రోజుకు రెండుసార్లు, బైద్యనాథ్ లఘుసూత శేఖరరస మాత్రలు రోజు రెండు సార్లు వాడవచ్చు.

### డి. డి. గాంధి, డి. రేణుక, రసాయినీ, రాయ్‌ఘడ్, మహారాష్ట్ర – ఆర్. గీత, మలక్‌పేట, హైదరాబాద్

ప్ర : మా జుట్టు రాగి రంగులో ఉండి విపరీతంగా రాలిపోవు చున్నది. దినికి ఆయుర్వేద వైద్య చికిత్స తెలుప గలరు.

జ : బైద్యనాథ్ మహా భృంగరాజ్ తేల్ తలనూనెగా వాడండి. బాగా వేడిగా ఉండే నీటితో తలస్నానం చేయకూడదు. సోపు కూడా వాడరాదు. బైద్యనాథ్ ద్రాక్షాసవ స్పెషల్ రోజు 2 సార్లు లోపలికి వాడండి. జుట్టు నెరుస్తున్న వారికి కూడా చికిత్స ఇదే అని గమనించ గలరు.

### బి. శ్రీనివాసరావు, విశాఖపట్నం

ప్ర : నాకు విపరీతంగా చెమట వస్తుంది. కాళ్లకి, చేతులకి మరి ఎక్కువగా వస్తుంది.

జ : బలహీనత వలన రావచ్చును. బైద్యనాథ్ చ్యవన ప్రాశస్పెషల్, ద్రాక్షాసవ స్పెషల్ వాడండి.

### టి. ఆర్. ఆర్. శర్మ, నందికొట్కూరు

ప్ర : నాకు వరి బీజము వచ్చి సంవత్సరం అయినది. ఎన్ని మందులు వాడినా పోలేదు. మీరు సరైన మందు తెలుప గలరు.

జ : బైద్యనాథ్ వృద్ధి వాధిక బటి ఉదయం, సాయంత్రం రెండు మాత్రల చొప్పున మహా రాస్నాది ఖాదాతో ప్రతిరోజు రెండు సార్లు తీసుకుని తేలికగా జీర్ణమయ్యే ఆహారం తీసుకోవాలి •

### వి. పరశురామప్ప, ఉరవకొండ

ప్ర : నాకు ఎక్కువగా చదివినా, రాసినా తల ముందు భాగమున, ఇరు ప్రక్కల నెప్పి వస్తుంది.

జ : బైద్యనాథ్ బ్రైన్ టాబ్‌లెట్, బైద్యనాథ్ ది మాంగ్ దోషారి, బైద్యనాథ్ సరస్వతారిష్టతో తీసుకొన వలయును. తలకు బైద్యనాథ్ బ్రహ్మి తేల్ తల నూనెగా వాడండి.

### ఆర్. ప్రణయ ప్రకాష్, నంద్యాల

ప్ర: మాపాపకు 14 ఏండ్లు వయస్సు. 'రజస్వల' అయి సం. అవుతోంది. బహిష్టు అయినపుడు కడుపు నెప్పి వస్తుంది. నివారణ తెలుపండి.

జ : బైద్యనాథ్ సుందరి కల్ప ఫోర్ట్ విడవకుండా 2 చెంచాల మందు రెండు చెంచాల నీటితో ఉదయం సాయంత్రం లోనికి వాడండి

### పి. చక్రపాణి, కర్నూలు

ప్ర : నాకు మల విసర్జన సరిగా కాదు. (మలబద్ధకము) దినికి కారణము ఏమి? ఏమి వాడితే తగ్గుతుంది.

జ : ప్రతి రోజు రాత్రి నిద్రపోయే ముందు బైద్యనాథ్ త్రిఫలా చూర్ణము గానీ, బైద్యనాథ్ పంచ సకార చూర్ణము గానీ గోరు వెచ్చని నీటితో సేవించ వలెను. మూలశంఖ ఉన్నచో బైద్యనాథ్ పైరాయిడ్ టాబ్‌లెట్ బైద్యనాథ్ అభయారిష్టతో వాడవలెను.

### ఎం. ఎన్. మూర్తి, తెనాలి

ప్ర : నాకు గుండెకు సంబంధించిన జబ్బు. "అజీనా పెక్టొరిస్" ఉన్నది. ఆరు సం. ముల నుంచి ఇంగ్లీషు మందులు వాడుతున్నాను. కనుక తగిన ఆయుర్వేద మందులు వాడమని మీరు సలహా యిచ్చిన, ఆ ప్రకారం వాడెదను.

మోకాళ్ల నెప్పులు, కీళ్ల నెప్పులు, నడుము నెప్పులు ఉన్న వారిని మీరు ఏమి మందులు వాడమంటారు. నా వయస్సు 65 సం. లు.

జ : గుండె జబ్బుకు మామూలుగా బైద్యనాథ్ యాకుతి రస, బైద్యనాథ్ హృదయార్ణవరస వాడతారు. బైద్యనాథ్ అర్జునారిష్ట విడవకుండా రోజుకు 2, 3 సార్లు 2 చెంచాల మందు 2 చెంచాల నీరు కలిపి వాడవలెను. హృదయార్ణవరస, యాకుతీ రస ఉదయం, సాయంత్రం వాడాలి. మంచి ఆయుర్వేద వైద్యుని మోతాదుల విషయమై సంప్రదించండి. కీళ్ల నెప్పులకి నడుము నెప్పికి బైద్యనాథ్ వాతరినా, బైద్యనాథ్ స్వర్ణ మహాయోగ రాజులు ఒక్కొక్క మాత్ర చొప్పున ఉదయం, సాయంత్రం వాడవలెను. తేలిక ఆహారము, చింతలు లేకుండా విశ్రాంతితో ఉంటే మంచిది. □

---

**కూపన్**

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాథ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న : ..............................................

..............................................

..............................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

## పాల బిస్కట్లు–
## నవ్వుతూ, తుళ్ళుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!







**రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు**

బ్రిటానియా

LINTAS BIN MB 12 2720 TL

# విడిన మబ్బు

**—ఇసుకపల్లి సుజాత**

దీప పేరుకు తగ్గట్టు రూపంలో దీపంలా వెలుగులు చిందించక పోయినా 'ఫరవాలేదు బాగానే ఉంది' అనిపిస్తుంది.

హాల్లో సోఫా మీద కూర్చుని వీడియో చూస్తున్న దీపకి మనసు మనసులో లేదు. అది ప్రశాంత్ చుట్టూ పరిభ్రమిస్తోంది. కానీ ఆ పరిభ్రమణం యాంత్రికంగా సూర్యుని చుట్టూ ప్రదక్షిణాలు చేసే భూగోళం మాదిరిగా లేదు. తోటలోని పూలు ఎవరైనా కోసుకు పోతారేమోనని అనుమానంతో తోట చుట్టూ తిరిగే కావలి మనిషిలా ఉంది.

హఠాత్తుగా 'దొంగ.... దొంగ' అని కేకలు వినిపించటంతో చప్పున ఉలిక్కి పడ్డది దీప. ఆ కేకలు టీవీలోంచి వచ్చినట్టు తెలుసుకున్న ఆమె మనసు కాస్త కుదుట పడ్డది.

'నా కొట్లోనే దొంగతనం చేస్తున్నావ్ నీ కెంత ధైర్యం! సినిమా హీరోలా ఉన్నావ్ నీకు కన్ను వంకరా కాలు వంకరా? కష్టపడి పని చేసుకుని బతకరాదూ' అంటూ షావుకారు ఒక యువకుణ్ణి పట్టుకుని నాలుగు తంతుంటే చుట్టూ చేరిన జనం నాలుగూ అంటున్నారు.

భరించ లేక పోయింది దీప. అమాంతం ఒక్క అంగలో లేచి వెళ్ళి టీవీ ఆపేసి మళ్ళీ వచ్చి సోఫాలో కూర్చుండి పోయింది.

ఆమె కళ్ళు మునుపటిలా సంతోషంతో మెరవట్లేదు.

గోడ గడియారం 'టింగు' మని గంట కొట్టి చకచకా తన పని తాను చేసుకుపోతోంది. దానికి ఎవ్వరితోడు అక్కరలేదు. ఎవ్వరి కోసమూ అది ఆగదు. ఏ బంధనాలు లేకుండా అది కాలాన్ని ఎలా గడుపుతోందో!

తన పిచ్చి ఆలోచనకు తనకే నవ్వొచ్చింది.

టైము నాలుగున్నర అయ్యింది.

అంటే ప్రశాంత్ ఆఫీసు నుంచి రావటానికి ఇంకా గంటసేపు పడుతుంది.

'అబ్బా' తలనొప్పిగా ఉంది అంటూ కుడి చేతి వేళ్ళతో నొసలు రుద్దుకుంది బాధగా. తల నొప్పికి రకరకాల కారణాలుంటాయంటారు డాక్టర్లు. కంటి చూపులో మార్పు రావటం, ఎక్కువగా శ్రమ పడటం, విపరీతంగా ఆలోచించి భయపడటం– ఇలాంటివి సవా లక్ష చెబుతారు. మరి ఇప్పుడు తనకి తలనొప్పి ఏ కారణం చేత వచ్చినట్టు?

బహుశా మూడో కారణం వల్లనేమో!

'మంగా..... ఓ కప్పు కాఫీ పట్రా' ఆ కారణం తలచుకోగానే తట్టుకో లేక వంట మనిషిని కాఫీ తెమ్మని ఆర్డరిచ్చింది దీప.

కప్పులోని కాఫీ ఖాళీ అవుతున్న కొద్దీ శిరోభారం నెమ్మదిగా దిగుతున్నట్లనిపించింది.

వెంటనే గతం గురించిన ఆలోచనలు దీప మనసు మేఘాల్లా కమ్ముకోవటం ప్రారంభించాయి.

తనకు ప్రశాంత్‌తో పెళ్ళి జరిగిన తీరు తలచుకుంటే గమ్మత్తుగా అనిపిస్తుంది. ఒక్కొక్కసారి నవ్వొస్తుంది కూడాను.

ఆ రోజు తనకు బాగా గుర్తు. తను మామూలుగానే కాలేజీకి వెళ్ళింది. కనకాంబరం రంగు చందేరి చీర కట్టుకుని మెడలో ముత్యాల గొలుసు జడలో కనకాంబరాలతో కాలేజీలోకి అడుగు పెట్టగానే అంతా హడావిడిగా కనిపించింది. ఆ రోజు ఫంక్షన్ కూడా ఏదీ లేదు. కానీ ఆ కలకలానికి కారణం అర్థం కాలేదు తనకి.

ఇంతలో గల గల మంటూ ఫ్రెండ్స్ దీప చుట్టూ మూగారు.

'హాయ్ దీపా..... లేటయితే నువ్వు రావేమో అనుకున్నాము'.

'మన కాలేజీలో ఇవాళ సినిమా షూటింగుట తెలుసా'.

'ఏదో చిన్న సీన్ ఉంది మీ స్టూడెంట్స్‌లో ఎవరైనా యాక్ట్ చేస్తారా అని డైరెక్టర్ మన ప్రిన్సిపాల్‌ని అడిగారట. చక్కగా డ్రెస్ అయి వచ్చావు నువ్వు చెయ్యరాదూ ఆ యాక్షన్' ఒక స్నేహితురాలు పత్తిడి చేసింది.

'అమ్మో నేనా! ఇంకానయం..... నాకు రాదు బాబూ నేను చెయ్యను' అంది దీప బెరుకుగా.

'సరేలే అయితే పద షూటింగ్ చూద్దాం' అంటూ అందరూ చిత్రం యూనిట్ దగ్గరగా నిలబడ్డారు.

డైరెక్టర్ హీరోకి ఏవో సూచన లిస్తున్నాడు.

'అబ్బ .... అటు చూడవే దీపా..... హీరో కంటే అతనెంత బాగున్నాడో! అసలు అతనికివ్వాల్సింది హీరో వేషం'.

పచ్చగా మెరిసిపోతూ దాదాపు 'ఆరడుగుల పొడుగు దానికి తగ్గ లావుతో అచ్చం తెలుగు నవలా నాయకుడిలా ఉన్నాడనిపించింది దీపకి.

సినిమాలో హీరో కాలేజీ మెట్లు దిగుతున్న ఒక అమ్మాయి పైకి పువ్వు విసిరి 'హాయ్ బ్యూటీ' అనాలి.

అదీ సీను.

డైరెక్టర్ పక్కనే గులాబీ పూల బుట్ట కూడా ఉంది. నవలా నాయకుడు తన వంకే చూస్తున్నట్టు దీప గమనించక పోలేదు.

సినిమా హీరోతో పాటు ఆ నవలా నాయకుడు కూడా బుట్టలోంచి ఒక గులాబీ పువ్వును చేతిలోకి తీసుకున్నాడు. ఆ గులాబిని దీప మీదకి విసిరేశాడు. కానీ ఈ విషయం ఆమె తప్ప మరెవ్వరూ గమనించ లేదు.

ఆశ్చర్యంగా అతని వంక చూసి బిడియంగా తల వాల్చేసింది దీప.

అంతే!

ప్రశాంత్ దీపతో పాటు వాళ్ళింటికి రావటం ఆమె తల్లిదండ్రులు అంగీకరించటం దీపా ప్రశాంత్‌ల వివాహం జరిగి పోవటం అన్నీ ఒకదాని వెంట ఒకటి విచిత్రంగా సినిమా మాదిరి జరిగి పోయింది. తరువాత ప్రశాంత్‌కి హైదరాబాద్‌లో మంచి ఉద్యోగం దొరకటంతో బంజారా హిల్స్‌లో ఇల్లు కొనుక్కుని అక్కడే సెటిలయి పోయారు.

బజర్ మోగింది.

హఠాత్తుగా ఈ లోకంలో కొచ్చింది దీప.

ఇందాక వీడియోలో సినిమా

ఇప్పుడు ఊహల్లో సినిమా

ఇందాకటిది నిజమైన సినిమా

ఊహల్లోది చిత్రంగా జరిగిన అసలైన జీవితం.

ఆశ్చర్యంగా అనిపించింది.

కంగారుగా లేచి తలుపు తీసింది దీప.

తమరేదో పరధ్యానంలో ఉన్నట్టున్నారు ఏమిటి విశేషం?' లోపలి కొచ్చి నవ్వుతూ అడిగాడు ప్రశాంత్.

'ఆ..... అది...... అదేంలేదు' నవ్వుని ముఖం మీద పౌడర్‌లా అద్దుకోవటానికి ప్రయత్నించింది.

డైనింగ్ టేబుల్ మీద టిఫిన్ రెడీగా పెట్టింది మంగ.

ప్రశాంత్ ఉల్లాసంగానే ఉన్నాడు. కానీ దీప మాత్రం ముభావంగా టిఫిన్ పూర్తి చేసింది.

కుర్చీలోంచి లేస్తూ 'కమాన్ దీపా గెట్ రెడీ షికారుగా అలా టాంక్‌బండ్‌కి వెళ్ళొద్దాం పద'. తొందర చేశాడు ప్రశాంత్.

'సారీ..... నేను రానండీ నాకు తల నొప్పిగా ఉంది'. అప్రయత్నంగా నోట్లోంచి వచ్చేశాయి ఆ మాటలు.

ప్రశాంత్ విచిత్రంగా భుజాలు పైకి ఎగరేసి.'సరే నీ ఇష్టం ....... కానీ ఒక్క మాట దీపా. నువ్వు ఈ మధ్య ఎందుకో డల్‌గా ఉంటున్నావు. ఏవిటీ కారణం? నువ్వలా ఉంటే నేను భరించలేను. ప్లీజ్ ఎందుకో చెప్పవూ' అభ్యర్థించాడు ప్రశాంత్.

'ఛ..... అదేం లేదండీ నేను బాగానే ఉన్నాను'.

'అయితే సరే. నేను వెళ్ళి అక్కడ కాస్సేపు కూర్చుని వస్తాను. కానీ ఒక్కటి మాత్రం గుర్తుంచుకో దీపా. నీకు ఏది కావాలన్నా నేనున్నాను. కోరిన వస్తువు చిటికలో నీ ముందుంచుతాను నీ కోసం నీ సంతోషం కోసం' చివరలో గద్గదంగా మారింది ప్రశాంత్ స్వరం.

దీప చలించి పోయింది.

చైత్ర మాసం కావటం వల్లనేమో సూర్యుడు పశ్చిమ సముద్రంలో మునగటానికి బద్ధకిస్తున్నాడు. ఆకాశంలో అలుముకున్న మందార పూఛాయ భూమిపై ప్రతిఫలిస్తోంది. ప్రశాంత్ డ్రైవ్

చేస్తున్న ఎర్రని మారుతీ కార్ ఆ మందారంలోంచి దూసుకు పోయి వింత సొయగాలను చిందించింది.

* * * * *

ఛ ..... ప్రశాంత్‌ని అనుమానించటం అంత సమంజసం కాదేమో. ఒక వేళ తను అనుకుంటున్నట్టు అలాంటి వాడే అయితే మరి తనను అంత ప్రేమగా ఎందుకు చూసుకుంటాడు తన బాధను అతని బాధగా ఎందుకు భావించుకుంటాడు?

అసలు తామిద్దరూ ఆ వెధవ సినిమా చూడకుండా ఉండాల్సింది. అప్పట్నుంచే ఈ పాడు అనుమానం తనని పట్టుకు పీడిస్తోంది.

ఏ పని చెయ్యటానికి మనస్కరించట్లేదు. ఎప్పుడూ పరిపరి విధాల ఆలోచిస్తుంది. పరధ్యానంగా కనిపిస్తుంది. తనకు తెలియకుండానే ఆమె మానసికంగా కృంగిపోయింది. మొహంలో కళతప్పింది. ఆమెలో సహజంగా ఉండే చురుకు చలాకీతనం మాయమైనాయి.

ప్రశాంత్ పెరట్లో మొక్కల దగ్గరికి వెళ్ళినా అనుమానమే!

'ఆడది జీవితంలో ఒకరినే ప్రేమించి సంకుచిత మనస్తత్వంతో పడి ఉంటుంది. మన మగవాళ్ళది ఎంతో విశాల హృదయం. ఏ ఆడది కనిపించినా టక్కున ప్రేమించేస్తుంది. ఎంతమందినైనా సరే' అని ఆ సినిమా హీరో తన ఫ్రెండ్‌తో అన్న మాటలు దీప చెవుల్లో మారుమ్రోగిపోతున్నాయి.

"అమ్మో!- ఆ హీరో ఎంత తెంపరి!" ఆఫీసులో లేడీ టైపిస్టుతో సాగించిన ప్రేమాయణం పెళ్ళాం ముందు బైటపడిపోయి ఇంక జన్మలో మళ్ళీ అటువంటి తప్పుడు పనులు చేయనని ఆమెకి మాట యిచ్చి చెంపలు వాయించుకొని గుంజీలు తీసి క్షమాపణలు కోరాడు. మర్నాడే మళ్ళీ గ్రంథం ప్రారంభిస్తాడు. పైగా 'మగవాళ్ళంతా ఇంతే' అంటూ సూక్తులు వల్లె వేస్తాడు. అదిగో ఆ సూక్తే తన మనసును వెంటాడి వేధిస్తోంది.

ప్రశాంత్ ఫిలమ్ యాక్టింగ్‌లో డిప్లొమా తీసుకున్న సంగతి గుర్తొచ్చింది దీపకి. 'అలా తీసుకున్న వాళ్ళంతా జీవితంలో యాక్ట్ చెయ్యాలి అని బ్రహ్మ ఏమైనా రాసి పెట్టాడా?' అంటూ దీపను ఆమె మనసు నిలదీసింది.

ప్రశాంత్ ఆఫీసులో కూడా ఒక అందమైన లేడీ టైపిస్టు వుంది. ప్రశాంత్ పెద్ద ఆఫీసరు కాబట్టి పొద్దస్తమానం ఆ టైపిస్టు అతని గదిలోనే ఉంటుంది.

ఒక సినిమాలా దీప కళ్ళ ముందు మెదిలింది. 'తన గదిలో లేడీ టైపిస్టు ఉన్నంత మాత్రాన ప్రశాంత్ ఆమె వలలో పడాలని రూలుందా? ప్రశాంత్ నిన్ను ఎంత ప్రేమగా చూసుకుంటాడు. అటువంటి వాణ్ణి ఇంతేనా నువ్వు అర్థం చేసుకునేది. నీ పద్ధతి ఏమి బాగాలేదు' చనువుగా మందలించింది మనసు.

మనిషి ఎంత మంచివాడయినా హీరోలా ఉన్న ప్రశాంత్ వెంట ఏ ఆడదీ పడకుండా ఉంటుందని ఏమిటి గ్యారంటీ? పోనీ తన అనుమానం ఖాయం చేసుకొనేందుకు ఇంతవరకు ఎటువంటి ఆధారమూ దొరకలేదు. అలా దొరకలేదు కాబట్టి ప్రశాంత్ నిష్కళంకుడని అనుకుందామంటే ఆ హీరో మాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి.

అందుకే మళ్ళీ అనుమానం.

పైకి చెప్పుకోలేని ఆవేదన.

'భగవాన్ ... నాకెందుకీ పరీక్ష. ఈ మధనకి అంతం లేదా ...' గట్టిగా కళ్ళు మూసుకుని పరి పరి విధాల ఆలోచించుకున్న దీపకి బాధపడటం తప్ప మరో దిక్కు తోచలేదు.

నీరసంగా కళ్ళు తెరిచింది.

ఎదురుగా ప్రశాంత్ కనిపించాడు.

ఉలిక్కిపడింది దీప.

'తలుపులు తెరిచి కళ్ళు మూసుకుని ఏంటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ దీపా. ఎందుకు నీలో నువ్వే బాధపడుతున్నావ్?' సూటిగా ప్రశ్నించాడు ప్రశాంత్.

'ఆఁ ... ఆలోచనా ... బాధా ... ఏం లేదే' ఇంత నేరుగా భర్త తనను ప్రశ్నిస్తాడని ఊహించని దీప సమాధానం చెప్పలేక తడబడిపోయింది.

'నువ్వలా అన్నంత మాత్రాన నేను కనిపెట్టలేననుకున్నావా. నిజం చెప్పు దీపా మనిద్దరం కలిసి ఆ సినిమా చూసినప్పట్నుంచీ నీలో ఈ మార్పు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది అవునా'.

దెబ్బతిన్న పక్షిలా దీప అతని వంక చిత్రమైన చూపులు చూసింది.

'ఆ సినిమాలో హీరో మాదిరి నేను కూడా మా ఆఫీసులో లేడీ టైపిస్టుతో వ్యవహారం సాగిస్తున్నానేమోనని నీ అనుమానం కదూ'.

తన మనసులోని మాట భర్త బైట పెట్టేసరికి అవాక్కయిపోయింది దీప.

'నీ అనుమానం బైట పెడితే ఎటువంటి పరి



# ధర్మపథం

## వరశుల్కం




ఎన్నో వేల సంవత్సరాల కిందటనే చెప్పారు, మనవారు "కన్యా వరయతే రూపం, మాతా విత్తం" అని వివాహ విషయంలో. అంటే– అందగాడైన భర్త కావాలని కన్య కోరుకుంటుంది. ఆమె తల్లి ధనాన్ని కోరుకుంటుంది. అంటే – ఆమెకు డబ్బు కావాలని కాదు. శ్రీమంతుల యింట్లో పిల్లనివ్వాలని ఆమె కోరిక. అలా చేస్తే అమ్మాయి సుఖ పడుతుందని ఆమె ఆశ. రోజులు మారాయి. వరుడు ఎలా వున్నా, అతనికి అందకత్తె అయిన అమ్మాయి కావాలి అతని తల్లికి ధనం కావాలి. అంటే వరకట్నం యింత అని ఆమె నిర్ణయించాలి. ఎక్కువ కట్నం యిచ్చిన వారే ఆమెకు నచ్చుతారు. వారే మంచివారు, యోగ్యులు. ఆ కట్నంతో పాటు అత్తగారి లాంఛనాలు, ఆడ బడుచుల లాంఛనాలు, నగలూ కావాలి. అమ్మాయి ఉద్యోగం చెయ్యాలి. ఉద్యోగం చేస్తే ఆ జీతం సొమ్ము కూడా తమకే దక్కుతుంది గదా! ఈ అభిప్రాయం ఉండే వరుని మాతృ దేవతకు – తన కుమార్తెకు తక్కువ కట్నంతో – వీలయితే కట్నం లేకుండానే – అందగాడైన వరుడు దొరకాలి. లాంఛనాల నిర్బంధం, ఉద్యోగ ప్రసక్తి ఉండ కూడదు. ఇప్పుడు మధ్య తరగతి కుటుంబాలలో జరుగుతున్న పద్ధతియే ఇది! వరకట్నం వరుడికి చెందదు. అది అతని తల్లికి చెందవలసినదే. ఆమె యిష్ట ప్రకారమే దాన్ని వినియోగించ వలసి ఉంటుంది. దీన్ని పరిశీలించి చూస్తే ఆడదానికి శత్రువు ఆడదే అని గ్రహించ వచ్చును.

తక్కిన వన్నీ అనుకూలంగా ఉన్నా, చాలా వివాహాలు బుసిగి పోవడానికి ప్రధాన కారణం వరశుల్కమే! వరుని తల్లి మూలంగానే చాలా మట్టుకు వివాహాలు కుదరకుండా పోతాయి. ఆమె తన కోరికను వరుని మీద, భర్త మీద త్రోసి, తాను ఏమీ ఎరగనట్లు నటించడం పరిపాటి. పెండ్లి విషయంలో ఆమె మాటకు తిరుగు ఉండదు. నూటికి తొంభై పాళ్ళు ఇలా జరుగు తున్నది. వరశుల్కం తీసుకునే పెళ్ళికి సమ్మతించనని కన్య చెప్తే ప్రయోజనం లేదు. కాబోయే అత్తగారి నోటి నుండి ఆ మాటరావాలి. ఆమె వరకట్న నిషేధాన్ని మనసారా కోరితే– ఇంటి మగవారు ఎదురు తిరగరు. ఎదురు తిరుగలేరు. శాసనాల వల్ల ఏమి ప్రయోజనం లేదు. ఈ విషయంలో వరుల తల్లులు విశాలాశయాలతో ముందుకు వస్తే ఈ వరశుల్క సమస్య పరిష్కార మవుతుంది. అంతే కాని ఉపన్యాసాల వల్ల, ప్రచారం వల్ల కూడా లాభం ఉండదు.

–బులుసు వేంకట రమణయ్య

## విడిన మబ్బు

స్థితులు ఎదురవుతాయోనని నీ భయం. అందుకే నీలో నువ్వే బాధపడుతున్నావ్. అంతేనా' నిక్కచ్చిగా నిలదీశాడు ప్రశాంత్.

ఊహించని పరిణామం ఎదురవటంతో ఏం చెప్పాలో తోచక ఏదో తెలియని భావంతో నిలువెల్లా చిగురుటాకులా కంపించి పోయింది దీప.

'లే ... లేదు ... అది ... అదేం కాదు' అన్న మాటలు మాత్రం అనుమతి తీసుకోకుండానే దీప పెదవుల నుండి బైటికొచ్చేశాయి.

'ఆ రోజు సాయంత్రం నేను టాంక్‌బండ్‌కి వెళ్ళినప్పుడు నువ్వు అనుమానంతో నా వెంట రావటం నేను గమనించలేదనుకున్నావా?

దిగ్భ్రాంతిగా భర్త వంక చూసింది దీప.

ఇంత నిశితంగా తనను గమనిస్తున్నాడని ఊహించలేదు.

నెమ్మదిగా దీప భుజంమీద చెయ్యివేసి 'లేనిపోని అనుమానాలు పెట్టుకుని ఇలా నీలో నువ్వే కృశించిపోకు దీపా. ఏదైనా ఉంటేనన్ను సూటిగా అడిగేసెయ్. నేనేమీ అనుకోను. అంతేకానీ నువ్వు కనక ఇలాగే ఉంటే రేపు నీకేదయినా ... అయితే ... నేనెలా తట్టుకుంటాననుకున్నావ్. కావాలంటే చెప్పు ఈ ఉద్యోగానికి రేపే రిజైన్ ఇస్తాను. ప్రయత్నిస్తే ప్రశాంతమైన బ్రతుకుతెరువు దొరక్కపోదు. నేను నీ కోసమే జీవిస్తున్నాను. నన్ను నమ్ము దీపా నన్ను నమ్ము ...' ప్రశాంత్ కళ్ళు కుండపోతగా వర్షించ టానికి సిద్ధంగా ఉన్న మేఘాల్లా ఉన్నాయి.

కానీ ఆ పని దీప చేసింది.

అమాంతం లేచి భర్త రెండు చేతులూ పట్టుకుని 'నన్ను క్షమించండి .. నిజంగా ఇన్నాళ్ళూ నేనెంత వక్రంగా ఆలోచించాను. నా పాపానికి నిష్కృతిలేదు. దేవుడులాంటి మిమ్మల్నే అనుమానించాను. నాకేదైనా ఘోరమైన శిక్ష వెయ్యండి. లేకపోతే నేను భరించలేను. ప్లీజ్ ...' దీప కళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

ఆమె కళ్ళు వాచినాయి.

పశ్చాత్తాపంతో ఆమె నిలువెల్లా దహించుకు పోతోంది.

'ఛ ... అవేం మాటలు దీపా. నీ అనుమానం తీరింది అదే నాకు కొండంత బలం. ఇవాళ హోటల్లోనే మన డిన్నర్ ఓ. కే. ఏదీ ఒకసారి నవ్వు' అంటూ గిలిగింతలు పెట్టాడు ప్రశాంత్.

గోదారిలా గలగలానవ్వేసింది దీప. ఆకాశాన్ని అప్పటివరకు కమ్మిన మేఘాల తెరలు విచ్చుకున్నాయి. □

కొత్తది

సూపర్ సాఫ్ట్? అమ్మయ్య ఇప్పటికైనా ఒక చుండ్రు నిర్మూలనేగాక, నా కురులను మృదువుగా నిగనిగలాడేలా పట్టులా జారిపోయ్యేలా మనస్సుకు హత్తుకునేలా తీర్చిదిద్దే ఒక సలక్షణమైన షాంపుగా అంటూ లభిస్తున్నది.

# కేశసంరక్షిణి చుండ్రునివారిణి షాంపూ




క్రొత్త సూపర్‌సాఫ్ట్‌లో చుండ్రు నివారిణిగా జగద్విఖ్యాతి గాంచిన ఒక మౌళిక ధాతువును చేర్చి తయారుచేయబడింది. సూపర్‌సాఫ్ట్ మీ తలపైగల చర్మాన్ని ఆరోగ్యవంతంగాయుంచి దురదలేకుండా జేసి చుండ్రుకు దూరంగా యుంచుతుంది.

అంతేగాకుండ ఇది మీ కురులను కోమలంగా తీర్చు కండిషనర్ అన్ని సద్గుణాలు ఏకంగా తనలో ఇముడ్చుకున్న సూపర్‌సాఫ్ట్ మీ కురులను నిగనిగలాడేలా, మనసుకు హత్తుకునేలా చేస్తుంది.

సూపర్ సాఫ్ట్‌ను క్రమం తప్పకుండ ఉపయోగించండి. వేరే షాంపూ అవసరము మీకిక రానేరాదు.

An Eskayef Product

అన్ని గుణాలు ఒకేదానిలో

బాలల్లారా రారండి! బాలరంజని మీదండి!!




మీకు ఉత్సాహాన్నిచ్చే మంచి మంచి సీరియల్స్,విజ్ఞానంతో పాటు వినోదాన్నిచ్చే చక్కని కథలు, ఇంకా ఏవిటంటే – బొమ్మల కథలు, వింతలు – విశేషాలు, మహనీయుల చరిత్రలు – ఇంకా – ఆరోగ్యానికి చిట్కాలు, పజిల్స్,ఇట్లా ఎన్నో వున్నాయి!

అన్నట్టు మీరు పాల్గొనే శీర్షికలు కూడా వున్నాయి!
అవేమిటంటే –

చిన్నారి నేస్తాలు (మీ ఫోటో పంపితే అచ్చు వేస్తారు)
బడిలో నా మొదటి రోజు (మీ అనుభవం రాసి పంపండి)
అడగండి, చెబుదాం (మీరే ప్రశ్న అయినా అడగండి జవాబు వస్తుంది)

మీకు కార్టూన్లు వెయ్యటం వచ్చా? ప్చ్! రాదా? పోన్లెండి, జోకులు వెయ్యటం వచ్చు కదా! అయితే ఓ పని చెయ్యండి! కార్టూన్ మాటల పోటీలో పాల్గొనండి! మాటలు రాసి బహుమతి గెలుచుకోండి!

## ఇక ఆలోచించకండి!

వెంటనే వెళ్లి రంగురంగుల పత్రిక **బాలరంజని** పిల్లల మాసపత్రిక కొనండి.

వెల ఎంతనుకున్నారూ?

రెండు రూపాయలే!

ఇది పిల్లల పత్రికైనా పెద్దవాళ్ళు కూడా నిరభ్యంతరంగా చదువుకోవచ్చు!

**ఆంధ్రపత్రిక ప్రచురణ**

# పాపాయికి తినిపించే ప్రతి చెంచాలో తల్లి ప్రేమతోపాటూ మా నాణ్యతనూ రంగరించి ఇస్తున్నాం

మేలురకం పాత్రలు నాణ్యమైన సేలం స్టీలు రేకుతో తయారైనవి

సేలం స్టీల్‌లో మేము కంటికి కనిపించే దానికన్నా మరెంతో చెంచాలో ఉందని విశ్వసించేవాళ్ళం. అందుకే మేం ఎంచుకునేవన్నీ-అది సాంకేతిక విజ్ఞానం అయినాసరే, ముడిపదార్థమైనా సరే–ఉన్నత ప్రమాణాల్లో ఉండాలని కోరి, ప్రయాసపడి, ప్రపంచంలోనే ఉత్కృష్టమైనది ఎంచుకుంటాం. అలాగే తయారీలోకూడా అడుగడుగునా ప్రతి చిన్న విషయాన్నీ ఎంతో శ్రద్ధతో పరిశీలిస్తాం. నిరంతరం అత్యున్నతమైన నాణ్యతగల వస్తువుల ఉత్పత్తే మా ధ్యేయం

మా దృష్టిలో చెంచా అంటే కేవలం చెంచా మాత్రమేకాదు. మా సంస్థతత్వానికి, అభిరుచికీ ప్రతీక. మాకు మీపైఉన్న శ్రద్ధాసక్తులకు ఋజువు–అమ్మ ప్రేమలాగా.



**సేలం స్టీల్ కర్మాగారం**
సేలం-636 013, తమిళనాడు
స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్
భారత ప్రభుత్వ సంస్థ

## సేలం స్టెయిన్‌లెస్.

దీనినే కోరుకోండి. ఎందుకంటే దీనికి మించినది దొరకటం అసాధ్యం.

# ఎయిడ్స్‌ను అరికట్టండి



## ఎయిడ్స్ అంటే ఏమిటి ?

- ఎయిడ్స్ ఒక అంటురోగం. ఇది శరీరంలో రోగనిరోధనా శక్తిని క్షీణింపచేసి, దానిని బలహీన పరుస్తుంది.
- ఇది వైరస్ వలన సంభవిస్తున్నది.

## రోగ లక్షణాలు

- బరువును కోల్పోవటం
- విరోచనాలు
- రోజుల తరబడి జ్వరం

## తక్కిన లక్షణాలు

- ఎప్పుడూ దగ్గుతూ ఉండటం
- గ్రంధులు ఉబుకడం
- చర్మం వాపు

## ఇది ఎలా వ్యాపిస్తుంది?

- ఈ రోగం ఉన్న వ్యక్తితో లైంగిక సంబంధం ద్వారా
- సక్రమంగా స్టెరిలైజ్ చేయని సిరంజిల ద్వారా
- ఈ రోగం ఉన్న వ్యక్తి నుండి రక్తాన్ని, రక్త సంబంధమయిన వాటిని తీసి మరొకరికి ఎక్కించటం ద్వారా

## దీనిని అరికట్టడం ఎలా ?

- అపరిచితులతో లైంగిక సంబంధం పెట్టుకోవద్దు
- రక్తాన్ని ఎక్కించవలసిన అగత్యం ఏర్పడినప్పుడు అపరిచితుల రక్తాన్ని స్వీకరించవద్దు
- స్టెరిలైజ్ చేయని సిరంజిలను, సూదులను ఇంజెక్షను ఇవ్వడానికి వాడవద్దు
- కండోమ్సును వాడండి

**పై లక్షణాలు కన్పించినప్పుడు మీ డాక్టరును సంప్రదించండి.**



న్యూఢిల్లీలోని ఆరోగ్యం మరియు కుటుంబ సంక్షేమ మంత్రిత్వ శాఖ, డైరెక్టరేటు జనరల్ ఆఫ్ హెల్త్ సర్వీసెస్. సెంట్రల్ హెల్త్ ఎడ్యుకేషన్ బ్యూరో

davp 86/147

# అభిమాన తారలపై అభిప్రాయం

"ఖైదీ" చిత్రములో "చిరంజీవి నటన చూసి ఆయన అభిమానిగా మారి సంఘము స్థాపించినాము. ప్రతి సంవత్సరము, చిరంజీవి పుట్టిన రోజున పేదలకు అన్నదానము, వస్త్ర దానము చేయుచున్నాము. చిరంజీవి గారు కేవలం "మాస్" వారిగా మిగిలిపోకుండా విజేత, మగధీరుడు వంటి కథా చిత్రాలలో నటించి మంచి పేరు తెచ్చుకో



వలెనని ఆశిస్తున్నాము.

– సి. హెచ్. బాబ్జీ, నిడదవోలు

★ ★ ★

తెలుగు చిత్రసీమలో కొందరు నటీమణులు గ్లామర్‌కి ప్రాధాన్యత ఇస్తే మరికొందరు నటనకు ప్రాధాన్యత ఇస్తారు. కాని నటిస్తూ తనతో పాటే ప్రేక్షకులని తన నటనతో ఓ మూడు గంటల పాటు హిప్నటిజం చేసి తన ఆధీనంలో వుంచుకునే శక్తి సుహాసినికి వున్నందు వల్లనే ఈయేటి భారత "ఉత్తమనటి" కాగలిగింది.

సుహాసిని నటించిన కొన్ని చిత్రాల్ని చూస్తే తను నవ్వుతూ ప్రేక్షకుల్ని నవ్విస్తూ, తను ఏడవకుండా తన నటనతో ప్రేక్షకుల కళ్ళ వెంట నీళ్ళు తెప్పిస్తుంది. మొన్నటి మంచుపల్లకి, నిన్నటి శిక్ష, ముద్దుల మనవరాలు, నేటి స్వాతి, స్రవంతి, సిరివెన్నెల చిత్రాల్లోని పాత్రల్ని చూస్తే ఒక చిత్రంలోని పాత్రకు మరో చిత్రంలోని పాత్రకు ఏమాత్రం పోలిక లేదు. కాని తను నటించిన ప్రతి పాత్ర ప్రేక్షకుల హృదయాల్లోకి దూసుకు వెళుతుంది. ఆరు కోట్ల తెలుగు ప్రేక్షకులకు



ఆణిముత్యం తెలుగమ్మాయి కాని సుహాసిని. ఇటీవల ఉత్తమ నటి బహుమతి అందుకున్నప్పుడు పత్రికల వారితో అన్నది సంవత్సరానికొక ఆర్ట్ చిత్రంలో నటిస్తానని. చాలా మంది నటీనటులు కమ్మర్షియల్ చిత్రాల్లో నటించడానికి ఇష్టపడతారు కాని ఆర్ట్ ఫిలిమ్‌లో నటించడానికి ముందుకు రారు. కాని సుహాసిని ఆర్ట్ ఫిలిమ్స్‌లో నటిస్తాననడం గమనించదగ్గ విషయం. విశ్వనాథ్ గారి వద్ద అసిస్టెంట్ దర్శకురాలిగా చేరతాననడం హర్షించ దగ్గ విషయం. సుహాసిని ఓ చిత్రానికి దర్శకత్వం వహించి, తానే బాలూ మహేంద్రలా ఫొటోగ్రఫీ కూడా నిర్వహిస్తే ఆ చిత్రం బాలచందర్, విశ్వనాథ్, శ్యాం బెనెగల్, బాలుమహేంద్ర చిత్రాలకు ఏమాత్రం తీసిపోదని, ఆ విధంగా సుహాసిని చేస్తుందని తెలుగు ప్రేక్షకులు ఆశించవచ్చు.

–షేక్ సుభాని, న్యూపాల్వంచ

★ ★ ★

నాటి 'పెళ్ళిచూపులు' చిత్రం నుండి నేటి 'అరుణకిరణం' చిత్రంవరకు ఎక్కువ వెరైటి పాత్రలు నటించి తక్కువ కాలంలో నటనలో ఎక్కువ నైపుణ్యం సంపాదించిన 'విజయశాంతి' నా అభిమాన నటి.

నటనలో తన ప్రత్యేకతను కనబరుస్తూ 'ప్రతిఘటన' చిత్రంలో 'ఝాన్సీ' పాత్రలో ఆమె ప్రతీకార చర్య, 'దేవాలయం'లో ఆమె నాట్యం, 'వందేమాతరం'లో 'డాక్టర్ శాంతి'గా శాంతియుతమైన పాత్రలో ఆమె నటనా నైపుణ్యం,



'శ్రావణసంధ్య'లో 'శ్రావణి పాత్రలో లాయర్‌గా ఆమె వాదన, ఇటువంటి పాత్రలన్నీ ఆమెను ఉన్నతమైన స్థాయికి తెచ్చాయి. 'అరుణకిరణం' చిత్రంలో డాక్టర్ 'అరుణ' పాత్రలో ఆమె నటన అద్భుతం. చిత్రంలో చివరి వరకు ప్రాణమిడి మిగిలే పాత్రలు ఆమెకు ఎక్కువ పేరు తెస్తున్నాయని నా అభిప్రాయం. ప్రతీ పాత్రకు న్యాయం చేకూరే విధంగా నటించాలని, రాష్ట్రస్థాయి 'అవార్డు' అందుకున్న ఆమెకు జాతీయస్థాయి 'అవార్డు' కూడ రావలెనని ఆశిస్తున్నాను.

–ఎం. ఎస్. ఎన్. మూర్తి

మిండి, విశాఖపట్నం

★ ★ ★

నా అభిమాన నటుడు నాల్గు దశాబ్దాల తెలుగు కళామతల్లి ముద్దులకొడుకు నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు కుమారుడు తెలుగు తెర యువ సామ్రాట్ అక్కినేని నాగార్జున. ఈయన తెలుగు చిత్ర పరిశ్రమలో అడుగుపెట్టినప్పటి నుండి ప్రారంభమయ్యాయి, క్రొత్త క్రొత్త రికార్డులు. మొదటి చిత్రం "విక్రమ్" విడుదల తర్వాత ఆంధ్రదేశంలో క్రొత్త క్రొత్త రికార్డులు సృష్టిస్తూ తెలుగు సినీపరిశ్రమలో సంచలనం కలుగజేస్తూ ముందుకు పోతున్నారు. అయితే నాగార్జున మొదటి విజయం చూచి సంతోషపడక, తరువాత చిత్రాలు కూడ అఖండ విజయాలు సాధించాలనే పట్టుదలతో కృషిచేసి తన తండ్రిలాగ పేద విద్యార్థులకు సహాయ సహకారాలు



అందిస్తూ తండ్రికి తగ్గ తనయుడు అనిపించుకొని, కొన్ని పాత్రలకే పరిమితం కాకుండా వైవిధ్యమున్న, విభిన్న పాత్రలు పోషించి గుర్తింపు తెచ్చుకోవాలని అతని అభిమానిగా నా ఆకాంక్ష.

–బి. వి. సుబ్బయ్య, ప్రొద్దుటూరు

★ ★ ★

నా అభిమాననటి రాధ. ఆమె తన అందచందాలతో నటనా వైదుష్యంతో ఎందరో ప్రేక్షకుల హృదయాలను ఆకట్టుకున్నది. గ్లామర్ వల్ల కొంతమంది, టాలెంట్‌వల్ల కొంతమంది అభివృద్ధిలోకి వస్తారు. కాని గ్లామర్, టాలెంట్ రెండూ వున్న తారలు మన తెలుగు సినీరంగంలో అరుదుగా వున్నారు. వారిలో రాధ ఒకరని చెప్పవచ్చు. "శక్తి, ఇద్దరు దొంగలు, అగ్నిపర్వతం, పల్నాటిసింహం, అడవిదొంగ, రక్తసిందూరం, కొండవీటి రాజా" మొదలైన చిత్రాలలో నటించి గ్లామర్ తారగా పేరు తెచ్చుకున్నది. "ముదల్



మరియాదై" (తెలుగులో "ఆత్మబంధువు") చిత్రంలో టాలెంటెడ్ హీరోయిన్‌గా ఎంతో పేరు తెచ్చుకున్నది. అనతికాలంలో రాధ సూపర్ స్టార్ కావాలని ఆకాంక్షిస్తూ, నా అభిమాన నటుడైన "సూపర్‌స్టార్ కృష్ణ" గారితో ఎక్కువగా ఆమె నటించవలెనని నా అభిలాష.

–సి. జగన్మోహన్, నెల్లూరు ☐

కె.రాధాకృష్ణ సమర్పించు

విశ్వశాంతి ఎంటర్‌ప్రైజస్

# కలియుగ కృష్ణుడు

SASI ADS.



దర్శకత్వం:
కె.మురళీమోహనరావు

నిర్మాత
ఎ.కె.వి.ప్రసాద్

సహనిర్మాత: డి.నారాయణదాస్

పరుచూరి బ్రదర్స్   చక్రవర్తి

నందమూరి మోహనకృష్ణ

# సినిమా



"అడవిరాజా"లో శోభన్‌బాబు, రాధ

## ఎ.వి.ఎం. ప్రొడక్షన్స్ "సంసారం ఒక చదరంగం"

ఎ. వి. ఎం. సంస్థ ఒక సత్సాంప్రదాయాన్ని నెలకొల్పింది. తమిళంలో సూపర్‌హిట్ అయిన తమ "సంసారం అదు మిన్సారం" చిత్రాన్ని తెలుగులో "సంసారం ఒక చదరంగం"గా నిర్మించే ముందు పత్రికల వారికి తమిళ చిత్రాన్ని ప్రదర్శించి తెలుగు వెర్షన్‌లో ఏఏ పాత్రలను ఎవరెవరు ధరిస్తారో తెలిపారు. ప్రతి కుటుంబంలో జరిగే చిన్న చిన్న పొరపొచ్చాలను ఏ విధంగా పరిష్కరించుకోవచ్చునో ఆద్యంతం ఉత్కంఠను కలిగించే రీతిలో రూపొందించే ఆణిముత్యం లాంటి ఈ చిత్రంలో సుహాసిని, గొల్లపూడి మారుతీరావు, శరత్‌బాబు, దిలీప్, రాజేంద్రప్రసాద్, హాజాషెరీఫ్,

# శేషాలు

జి. వి. జి.

"కౌబాయ్ నెంబర్-1"లో బవిత



"కోనసీమ కుర్రోడు"లో భానుప్రియ, అర్జున్

అరుణ, అన్నపూర్ణ, ఇళవరశి, ఒక కీలకమైన పాత్రలో షావుకారు జానకి నటిస్తున్నారు. సెప్టెంబర్ 1న ప్రారంభమైన చిత్రీకరణ ఒకే షెడ్యూల్లో ముగుస్తుంది. మిశు రాసిన కథ, స్క్రీన్ప్లేకు గణేశ్‌పాత్రో సంభాషణలకర్త, వేటూరి గీతాలను చక్రవర్తి స్వరపరచారు. వినాయకం ఛాయ, బి. నాగరాజు శిల్పం, ఎతల్ కూర్పు, పులియూర్ సరోజ నృత్యాలతో ఎం. శరవణన్, ఎం. బాలసుబ్రమణియన్, ఎం. ఎస్. గుహన్ నిర్మాతలు. తమిళంలో సూపర్ డైరెక్టర్‌గా పేర్గాంచిన ఎస్. పి. ముత్తు [illegible]



"సామ్రాట్"లో రమేష్

## సినిమా

# హీరో కృష్ణ కుమారుడు హీరో రమేష్ చిత్రావళి

"సూక్ష్మగ్రాహి. ఎంత పెద్ద డైలాగ్ అయినా స్పష్టంగా, సహజంగా, సునాయాసంగా ఇట్టే చెప్పేయగల జ్ఞాపకశక్తి, సామర్థ్యమున్న యువకుడు", అన్నారు సంభాషణోచ్చారణలో క్షుణ్ణంగా శిక్షణ ఇచ్చిన సుప్రసిద్ధ డైరెక్టర్ వరప్రసాదరావు:

"ఎంతో శ్రద్ధగా డాన్స్ నేర్చుకున్నాడు. వొళ్ళు ఒంచి, ఏ డాన్స్ అయినా ఎంతో ఈజ్‌తో చేయగలడు", అన్నారు నృత్యంలో శిక్షణ ఇచ్చిన ప్రముఖ డాన్స్ మాస్టర్ హీరాలాల్.

"హైలీ ఫోటో జెనిక్ ఫేస్", అన్నారు విఖ్యాత ఛాయాగ్రాహకుడు వి. ఎస్. ఆర్. స్వామి.

"బాల్యం నుంచే అగ్నిపరీక్ష, నీడ, మోసగాళ్ళకు మోసగాడు, అల్లూరి సీతారామరాజు– వగైరా పది చిత్రాలలో నటించి అనుభవం పొందినందు వల్ల చక్కగా భావ ప్రకటన చేయగలడు. కాన్సన్‌ట్రేషన్ ఉంది. టైమింగ్ సెన్స్ ఉంది. సూపర్ హీరోకి ఉండాల్సిన ఈ అర్హతలన్నీ ఉన్నందు వల్ల తప్పకుండా తండ్రికి తగ్గ తనయుడనిపించుకుంటాడు", అన్నారు డైరెక్టర్ ఎస్. వి. రాజేంద్రసింగ్.

పై ప్రముఖుల ప్రశంసలతో పాటు అభిమానుల అభినందనలు అందుకున్న రమేష్, బి. కాం. ఫైట్స్, మార్షల్స్ ఆర్ట్స్‌లో కూడా శిక్షణ పొందాడు.

అన్నిటికీ మించి ఎ. ఎన్. ఆర్., బాబీగార్ల ఆశీస్సులతో హీరోగా కెమెరా ముందు నిలుచున్నాడు సూపర్‌హిట్ హిందీ చిత్రం "బేతాబ్" ఆధారంగా కృష్ణ సమర్పించే పద్మాలయ స్టూడియోస్ (ప్రైవేట్)లిమిటెడ్ నిర్మించే "సామ్రాట్" 70 ఎం. ఎం., స్టీరియో ఫోనిక్ శబ్ద విస్తరణ చిత్రం కోసం. అంచేత, ఈ యువహీరోకి ఎంతటి ఉజ్వలమైన భవిష్యత్తు ఉంటుందో ఇట్టే ఊహించుకోవచ్చు.

"ఆగస్టు 29న ప్రారంభోత్సవం తర్వాత అక్టోబర్ 10 నుంచి జనవరి వరకు ప్రతినెలా ఇరవై రోజుల పాటు షూటింగ్", అన్నారు నిర్మాణ సారథి జి ఆదిశేషగిరిరావు. ఈలోగా హీరోయిన్ ఎవరో నిర్ణయించ బడుతుంది. శారద, సత్యనారాయణ, నూతన్ ప్రసాద్, వేలు ప్రభృతులు తక్కిన భూమికలు పోషిస్తారు.

పరుచూరి సోదరుల మాటలు, వేటూరి పాటలు, బప్పీలహరి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, బొంబాయి పప్పీవర్మ సాహసాలు, కోటగిరి గోపాలరావు కూర్పుతో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న జి. హనుమంతరావు "బెంగళూరు, కుద్రేముఖ్, కార్వార్, చిక్‌మగళూర్, మెర్కారా తదితర కర్నాటక ప్రాంతంలో షూటింగ్ జరుగుతుంది", అన్నారు.

**"చిన్ని కృష్ణుడు"**: రమేష్ హీరోగా జంధ్యాల రచన, దర్శకత్వంలో పంపిణీదారుడు జి. సుబ్బారావు నిర్మించే "చిన్ని కృష్ణుడు" చిత్రం షూటింగ్ సెప్టెంబర్ 10 నుంచి అమెరికాలో జరుగుతోంది. ఇందులో రమేష్ తల్లిదండ్రులుగా శరత్‌బాబు, ప్రముఖ కన్నడ నటి భారతి నటిస్తున్నారు. ఆర్. డి. బర్మన్ సంగీత దర్శకుడు.

**"కారవాన్"**: అఖండ విజయం సాధించిన "కారవాన్" ఆధారంగా రమేష్‌తో తయారయ్యే చిత్రానికి ఎస్. ఎస్. రవిచంద్ర దర్శకుడు. బప్పీలహరి సంగీత దర్శకుడు.

శ్రీ సారసా మూవీస్

# ఒకరాధ ఇద్దరు కృష్ణులు

ఎ.కోదండరామిరెడ్డి

ఇళయరాజా యండమూరి సత్యానంద్ లోక్‌సింగ్

శ్రీనివాసరాజు · డి.వెంకటరత్నం · పి.శరత్

స్రష్టా:




• నైజాం: దిగ్విజయా ఫిలింస్, సికింద్రాబాద్; • సీడెడ్: భాస్కర్ పిక్చర్స్, చిత్తూరు; • నెల్లూరు: మహాలక్ష్మీ ఫిలింస్, నెల్లూరు;
• గుంటూరు: గీతా ఫిలింస్, గుంటూరు; • వెస్ట్: ఉషా పిక్చర్స్, ఏలూరు; • వైజాగ్-శ్రీకాకుళం: విజయలక్ష్మీ ఫిలింస్, వైజాగ్;

CHITRA PUBS.

# డాక్టర్ భానుమతి భర్త శ్రీ పి. ఎస్. రామకృష్ణారావు అస్తమయం



"విప్రనారాయణ, బాటసారి, వివాహబంధం" వంటి ప్రతిష్టాత్మకమైన చిత్రాలకు ప్రతిభావంతంగా దర్శకత్వం వహించిన ప్రముఖ నిర్మాత, భరణీ స్టూడియోస్ అధినేత శ్రీ పాలువాయి శ్రీ రామకృష్ణారావు (68) సెప్టెంబర్ 4న అమెరికాలోని న్యూజెర్సీలో కాలధర్మం చెందారు. జూలైలో ఈయన చికిత్స నిమిత్తం సతీమణి భానుమతితో అమెరికా వెళ్ళారు.

శ్రీ రామకృష్ణారావు 12-10-1918న కర్నూలులో జన్మించారు. అక్కడ, మదనపల్లి, బందరులో విద్యాభ్యాసం చేశారు. తర్వాత హెచ్. ఎం. రెడ్డిగారి రోహిణీ సంస్థలో రెప్రెజెంటిటివ్‌గా, ఎడిటర్‌గా పని చేశాక స్టార్ కంబైన్స్ వారి "కృష్ణప్రేమ" చిత్రానికి సహకార దర్శకునిగా పని చేస్తున్నప్పుడు ఆ చిత్రంలో నాయికగా నటిస్తున్న భానుమతిని ప్రేమించి, 1943 ఆగస్ట్ 8న పరిణయమాడారు. వీరి ఏకైక పుత్రుడు డాక్టర్ భరణి ఇప్పుడు అమెరికాలో సర్జన్‌గా ఉంటున్నారు. కుమారుని పేరిట భరణీ పిక్చర్స్ సంస్థను నెలకొల్పి, స్వీయ దర్శకత్వంలో తొలిసారిగా "రత్నమాల" చిత్రం నిర్మించారు అనంతరం 1950లో భరణీ స్టూడియోస్ నిర్మించారు.

"లైలామజ్ను, ప్రేమ, విప్రనారాయణ, చింతామణి, చక్రపాణి, బాటసారి, వరుడు కావాలి వివాహబంధం, గృహలక్ష్మి", ఇతర సంస్థలకు "బ్రతుకు తెరువు, అనుబంధాలు, శభాష్ రాజా ఆత్మబంధువు" చిత్రాలు డైరెక్ట్ చేశారు.

"అమెరికాకు ఇద్దరంగా వెళ్ళాం. సెప్టెంబర్ 20న ఒంటరిగా తిరిగొస్తున్నాను. 'బాస్' ఇక లేరు", విలపిస్తూ న్యూజెర్సీ నుంచి ఫోన్‌లో భానుమతి తెలియజేశారు.

(జి. పి. జి.)



"తేనె మనసులు"లో సుహాసిని




మీరు ఆ పాత్రలో నటించలేదు, జీవించారట - అందువలన మీకు ఉత్తమనటి అవార్డు రావటానికి అవకాశం లేదట!

## కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో బాలకృష్ణ "సామ్రాట్"

"సెప్టెంబర్ నుంచి డిసెంబర్ వరకు ప్రతి నెల 1-10 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. మరో విశేషం – గణేష్‌పాత్రో నా పిక్చర్‌కి మొదటి సారిగా డైలాగ్‌లు రాస్తున్నారు" అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వంలో దేవీ కమల్ మూవీస్ అధినేత కె. సి. శేఖర్‌బాబు నిర్మిస్తున్న పై చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, రావుగోపాలరావు, గొల్లపూడి మారుతీరావు, సుధాకర్, రాజేష్, నూతన్ ప్రసాద్, వేలు, అరుణ, వై. విజయ, రమాప్రభ, నిర్మల వగైరా తారాసందోహం. గణేష్ పాత్రో మాటలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, తోట తరణి శిల్పం, సలీం నృత్యాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు తెరవెనుక హంగులు.

## ఎ. ఎన్. ఆర్ తో సురేష్ ప్రొడక్షన్స్ "గురుబ్రహ్మ"

"ఆగస్ట్ 21 నుంచి నెలాఖరు వరకు అన్నపూర్ణా స్టూడియోలో మొదటి షెడ్యూల్ జరిగింది," అన్నారు డి. రామానాయుడు. ఈయన నిర్మిస్తున్న సురేష్ ప్రొడక్షన్స్ "గురుబ్రహ్మ" చిత్రంలో ఎ. ఎన్. ఆర్. చంద్రమోహన్, దగ్గుబాటిరాజా, శరత్‌బాబు, రాజేష్, సత్యనారాయణ, వేలు, రాళ్ళపల్లి, శారద, రజని, రాజ్యలక్ష్మి, మాధవి, ప్రభ, తులసి ఆదిగా గల వారు పాల్గొంటున్నారు. శ్రీనివాస చక్రవర్తి కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, రఘు ఛాయ, మార్తాండ్ కూర్పుతో బోయిన సుబ్బారావు దర్శకుడు. □

"ఏం చెప్పమంటారు డాక్టరుగారూ? మేం నిజంగా గొడవలో పడ్డాం. మీకు తెలుసో తెలీదోగానీ అన్ని రకాలూ వాడి చూసాం మేం. అయితే అవేవీ వారికి నచ్చకపోవడం లేదా నాకు పడకపోవడం.

ఇది నిజంగా ఓ సమస్య అయికూర్చుంది. దీని గురించి మా మధ్య రోజూ చర్చే.

నాకు ఆయన సరదా తీర్చాలనుంటుంది. అయితే ఎలాగో మాత్రం తెలీడం లేదు.

మీరే ఒక దారి చూపి మాకు సాయపడాలి."

ఇదిగో మీరు ఎదురుచూస్తున్న పరిష్కారం.
ప్రపంచమంతటా డాక్టర్లు వెజైనల్ కాంట్రాసెప్టివ్స్ (స్త్రీలకోసం గర్భ నిరోధక సాధనం) సిఫార్సు చేస్తున్నారు. ఆ మాటకొస్తే, వెజైనల్ కాంట్రాసెప్టివ్స్‌ని 60 కన్న ఎక్కువ దేశాలలోని లక్షలాది స్త్రీలు అనేక ఏళ్ళుగా వాడుతున్నారు, నమ్మకంగా.

ఇప్పుడు ఆ విజయవంతమైన స్వకీయ గర్భ నిరోధక విధానం భారతదేశానికి వచ్చింది మొట్టమొదటిసారిగా.

దాని పేరు 'టుడే'. వెజైనల్ కాంట్రాసెప్టివ్స్‌కు మార్గదర్శకులు, ప్రపంచనాయకులైన డబ్ల్యు.జె. రెండెల్, యు.కె. వారి సహకారంతో తయారుచేయబడుతోంది.

స్త్రీలు కోరేది 'టుడే'. 'టుడే' సురక్షితమైనది గనక. 'టుడే', ఎంతెంతో అమోఘమైనది. హార్మోనులు లేనిది. దీంతో వేరే అనవసరపు బాధలు ఎదురవవు.

'టుడే' అనువైనది.

పురుషులు 'టుడే'ని మెచ్చుకుంటారు. మీరు పంచుకునే ఆ సన్నిహితత్వానికిది ఆటంకం కాదు గనక.

'టుడే' మరేదో కాదు. డాక్టర్ ఆదేశించేది అదే.




Today
వెజైనల్ కాంట్రాసెప్టివ్



"కౌబాయ్ నెం-1" షూటింగ్ సందర్భంగా నాయిక రజనికి సూచనలిస్తున్న దర్శకుడు కె. ఎస్. ఆర్. దాస్

# డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్

"నాకు చక్కని ఫామిలీ సెంటిమెంట్ సబ్జెక్ట్‌లను డైరెక్ట్ చేయాలనే ఆశ. 'ప్రేమజీవులు, మా ఊరి గంగ, ఊరికి ఉపకారి, గౌరి కల్యాణం' – ఈ నాలుగు చిత్రాల ద్వారానే ఆ ఆశ నెరవేరింది. క్రయిమ్ – ఆక్షన్ చిత్రాల డైరెక్టర్‌గానే నాకు పేరొచ్చింది. అసలు క్రయిమ్ చిత్రాలకే శ్రమ ఎక్కువ. రిస్క్ ఎక్కువ. 'జేమ్స్‌బాండ్ 777' చిత్రంలో జీప్‌ల ఛేసింగ్ సన్నివేశమొకటుంది. నేను కెమెరాతో పాటు కూర్చున్న జీప్‌కు సడన్‌గా బ్రేక్ పడడంతో నేను అమాంతంగా అందులోంచి విసిరి వేయబడ్డాను. వెంబడిస్తున్న నాలుగు జీప్‌లలోని డ్రయివర్లు కూడా హఠాత్తుగా బ్రేక్‌లు వేసి ఆ జీప్‌లను ఆపకపోతే, ఇక నా స్థితి ఇంతే సంగతులు అయి ఉండేది," అన్నారు కొండా సుబ్బరామదాస్.

ఈయన సొంత ఊరు వెంకటగిరి. కొంతకాలం నెల్లూరులో చదువుకున్నారు. ఇంట్లో దేవుడి మొక్కుబడి కోసం పెద్దలు ఉండీలో దాచిన నాణేలు కాజేసి, చల్లగా వెళ్లి ప్రతిరోజూ ఏదో ఒక సినిమా చూస్తుండేవారు. గుంటూరుకు కూడా వెళ్లి "పాతాళభైరవి" సినిమాను అయిదారు సార్లు చూశారు. ఇంటర్వెల్ సమయంలో కేబిన్ దగ్గరికెళ్లి ప్రొజెక్టర్ వంక గుడ్లప్పగించి చూస్తుండిపోయేవారు – ఆ పరికరం ఎన్ని అద్భుతాలు చేస్తోందని. ఫిలిమ్ ముక్కలేవైనా కిందపడి ఉంటే తీసి జేబులో దాచుకునేవారు. అలా నేడు జీవనాధారమైన ఫిలిమ్ ముక్కలతో సంబంధం ఆయనకు ఆ రోజుల్లోనే ఏర్పడింది. దీంతో చదువుకు బ్రేక్ పడడంతో గుంటూరులోని

కృష్ణమహల్ థియేటర్‌లో బుకింగ్ క్లర్క్‌గా కొంత కాలం పని చేశారు. తర్వాత రెప్రజెంటేటివ్ అయి, ఫిలిమ్ డబ్బాలతో ఊరూరా తిరగసాగారు. అలా ప్రజల నాడిని తెలుసుకోడానికి వీలైంది.

విజయా ప్రొడక్షన్స్‌లో ఈయన అన్న జగన్నాథ్ నిర్వహణ శాఖలో ఉండేవారు. 1957 లో అన్నను చూడ్డానికి మద్రాసు వచ్చినప్పుడు కొన్ని సినిమా షూటింగ్‌లు చూశాక మద్రాసులోనే స్థిరపడిపోవాలనిపించింది. ఈ విషయాన్నే తన అన్నతో చెప్తే, ఆయన నిర్మాత ఎస్. భావనారాయణ దగ్గరికి తీసుకెళ్ళి, సిఫారస్ చేశారు. "ఎడిటింగ్ నేర్చుకుంటావుటోయ్?" భావనారాయణ చుట్ట పొగ గుప్పున వదులుతూ అడిగారు. "అలాగే," అన్నారు దాస్. అప్పుడు భావనారాయణ "బంగారాముడు" చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఎడిటర్ ఎన్. ఎస్. ప్రకాశంకు అప్రెంటిస్‌గా ఉంటూ, దర్శకత్వ శాఖలోనూ పని చేశారు దాస్. ఆ నిర్మాత తదుపరి చిత్రం "రమాసుందరి"కి అసిస్టెంట్ ఎడిటర్ అయి, అదే చిత్రం హిందీలో డబ్ చేయబడ్డప్పుడు దాస్ ఎడిటర్ అయ్యారు. ఇలా ఆరు నెలల్లోనే ప్రమోషన్ పొందారు. ఈయనలోని ప్రతిభను గుర్తిస్తూ వచ్చిన ఆ నిర్మాత 1965 లో "లోగుట్టు పెరుమాళ్ళకెరుక" చిత్రానికి డైరెక్టర్‌గా చేశారు.

"ఎడిటర్ డైరెక్టరవడం వల్ల ప్రయోజనాలేమిటి?" అన్న ప్రశ్నకు దాస్ ఇలా అన్నారు :

"ఎడిటింగ్, డైరెక్షన్ రెండూ ఒకదానికొకటి చాలా దగ్గరగా ఆధారపడ్డ శాఖలు. ఎడిటర్‌గా ఉన్నప్పుడు డైరెక్టర్ భావాలను దృష్టిలో ఉంచుకొని పని చేయవలసి వచ్చేది. డైరెక్టర్‌ని అయ్యాక ఎడిటర్‌ని దృష్టిలో ఉంచుకొని, షూట్ చేస్తున్నాను. ఎడిటరే డైరెక్టరయితే, అనవసరమైన సాగు ఉండదు. తన టెక్నిక్‌ను జోడించుకుంటూ ఫైట్స్, ఛేసింగ్ వగైరాలను తనకు కావలసినట్లల్లా కచ్చితంగా తీసుకోవచ్చు. డైరెక్టర్‌కి కాల్పనిక శక్తి ఎంత అవసరమో, ఎడిటర్‌కి అంత విమర్శనాశక్తి అవసరం. ఎన్నో అవార్డులు పొందిన 'ఛెమ్మీన్' మలయాళ చిత్రానికి ప్రముఖ దర్శకుడు హృషికేశ్ ముఖర్జీ ఎడిటరు. ఈయన తనకు కావాలని చెప్పి, అదనంగా మరికొన్ని షాట్స్ తీయించి మరీ ఎడిట్ చేశారట," అన్నారు దాస్.

ఈయన హిందీలో "రాఖీ మేరానామ్, ఇన్సాఫ్, రాకీ ఔర్ జానీ", కన్నడంలో కూడా పలుచిత్రాలను డైరెక్ట్ చేశారు. ఈయన చిత్రాలెన్నో ఇతర భాషల్లోకి డబ్ చేయబడ్డాయి.

ఈయన సమర్పణ, దర్శకత్వంలో ఈయన ఏకైక పుత్రుడు కె. సుకుమార్ ఇదివరకు "నేరస్థుడు" చిత్రాన్ని నిర్మించారు. ఇప్పుడు "కౌబాయ్ నెంబర్-1" నిర్మిస్తున్నారు.

–జి. వి. జి.

"కవచెపయాని"లో చక్రపాణి, విజయరంజని



## సమృద్ధ పరిమళము
## సరియైన ధరతో




**ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.**

"గులాబి మరియు ఆకుపచ్చ రంగులలో లభించును"



జయలక్ష్మీ
గుంటూరు వారి
తయారీ

Imageads-2107 Tel

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



డి. శేషుకుమారి అమలాపురం

స్త్రీకి ప్రాధాన్యత ఇచ్చే చిత్రాల్లోనే మీరు నటించి ... జీవించాలి. ఝాన్సీ రుద్రమ్మ, ఝాన్సీలక్ష్మి పాత్రల్లో మీరు నటించాలి?

నా మీద మీకున్న అభిమానానికి అభినందనలు. అవకాశం లభిస్తే మీరు కోరిన పాత్రలు తప్పక చేసి మీ కోరికను నెరవేర్చగలను.

వి. వెంకటనాగయ్య, ప్రొద్దుటూరు

కళాత్మక విలువలున్న చిత్రమే ఉత్తమ చిత్రమని శ్రీ అక్కినేనిగారు, డబ్బులొచ్చే చిత్రమే ఉత్తమ చిత్రమని శ్రీ రామారావుగారు అన్నారు. ఒక ఉత్తమ నటిగా ఏ అభిప్రాయంతో ఏకీభవిస్తారు?

పెద్దవాళ్ళు అన్న మాటల్లోని అర్థాలు ఏవైనప్పటికీ కళాత్మక చిత్రాలైనా ... డబ్బులొచ్చే చిత్రాలైనా, ప్రజల అభిమానాన్ని పొందినవే మంచి చిత్రాలని నమ్ముతాను.

కె. సుబ్రహ్మణ్యం, తవణంపల్లి

'అభిమాన తారలపై అభిప్రాయం' శీర్షికలో ప్రచురించబడే పలువురు అభిమానులు మీకు తెలిపిన అభిప్రాయాలను, సలహాలను సూచనలనూ పరిశీలించి మీ స్థానాన్ని సుస్థిరం చేసుకోవాలని నా కోరిక.

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తున్న "అభిమాన తారలపై అభిప్రాయాలు" శీర్షికను ప్రతి వారం చూస్తున్నాను. అందులో పలువురు అభిమానులు సూచిస్తున్న సూచనలు తెల్సుకుంటున్నాను.

మున్నలూరి ప్రసాద్, చిలకలూరిపేట

మీరే కనక చిత్ర నిర్మాత అయితే ఏ తరహా చిత్రాల్ని నిర్మించుతారు? ఎటువంటి చిత్రాల్లో నటిస్తారు?

నేను నిర్మాతను కాను. ఒకవేళ గనక అయితే మీరు మెచ్చేటువంటి చిత్రాలు నిర్మించి నటిస్తాను.

యం. సునీత, కరీంనగర్

చాలామంది సినీ నటీనటులు డాక్టర్ కాబోయి యాక్టర్ని అయ్యానని యింకా ఏదో ఏదో అంటుంటారు. మరి మీరేమంటారు?

నేనేమీ అనను.

## ఉత్తమ ప్రశ్న

వై. వి. రమణారెడ్డి (రెడ్డిపల్లె) కడప

సందేశాత్మకమైన చిత్రాల ద్వారా కొంతవరకైనా సమాజంలో మార్పు తేవచ్చు అన్నది నా అభిప్రాయం. నా యీ అభిప్రాయంతో ఏకీభవిస్తారా?

సందేశాత్మక చిత్రాల్ని జనరంజకంగా రూపొందిస్తే సమాజంలో పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా మార్పుని తీసుకు రావచ్చు అన్నదే నా అభిప్రాయం కూడా!

టి. శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి, గుంటూరు

ఒక నటి లేక నటుడి భవిష్యత్ ప్రేక్షకాదరణ పైనే ఆధారపడి వుంటుందంటారా?

నూటికి నూరు పాళ్ళూ!

రామకృష్ణారెడ్డి, బెంగుళూరు-10

ప్రతిఘటన బెంగుళూరులో 200 రోజులకు పైగా (5 ఆటలతో) నడుస్తున్నందుకు మీ అభిమానిగా గర్విస్తున్నాము. దీనికి మీ సమాధానం?

మంచి చిత్రాలకు భాషతో సంబంధం లేదనడానికి మరో నిర్వచనమే బెంగుళూరులో 'ప్రతిఘటన' సాధిస్తున్న విజయం.

యస్. సుగుణ, కాకినాడపట్నం

అభిమానుల హృదయాలను నటనాచాతుర్యంతో దోచేస్తున్న మీరు ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణపొందారా? లేక స్వయంకృషితో పట్టుదలతో పైకి వచ్చారా?

ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందలేదు. అయితే నటిని అయ్యాక వచ్చిన పాత్రలు ... ఆ పాత్రల్ని మెచ్చి మీరు ఇస్తున్న ఆశీర్వాద బలంతో మీ అభిమాన నటిని అయ్యాను.

ఎ. కొండయ్య, వెగుంటపాడు-524139

లాయర్, డాక్టర్, యాక్టర్‌గా పలురకాల పాత్రల్ని పోషించి మెప్పిస్తున్న మీరు కలెక్టర్ పాత్ర వేయాలని నా కోరిక. ఏమంటారు?

అవకాశం లభిస్తే తప్పక ఆ పాత్ర ధరించి మీ మెప్పు పొందుతాను.

ఆర్. నాగమణి, కాజీపేట

సృష్టిలో అతి తీయనిది స్నేహమంటారు. మరి మీతో స్నేహం చేయాలని వుంది. మీ అడ్రసు తెలుపరూ ...

ఎంతో అభిమానంతో మీరు నాతో స్నేహం చేయాలన్న అభిప్రాయానికి వచ్చినందుకు చాలా కృతజ్ఞతలు. 16 పార్థసారథిపురం, టి. నగర్, మద్రాసు-17 అని వ్రాస్తే మీ ఉత్తరం నాకు అందుతుంది.

పి. రేణుకాదేవి, తెనాలి-2

మీ ఝాన్సీ పాత్రకు ప్రేరణ ఏదన్నా ఉందా?

దర్శకులు కృష్ణగార్ని అడిగితే మీ ప్రశ్నకు సమాధానం లభిస్తుంది.

కూపన్

ఆంధ్రసచిత్ర వారపత్రిక

విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ______________________

______________________

పంపిన వారి పేరు : ______________________

పూర్తి చిరునామా : ______________________

# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి

# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం ! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.50 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడీకాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట, ఏలూరు.

డబ్బుకోసమేనా మీ చింత ! మార్గదర్శి ఉన్నది మీ చెంత !!



మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్.

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్ సెంటర్ హైదరాబాద్ - 500 001.

Kiron·MCF-86-3

సీరియల్

# సంకెళ్ళెవరికి?





## డాక్టర్ కొత్త రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

చెంగల్పట్టు వస్తుంటే కాలిముత్తు మనసులో పరిపరివిధాల ఆలోచనలు చెలరేగాయి.

పాత కే.డి. లక్ష్మణస్వామి వెంట నిన్న వచ్చిన అమ్మాయే రూప అయుంటుందని అతడికి అనుమానం రాకపోలేదు! రూప వేనిటీబాగ్ ఇంజన్ షెడ్‌లో చూసిన దగ్గర్నుండీ అతనికి అనుమానం ఎక్కువయింది. వాడిని ప్రశ్నించితే ఏడుపు తప్ప జవాబు రాలేదు! ఉండు స్టేషన్‌కు పోనీయ్! వీడిచేత ఎలా మాట్లాడించాలో తెలియకపోతే యీ పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో వుద్యోగం ఎందుకు, అనుకుంటూంటే అతని పెదవులపై చిరునవ్వు కనపడింది.

ఇంజన్ షెడ్‌లో ముసలాడు రెండు దెబ్బలకే బాల్చీ తన్నేసాడు. ఇంకా ఎక్కువసేపు అక్కడ వుండీ ప్రయోజనం లేదు అనిపించి త్వరత్వరగా వచ్చేసాడు. జీపు దగ్గరకు వచ్చేసరికి ఇంజన్ షెడ్ లోంచి మంటలు వస్తున్నాయి! కరెంటు షార్ట్ సర్క్యూట్ అయి ఒక వేళ ఇలా మంటలు వచ్చాయా? జనం పోగయి ముసలాడి సంగతి తెలుసుకునే లోపల వెళ్ళి పోవటం మంచిదని జీపును పోనిమ్మన్నాడు. ప్రమాదవశాత్తు షెడ్ ముట్టుకుని ముసలాడు తగలడి పోయాడు అనుకుంటారు జనం!

ఒకవేళ అతని శవం దొరికినా పోలీసు దెబ్బలు కనబడవు గదా! నిజానికి ముసలాడిని అలా వదిలేసి రావటానికి కాలిముత్తు అంతరాత్మ క్షణం సేపు తిరగ బడింది. అతని శవం చెంగల్పట్టు తీసికొని వెళ్ళినందు వల్ల పోలీసులకు ఉపకారం కంటే అపకారమే ఎక్కువ!

ముసలాడు చనిపోయిన విషయం యస్. పి.కి చెప్పకుండా వుందా మనుకున్నాడు కాలిముత్తు!

లాకప్ రూమ్‌లో లక్ష్మణస్వామిని పడవేసి ఎడాపెడా తన్నాడు కాలిముత్తు. వాడు ఓపిక కొద్దీ కేకలు పెట్టి ఏడ్చి ఒక్కసారిగా సొమ్మసిల్లినట్లు పడి వుండి పోయాడు. "వీడు కూడా చచ్చాడా?" అనుకుంటూ వెళ్ళి కనురెప్పలు తెరచి చూడబోయాడు కాలిముత్తు. కనురెప్పలు బలవంతంగా మూసుకున్నాయి.

"దొంగ వెధవ! దొంగ వేషాలు! వీడికి ఇలా కాదు సరయిన కోటింగ్ యిస్తే దారికి వస్తాడు" అని మనసులో అనుకుని కాన్స్టేబిల్‌కు సైగ చేసాడు.

జరిగిన కథ-9: రూపను వెతుక్కుంటూ వచ్చిన సి. ఐ. కాలిముత్తు బలగానికి పొలాల మధ్య షెడ్‌లో రూప వేనిటీ బాగ్ కనిపిస్తుంది. రూప ఆచూకి తెలుపమని అక్కడ ఉన్న ముసలతన్ని అడిగితే అతను సమాధానం చెప్పకపోవడంతో ఎడాపెడా కొడతాడు కాలిముత్తు. ముసలతను చనిపోతాడు. పోలీసులంతా వెళ్లారని నిర్ధారణ చేసుకున్న తరువాత షెడ్‌లోకి వెళతాడు చింటూ. తండ్రి మరణానిక దుఃఖించి అతని శవాన్ని షెడ్‌లోనే పెట్టి తగులపెట్టేస్తాడు. చింటూ వెనకనే భమేలీ, రూప పొలాల మధ్యగా పోసాగారు.

లక్ష్మణస్వామి రెండు చేతులూ వెనక్కు విరిచి కట్టి దూలానికి వేలాడదీసారు. అతన్ని గిరగిరా తిప్పుతూ పైకి లాగి ఒక్కసారిగా కిందకు వదలసాగారు. నాలుగుసార్లు అలా చేసేసరికి వాడు ఏడుస్తూ "నిజం చెబుతా! నన్నొదిలి పెట్టండి" అన్నాడు. కాన్స్టేబిల్ తాడు వదిలితే దబ్బున నేలమీద పడిపోయాడు లక్ష్మణస్వామి.

"నిన్న నీ వెంట వచ్చిన అమ్మాయి ఎవరు?"

"టైగర్ రామస్వామి ఇలాకాలో మనిషి రాణి! టైగర్‌ను పోలీసులు పట్టుకుంటే ఇలా వచ్చింది."

"రేయ్! ఆపరా నీ అబద్దాలు! టైగర్‌ను పోలీసులు పట్టుకున్నారా! ఎప్పుడురా?" మళ్ళీ నాలుగంటించాడు కాలిముత్తు.

"సార్! సార్ కొట్టకండి. నిజం చెప్పుతున్నా కొడతారేం సార్! ఆ అమ్మాయి అలా చెప్పింది సార్."

"ఆ అమ్మాయినేం జేసావ్?"

కొంచెం సేపు సిగ్గు పడ్డాడు లక్ష్మణస్వామి, "సార్! పిల్ల చీమ మిరపకాయలా చిటపట లాడుతుంటే చింటూ తల్లికి అప్ప జెప్పి వచ్చా! చింటూకు ఇలాటి పిల్లల్ని చూస్తే సరదా! అతను పొగరు మోతు పిల్లల్ని లొంగదీసి మచ్చిక చేయటంలో దిట్ట! నాకేదైనా బహుమతి వస్తుందని ఆశపడ్డా. అందుకే ఇవ్వాళ చింటూకు కనపడదామని వెళుతూ మీ కళ్ళ బడ్డాను!

సార్! నిజం చెప్పాగదా! ఇక నన్నొది లియ్యండి సార్!"

"అప్పుడేనా! ఇంకా నీతో చాలా పని వుంది." అంటూ వెళ్ళి పోయాడు కాలిముత్తు. గేటు దాకా వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చి–

"ఇంజన్ షెడ్‌లో వున్న ముసలతను ఎవరు?"

"అతన్ని చింటూ "నాన్నా" అని పిలుస్తాడు సార్!"

★ ★ ★ ★

ముసలతను చనిపోయిన విషయం మినహా మిగిలిన విషయాలన్నీ యథాతథంగా తంగవేలుతో చెప్పాడు కాలిముత్తు.

రూప చింటూ చేతిలో చిక్కినట్లు అర్థం అయింది! ఈ విషయం ప్రజలకు గాని పై అధికారులకు గాని తెలిస్తే గందరగోళం జరుగుతుంది! కాని ట్రైనీ ఎ.యస్.పీ. ఏమయిందని ఎవరైనా పై అధికారులు అడిగితే?

"ఏమోసార్! డ్యూటికి రావటం లేదు! సెలవు కూడా పెట్ట లేదు" అని చెప్పవచ్చు అనుకున్నాడు తంగవేలు.

వీలున్నంత త్వరలో రూపను చింటూ ముఠా దగ్గర్నుండి విడిపించాలి అనుకుని వడివేలుకు కబురు చేసాడు.

"ఏంరా! చింటూ సంగతు లేమయినా తెలిసాయా?"

"లేదు స్వామీ! వాడు తల్లిని వెంట బెట్టుకుని వేడన్‌తాంగల్‌నుండి ఎక్కడకో వెళ్ళి పోయాడట! టైగర్ ఇలాకాలో మనిషి రాణి వుందట వాడితో! వాడి తండ్రి నాగయ్య ఇంజన్‌షెడ్ కాలి తగలడి చనిపోయాక దిగులుతో వాడు

ఎక్కడో దాక్కోటానికి వెళ్ళాడు."

"వాడిప్పు డెక్కడున్నాడో చెప్పగలవా?"

"తెలీదు సార్! వాడి ముఠావాళ్ళు చాలా వూళ్ళల్లో వున్నారు. ఇక్కడ పోలీసు నిఘా ఎక్కువయితే మరో జిల్లాకో మరో రాష్ట్రానికో వెళతాడు సార్!"

"సరే! వాడి ఆచూకి తెలియగానే చెప్పు! మాతో సహకరించక పోయావో ....! ఎరుగుదువుగా!"

"ఎంతమాటసార్! వాడి సంగతి తెలియగానే మీకు వచ్చి చెబుతాను."

"సరే! వెళ్ళు!"

వాడు వెళ్ళాక తంగవేలు కాలిముత్తుతో "ఏమిటి చింటూ తండ్రి నాగయ్య ఇంజన్‌షెడ్ కాలి చనిపోయా డంటున్నాడు."

గుటక మింగి. "ఏమోసార్! మేం వచ్చేసాక ఏమైనా షెడ్ తగలడి వాడు చనిపోయాడేమో?

సార్! చింటూ మన జిల్లా నుండి పారిపోయుంటాడు సార్! పొమ్మన వద్దు పొగపెట్ట మన్నారందుకే!"

"చింటూ ఏమయితేనేం! మన ఎ. యస్. పి. రూప కనపడటం లేదు గదా! ఒక వేళ రూప గనక చింటూ చేతికి చిక్కితే మన డిపార్ట్‌మెంట్‌కు ఎంత అప్రతిష్ట!

రూప కోసమై బాగా వెదకండి, ఎంక్వయిరి చేయండి. విషయం మటుకు రహస్యంగా అట్టే పెట్టండి. విషయం బయటకు పొక్కిందో పేపర్లు నిండా ఏకిపారేస్తారు. మన పరువు బజార్నపడుతుంది! ఇప్పటికే దొంగతనాలు దోపిడీలు ఎక్కువై పోయాయని జనం గోల పెడుతున్నారు! ప్రభుత్వం దగ్గర్నుండి తాఖీదుల మీద తాఖీదులు వస్తున్నాయి."

* * * *

చింటూ, ఛమేలీ వాళ్ళ వెనగ్గా రూప పరిపాలాల కష్టంపడి ఎన్ని మైళ్ళు నడిచారో లెక్కలేదు. రోడ్డు దాటవలసి వచ్చినప్పుడు నిర్మానుష్యమైన ప్రదేశం ఎంచుకుని గభాలున దాటి పోసాగారు వారు.

చిన్నవాగు పక్కన ఇసుకనేల- చిన్న చిన్న గుట్టలు. ఒక చోట చిన్న కొంత పక్కన సమతల ప్రదేశం- అక్కడ చిన్న చిన్న ఇళ్ళు యాభై అరవై వరకూ వున్నాయి. మట్టి గోడలు పైన పాత రేకులు, రెల్లు, కొబ్బరి ఆకులు, ఆచ్ఛాదన వేసారు.

"చింటూ వచ్చాడు" అరుచుకుంటూ చిన్నా పెద్దా అంతా వచ్చి గుమి



## సంకెళ్లు వరికి?

గూడారు.

"ఎన్నాళ్ళకు కనపడ్డావు!"

"ఏమిటి విశేషాలు!"

సమాధానం చెప్పకుండా వూరి మధ్యలో వున్న పెద్ద రేకుల షెడ్డు దగ్గరకు నడవసాగాడు చింటూ. ఆ ఇళ్ళన్నింటిలోనూ అదే పెద్దది.

అంతా నిశ్శబ్దంగా నడువసాగారు. ఛమేలీ కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ చింటూ వెంట రాసాగింది. వెనుకగా వస్తున్న రూప వంక ఆశ్చర్యంగా చూడసాగారు.

కుర్చీ తెచ్చి వేసారెవరో! చింటూ దానిమీద కూర్చున్నాడు. పక్కనున్న అరుగుమీద కూలబడిపోయింది ఛమేలీ.

నాన్న చనిపోయాడు" చింటూ గొంతులో విషాదానికి చలించి సన్నగా రోదించసాగింది ఛమేలీ.

"అమ్మను చితకబాదారు. ఎలాగో ఆస్పత్రి నుండి విడిపించుకుని వచ్చాను. నాన్న దగ్గర రెండు రోజులు వున్నామో లేదో వచ్చి పడ్డారు. ఏమి చిత్ర హింసలు పెట్టారో నాన్న అయిదు నిముషాలలో చనిపోయాడు.

తంగవేలు, కాలిముత్తు, శివం ఎత్తిన వాళ్ళలా వెంటాడు తున్నారు. అందుకని వాళ్ళ జిల్లా దాటి ఇలా వచ్చాను".

"చింటూ! నువ్విక్కడ నీ యిష్టం వచ్చినన్నాళ్ళు వుండు! నీకే లోపం జరుగదు. నామనుష్యులందరూ నువ్వు చెప్పినట్లు వింటారు. ఆపద వచ్చినప్పుడు అందరం ఒకటే!" అన్నాడు ఒక ముసలతను.

"సుబ్రమణ్యం తాతా! నా గుండెల్లో రగిలే మంట వేడికి వుక్కిరి బిక్కిరి అవుతున్నాను. నేను కొన్నాళ్ళపాటు విశ్రాంతిగా వుంటాను! లేక పోతే నేనేం చేస్తానో నాకే తెలిసేట్లు లేదు".



"అలాగే చింటూ! మణీ! చింటూ వాళ్ళకు వంటచేసి భోజనం పెట్టు" అంటూ కేక వేసాడు.

వాకిట్లో నులుచున్న పదహారేళ్ళ అమ్మాయి ముందుకు వచ్చి "అలాగే తాతా" అంది.

ఆమె చింటూ వంక రెప్పార్పకుండా కాసేపు చూసి లోపలకు వెళ్ళింది.

"నిండా పదహారేళ్ళు లేవీ పిల్లకు! చూపులతోనే తినేట్లుంది చింటూను" అనుకుంది రూప.

ముసలమ్మ ఎవరో వచ్చి ఛమేలీని అక్కున జేర్చుకుని ఓదార్చుతూ అవతలికు తీసుకుని వెళ్ళింది. చింటూ వుషారుగా లేక పోయే సరికి నెమ్మదిగా ఎటు వాళ్ళు అటు వెళ్ళి పోయారు. కొద్ది మంది యువకులు మాత్రం కొంచెం సేపు రూప వంక ఎగాదిగా చూసి "చింటూ మనిషి" అనుకున్నారో ఏమో అవతలకు వెళ్ళి పోయారు.

మణి కోడిని కోసి వండి పెట్టింది. బడలిక పోయేలా వేడి నీటిలో స్నానం చేసి పడుకుని నిద్రపోయారు.

రూప నిద్ర లేచే సరికి చింటూ బయట కూర్చుని చుట్టూ జేరిన వాళ్ళతో కబుర్లు చెబుతున్నాడు. అతని కంఠంలో దిగులు లేదు యిప్పుడు! అతనిలో ఏదో కర్కశత్వం చోటు చేసుకుంది.

"పిట్టల్ని వేటాడినట్లు వెంటబడు తున్నారు! వాళ్ళకు సరయిన జవాబు చెప్పాలి! మళ్ళీ కొన్నేళ్ళ దాకా మన జోలికి రాకుండా వుండాలి" చెప్పుకు పోతున్నాడు చింటూ.

కొంత మంది అవునన్నట్లు తలలూపుతున్నారు. కొంత మంది కళ్ళల్లో ఏవో ప్రశ్నార్థకాలు కనపడ్డాయి రూపకు. వాళ్ళల్లో వొకడు. "కాని ఎన్నాళ్ళిలా పాము ముంగిసా పోరాటంలా ఎర్రటోపీలతో యుద్ధం చేయాలి? పాము ఎంత సేపు పోరాడినా చివరకు ముంగిసకు లొంగి పోక తప్పదు! ఆలోచించితే ఏమిటి మన బతుకులు?

వీధి జేబు కొట్టి వాడి యిల్లు దోచి, మెళ్ళో నగలు కత్తిరించి, రాత్రనక పగలనక ఎండనక వాననక పొలాల్లో, తుప్పల్లో, గుట్టల్లో పరుగెడుతూ వేటగాడి బారి నుండి తప్పుకునే లేడి పిల్లల్లా సరయిన కూడు గుడ్డా లేకుండా కాలం గడపడమేనా?

ఒక వేళ మనలో ఎవరయినా అదృష్టం పండి డబ్బు సంపాదించాడే అనుకో దాని వల్ల వాడి కేమి వొరుగుతుంది. ఆ డబ్బు ఖర్చు పెట్టుకోవాలంటే పబ్లిగ్గా నలుగురితో పాటు టవున్లకో, మద్రాసుకో వెళ్ళి జల్సా చేయటానికి వీల్లేదు గదా అడుగో దొంగ అని వేలెత్తి చూపుతారు మనవంక ఎక్కడకు పోయినా!

ఎంత డబ్బు సంపాదించినా మళ్ళీ మన యిళ్ళకు మనం రావలసిందే! సమాజంలో మన కొక గుర్తింపు లేదు. మనం సమాజాన్ని ఎలా దోచుకుంటున్నామో అలాగే మనని సమాజం చీడపురుగుల్ని చూచి నట్లు చూస్తుంది. మన జీవితాలు వ్యర్థం అయ్యాయి ఏ విధంగా చూసుకున్నా! పోనీ మన పిల్లలు? వాళ్ళ భవిష్యత్తు గూర్చి ఆలోచిస్తే అంతా చీకటే! వాళ్ళు మనలా దొంగలు దోపిడి దార్లు అయి దారులు కొడుతూ, ఇళ్ళు దోస్తూ జీవించాల్సిందే! అంత కన్న మంచి జీవితం వారికి దొరుకుతుందన్న నమ్మకం లేదు! తర తరాలుగా మనం ఇలానే అంధకారంలో పడి మగ్గుతున్నాము.

బావిలో కప్ప ఆహా ప్రపంచం ఎంత గుండ్రంగా వుంది అనుకున్నట్లే మన జీవితాలను చూసి మనం సంతృప్తిపడుతున్నాము. ఎన్నాళ్ళున్నా ఎర్రటోపీలకు ఎలా టోకరా వేయాలి, వొంటరిగా ఇంట్లోవున్న ముసలమ్మ నగలు ఎలా కాజేయాలి, ఎదుటివాడి జేబులో పర్సు ఎలా కొట్టేయాలి - ఇవేగా మన ఆలోచనలు! గానుగెద్దు జీవితం గడపి అందులోనే స్వర్గం వుందని సంతోషిస్తున్నాం!

బయట ప్రపంచం ఎంతో మారిపోయింది. మనిషి ఒక దేశంనుడి మరో దేశానికే కాకుండా ఇతర గ్రహాలకు వెళ్ళి వస్తున్నాడు!

మనం పొట్ట కోస్తే అక్షరం ముక్క రాకుండా కుళ్ళు జీవితాలు గడుపుతున్నాం! ఇవ్వాళ చింటూ అంతటివాడే పోలీసులు తరుముకొస్తే దిక్కు లేకుండా పారిపోయి వచ్చాడు.

తిరుమంగళంపల్లి వచ్చిన పోలీసులు ఇక్కడకు మాత్రం రారని ఏముంది?

ఆలో చించినకొద్దీ నాకు అంతా అయోమయంగా కనపడుతున్నది".

"ఒరేయి సారంగపాణీ! చదవేస్తే వున్న మతి పోయిందని మీ అయ్య నిన్ను పొరుగూరులో ఇస్కూలు చదువుకు పంపినందుకు ఇదా ఫలితం! అవతల పోలీసులు రేచు కుక్కల్లా తరుముతున్నారు చింటూను! నిలువ నీడ లేకుండా చేసి వెంటాడుతున్నారు. తండ్రిని కొట్టి చంపేశారు! తల్లిని చిత్రహింస పెట్టారు!

ఇవాళ చింటూను వేధిస్తున్నారు! రేపునిన్నో నన్నో వెంటాడుతారు! అప్పుడప్పుడూ మనం వాళ్లను ఒక కుదుపు కుదిపి ఎదుర్కొనకపోతే వాళ్లకు మరీ అలుసయిపోతాం!" అన్నాడు సుబ్రమణ్యం.

"తాతా! పెద్దవాడివి నీకు నేను ఎదురు చెప్పలేను! పోలీసులు చింటూను వెంటాడుతున్నారంటే అతను చేసిన దోపిడీలు, దొంగతనాలవల్లే కదా! ఆ పనులు మానివేస్తే పోలీసులు మన వెంట ఎందుకు పడతారు".

"వొరేయి కులవృత్తి చేస్తే తప్పేంటిరా? దొంగతనం చేయకపోతే పొట్టలో కికూడు ఎలా వస్తుంది?"

"ప్రభుత్వం మనకు సాగు చేసుకోటానికి భూమి యిచ్చింది! విత్తనాలు, పురుగుమందులు, ఎరువులు ఇస్తున్నారు. మనమేం జేస్తున్నాం! విత్తనాలూ, ఎరువులూ అయినకాడికి అమ్ముకుని పొలాలు బీళ్లు పెట్టి కడుపు కాలుతుందంటే ఎలా?"

"వొరేయి! అలవాటులేని వ్యవసాయం మనకు లాకీ కాదురా! ఇప్పుడు కొత్తగా పలుగూ, పారా, నాగలీ పుచుకోవాలంటే ఎలారా? పోనీ నువు చెప్పినట్టు బుద్ధిగా పొలాలు దున్నుకుని పంటలు పండించితే మటుకు మనల్ని ఇతర గ్రామాల్లో ప్రజలు తమలో కలుపుకుంటారా?"

"వెంటనే కలుపుకోకపోవచ్చు! కాని మనం కూడా చదువుకుని వుద్యోగాల్లో చేరి గౌరవం పొందవచ్చు. క్రమక్రమంగా మన పిల్లలు వ్యవసాయం చేసుకునీ, చదువుకునీ ఇతర వృత్తులకు వెళ్లి నలుగురితో పాటు కలిసి పోవచ్చు".

"వొరేయి సారంగం! నువ్వు లక్ష చెప్పు! కుల వృత్తికి సాటిలేదురా! మనం దొంగతనాలు మానినా దొంగ అన్న పేరు మాత్రం పోదు! డబ్బు పోయి శనీ పట్టి భ్రష్టులమవుతాము!

వాడి మాటలకేంగాని చింటూ నువ్వు సమయానికి వచ్చావు! పక్క టవున్‌లో నాటుకోటి చెట్టి వూరి బయట బంగళా కట్టుకున్నాడు. రాత్రి అతనికి మద్రాసు నుండి యాభైవేలు రొక్కం తెచ్చి యిచ్చాడు వాళ్ల మేనేజరు. ఇవాళ ఆదివారం బ్యాంకులు తీయరు! అందువల్ల డబ్బు ఇనప్పెట్టిలో పెట్టుకుని వున్నాడు. ఇవాళ రాత్రి అమావాస్య! కటిక చీకటి! నలుగురు మనుష్యులను వెంట తీసుకుని వెళ్లి డబ్బు పట్టుకురావాలి!

నీలా ఇనప్పెట్టి తీయగలవాడు మాలో ఎవరూ లేరు! ఎటు తిరిగి నీకు కబురెట్టాలి అనుకుంటుండగా నువ్వు వచ్చావు.

ఇదిగో! ఇసుకలో గీసి చూపుతున్నా ఇది అతని పడకగది. అందులోనే ఇనప్పెట్టి వుంది! ఇంటి చుట్టూ ఆరడుగుల ఎత్తున ప్రహరీ గోడ, గోడ పైన రెండడుగుల ఎత్తు ముళ్ల తీగ!

గేటు దగ్గర రాత్రింబవళ్లు గూర్ఖా కాపలా వుంటాడు. కాంపౌండులో రెండు అల్సేషియన్ కుక్కలు తిరుగుతుంటయి! ఇంట్లో టెలిఫోన్ వుంది.

ఏమంటావు?"

"భేషుగ్గావుంది! మరి ఇంతసేపు చెప్పలేదేం తాతా?"

"పొద్దున నీ వాలకం చూస్తే చెప్ప బుద్ధి కాలేదురా చింటూ! ఇప్పుడు సారంగపాణి ఇలా మన కుర్రాళ్లకు పిరికి మందు పోస్తుంటే నాకు యీ విషయం గ్నాపకం వొచ్చింది.

వొరేయి సారంగం! బీటు డ్యూటీ నీది! వెడతావా? లేక మళ్లీ పిరికి మాత్రలు మింగుతావా?"

"తాతా! మీలో వున్నంతకాలం మీ మనిషినే. సమయం వొచ్చిందని మనసులో ని మాటలు బయటకు చెప్పాను. నేను వొక్కడినీ మీ నుండి బయటకు వెళ్లి ఏం చేస్తాను. మంచో చెడో అందరితో పాటే నేనూ!

మారితే అందరమూ మారదాం! లేకపోతే మీలో నేనూ ఒకడిని!"

"మంచి మాట చెప్పావురా! ఒరేయి రంగా, అయ్యప్పా ఇలా రండి" అంటూ వాళ్లతో చెట్టి యింటి ప్లాను చెప్పసాగాడు సుబ్రమణ్యం! (ఇంకా ఉంది)




ఎ. పి. ఎల్., కర్నూలు

నా వయస్సు 24 సంవత్సరములు. నా వంటికి తగినట్టుగా నా చేతులు లావు లేవు. ఏమి చేస్తే చేతులు లావు అవుతాయి?

చేతుల కండరాలకి కదలిక కలిగించే ఏ పనైనా చేయటం మంచిది. మీరు ఫిజియో తేరపిస్టుల సలహా పొందటం మంచిది. వారు మీకు తగిన వ్యాయామాన్ని సూచిస్తారు.

సి. వి. ఆర్., భీమవరం

నా వయస్సు 19 సంవత్సరములు. నేను ప్రస్తుతం బి. ఇ. చదువుతున్నాను. కన్నవాళ్లకి నా మీద అసలు మమకారం లేకపోగా వ్యతిరేక భావం కలిగి వున్నా నేను జీవితంలో ఏదైనా సాధిద్దామని ఇంతకాలం ఓపిక పట్టాను. కాని చదువు చివరి దశలో విచక్షణా జ్ఞానం కోల్పోతున్నాను. నేను నిద్రపోయేటప్పుడు తప్ప ఎప్పుడూ చింతిస్తూనే జీవచ్ఛవంలా బ్రతుకుతున్నాను. నేను ఎవ్వరినీ సూటిగా చూడలేను. క్లాసు పుస్తకాలు చదువుతుంటే ఆడవారికి సంబంధించిన జ్ఞాపకాలు వస్తాయి. బజార్లో నడవాలంటే భయం. కొత్తవారితో, ముఖ్యంగా ఆడవారితో మాట్లాడాలంటే భయంగా వుంటుంది. భవిష్యత్తు తలచుకుంటే భయంగా వుంది. ఇవన్నీ పోవాలంటే ఏమి చెయ్యాలి?

మీరు తప్పకుండా సైకియాట్రిస్టులను కలుసుకోవటం మంచిది. వారు పరీక్షించి మీకు ఉన్న మానసిక రుగ్మతను నిర్ణయించి తగిన మందులు వాడతారు. మీకు ఉన్న లక్షణాలు తప్పక నయమవుతాయి. చికిత్సకి మీ తోడ్పాటు చాలా అవసరం.

ఎమ్. ఆర్. సి. – బెంగుళూరు

నా వయస్సు 60 సంవత్సరములు. నాకు "డుయోడినల్ అల్సర్" వున్నది. ఆపరేషన్ చేసినారు. ఆపరేషన్ అయిన 6 మాసముల నుండి నీళ్ల విరోచనాలు అవుతున్నవి. ఎన్ని మందులు వాడినా తగ్గుటలేదు. నా బరువు 75 కె.జి.ల నుండి 50 కె.జి.లకు వచ్చినది.

ప్రేవుల నరాల ప్రేరేపణ అధికం అవటం వల్ల పై లక్షణాలు ఏర్పడే అవకాశం ఉంటుంది.

మల పరీక్షలో ఏ లోపమూ లేదని నిర్ధారణ చేసుకొని, శస్త్ర వైద్యుల సలహా ప్రకారం కయొలిన్, ఆంటాసిడ్ వంటి మందులను వాడటం మంచిది.

పి. యస్. ఎమ్. – భీమవరం

నా కుమారుని వయస్సు 16 సంవత్సరములు. తెలివి తక్కువగా వుంటాడు. డాక్టర్లు మెదడు పెరగలేదన్నారు. దీనికి మందులు వున్నాయా?

మెదడు పనితనాన్ని పెంచటానికి ప్రత్యేక మందులు లేవు. మీ వైద్యులు అనుమతిస్తే ఎన్‌కెఫబాల్ అనే మందు వాడి చూడండి. □

## నడిరోడ్డులో హత్య !

శివగిరిపేటకు చెందిన కరుప్పయ్య అనే ఆయన కుమార రత్నం 21 ఏళ్ల రవి ఒకమ్మాయిని మానభంగం చేశాడని కోర్టులో కేసు నడుస్తోందట. అదే వూరుకు చెందిన మునియాండి, అతని తమ్ముడు కాళియప్పన్ ఈ కేసులో సాక్షులుఅట. వీరిమీద పగబట్టిన రవి కేసు నడిచిన రాత్రి వారింటికి వెళ్లి యింటి ముందు గలాటా చేశాడట. ఆ టయిముకు అన్నదమ్ములు యింట్లో లేరట. మర్నాడు మధ్యాహ్నం కాళియప్పన్ నేరుగా రవి యింటికి వెళ్లి రాత్రి ఆడవాళ్లముందు గలాటా చేయడంకాదు. మగాడివైతే యిప్పుడు రారా అని సవాలు చేశాడట. రవి ఇంట్లోంచి వో కత్తితో అతని మీదకు లంఘించి, కసకస అని ఆ కాళియప్పన్ను పొడిచి నడిరోడ్డులో చంపేశాడట.

## ఆసుపత్రిలో నేత్ర తస్కరణ !

రాంచికి చెందిన మానసిక ఆరోగ్యశాల అనే వో ఆసుపత్రిలో ఓ రోగి సుబోధ్‌సింగ్ వున్నట్టుండి వో అర్ధరాత్రి గావు కేకలు పెట్టాడట. డ్యూటీలో వున్న నర్సులూ, వార్డర్లు ఆ కేకలను లక్ష్యపెట్టక హాయిగా నిద్రపోయారట. సుబోధ్‌సింగ్ ముఖమంతా




నెత్తురుతో స్పృహ తప్పిన స్థితిలో ఉదయం పడివున్నాడట. తెరబారి చూస్తే అతని కళ్లు లేవట. రాత్రి హరిందర్‌సింగ్ అనే అతను యీ సుబోధసింగూ పోట్లాడుకున్నారట. అర్ధరాత్రి ఆ హరిందర్‌సింగ్ యీ పని చేశాడేమో అనుకున్నారట. కానీ యీ కళ్లు పీకడం చూస్తే అది సామాన్యంగా పోట్లాటలో కళ్లు పొడిచేసినటువంటి చర్యగా లేదని, ఎవరో ఆ పనిలో నైపుణ్యం వున్నవారు 'సుబోధ్‌సింగ్‌ను కొందరు అనుయాయులతో నొక్కి పట్టించి కళ్లు తస్కరించి వుండి వుండాలని తెలిసిందట. దీనికి ఆ ఆసుపత్రి సూపరింటెండెంట్ వొప్పక పోయినా రిటైరయిన వో వార్డరు "డి" తాను శవాలను పూడ్చేవాడిననీ, చాలా శవాలు కళ్లులేనివే తను చూసేవాడిననీ, చెప్పాడట.




## గర్భశోకం భరించలేక ఆత్మహత్య!

కులశేఖరం అనే వూరుకు చెందిన 35 ఏళ్ళ శిఖామణి భార్య 29 ఏళ్ళ గోమతి తమ 5 ఏళ్ళ కొడుకు ఒకేరోజు అనారోగ్యం చేసి మరణించడంతో ఆ బాధ తట్టుకోలేక ద్రావకం త్రాగి ఆత్మహత్య చేసుకున్నదట. ప్రాణానికి - ప్రాణంగా చూసుకుంటున్న తన కొడుకు లేని జీవితం తన కొద్దని ఆమె అరవంలో వో వుత్తరం రాసి యీ పని చేసిందట.

## ఆవేశంలో హత్య!

దిండిగల్లు ఆర్. వి. నగరుకు చెందిన 22 ఏళ్ళ రాజు రోడ్డు మీద వచ్చేపోయే అమ్మాయిలకు పోజులివ్వడమే ప్రధాన కర్తవ్యంగా పెట్టుకుని. లక్ష్యసాధనలో మునిగిపోయాడట. ఈ పనిలో అతనికి వో అమ్మాయి నచ్చి ఆమెను మరింత వెంబడించడం ఆరంభించేసరికి ఆ పేట పెద్దలకిది సుతరామూ నచ్చక అతని మీదో మీటింగు పెట్టి అతన్ని సంజాయిషికి పిలిచారట. ఈ రచ్చ చర్చలో పాల్గొన్న వో 60 ఏళ్ళ రాజాఆచారి అనే ఆయన ఆవేశంలో కత్తి తీసుకుని ఆ రాజును కసకస పొడిచి చంపేశాడట.

## వందరూపాయల కోసం భార్య హత్య!

వానియంబాడికి చెందిన 42 ఏళ్ళ ముత్తు తన మామగారితో పోట్లాడి, ఆనక మళ్ళీ సమాధాన పడ్డాడట. ఈ రకంగా పోట్లాటలు రాకుండా వో వ్రతం చేయాలని. దానికి రెండొందలు ఖర్చు అవుతుందని, అందులో సగం మామగారివ్వాలని అతడు తన భార్య 35 ఏళ్ళ లక్ష్మికి చెప్పి డబ్బు పట్రమ్మంటే ఆమె 'ముడియాదు' అన్నదట. దాంతో అతడు పచ్చడి బండతో కొట్టి ఆమెను చంపేశాడట.

## భువనగిరిలో ముగ్గుర్ని హత్య !

అమృత్‌సరస్‌కు చెందిన భువనగిరిలో పరశురామ్ అనే ఆయన షాపుకు కొంత మంది సిక్కులు వెళ్లి సరకులు కావాలన్నారట, ఆయన అవి తేడానికి తన యింట్లోకి వెళ్లారట. వీరుకూడా ఆయన వెనక వెళ్లి ఆయన్ని కాల్చి చంపివేశారట. పక్కగదిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న పరశురామ్ తమ్ముడు బాబురామ్ ఆయన భార్యా యీ శబ్దం విని "యే క్యాహై" అని అనేంతలో వారు ఆ గదిలోకి వచ్చి భార్యా భర్తలనిద్దర్ని కాల్చిచంపి పారిపోయారట.

## బస్సు ప్రమాదంతో 150 మంది మృతి !

నైజీరియా లాగోస్‌కు చెందిన బెనిన్ నగరానికి అగ్బార్ అనే వూరుకు మధ్యలో రెండు ప్రయాణీకుల బస్సులు అతివేగంగా వస్తూ ఒకదాన్నొకటి ఢామ్మని "ముఖీ ముఖీ" గుద్దుకుని పల్టీ కొట్టాయట. ఫలితంగా సుమారు 150 మంది చనిపోయారట. ఈ దారుణం 11వ తేదీన జరిగిందట. ఈ రెండు బస్సుల్లోనూ చెరివో ముగ్గురు మాత్రమే బ్రతికారట- ఆయురన్నం ప్రయచ్ఛతి... అంటే యిదేనేమో!

## అల్లుడి చేతిలో అత్త మరణం !

కోయంబత్తూరు సింగనల్లూరుకు చెందిన సుబ్బయ్య అనే ఆయన కూతురు కుప్పత్తాయి అనే ఆమెను రెండు నెలల క్రితం మణి అనే అతను పెళ్లి చేసుకుని, ఉత్తరక్షణం నుంచి డబ్బు గుంజడం ఆరంభించాడట. భార్యను డబ్బుపట్రా అని పంపి, ఆమె తిరిగి రాలేదని అతను వో యిద్దరు స్నేహితులతో మామగారి యింటికి వెళ్లాడట. అక్కడ జరిగిన వాగ్యుద్ధం పెద్దగి, పెద్దు




పెరిగిందట. దాంతో చేతికందిన వో దుడ్డుకర్రను తీసుకుని ఆ మణి తన మామగారిని కొట్టబోయేసరికి అత్తగారు 45 ఏళ్ల పాపమ్మ అడ్డు వెళ్లిందట. ఆ కర్ర ఆమె నెత్తిమీద పడి తలపగిలి ఆమె అక్కడికక్కడే చనిపోయిందట.

## అమెరికాలో శివ – విష్ణు కోవెల!

అమెరికా కాలిఫోర్నియాకు చెందిన లివామోర్ నగరంలో శివ-విష్ణు కోవెల కట్టి, జూలై నెలలో కుంభాభిషేకం చేశారట. ఫదేళ్ళ క్రితం ఆరంభించిన ఈ కోవెల కట్టి పూర్తి చేయడానికి చాలా అవరోధాలను ఎదుర్కోవలసి వచ్చిందట. అక్కడి భారతీయులు అన్నీ సాధించి యీ పని నిర్విఘ్నంగా పూర్తి చేశారట – భళా! □

# కోటయ్య అనుభవం- ప్రకటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ల రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























SAA/NIA/2802/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.



న్యూ ఇండియా ఎష్యూరెన్స్

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా !

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

# మానవత్వమా! మన్నించు!

రాజారాం

సూర్యుడు పడమటి తల్లి ఒడిలోకి ఒదిగి పోతున్నాడు. క్రమంగా సంధ్యా చీకట్లు అలుముకుంటున్నాయి. దట్టమైన అడవి. చుట్టూ ఎత్తైన కొండలు. ఆ మధ్య నుండి నల్లని త్రాచులాగా సాగిపోతున్న రోడ్డు. చీకటి అవుతున్న కొలదీ నిర్మానుష్య మవుతున్నదా ప్రదేశం. అల్లంత దూరం నుండి శరవేగంతో వస్తున్నదో మోటారు సైకిల్. చీకట్లు అలుముకుంటున్న కొలది వాతావరణం గంభీరంగా తయారవు తున్నది. ఎంత చీకటయినాసరే ఈ రాత్రికి ఇంటికి చేరాలనే పట్టుదలతో ప్రయాణిస్తున్నాడు శేఖర్.

ఒక్కసారిగా బ్రేక్‌వేసి వెనుదిరిగి చూశాడు శేఖర్. ఆ చీకట్లో తను వెళ్లవలసిన దారిని దాటాడు. అతని గ్రామానికి వెళ్లాలంటే ఆ మెయిన్ రోడ్డు నుండి చీలిన పిల్ల రోడ్డు గుండా వెళ్లాలి. తమ్ముడికి సీరియస్‌గా ఉందని, వెంటనే వచ్చి పట్నం తీసిక వెళ్లాలని టెలిగ్రాం అందడంతో హుటాహుటిని బయలు దేరాడు శేఖర్. బైక్‌ను వెనుకకు త్రిప్పి పిల్ల రోడ్డు గుండా సాగిపోతున్నాడు అతను. ఆకాశం మేఘావృతమై, ఏ క్షణాన్నైనా వర్షము కురిసేలాగుంది. మట్టి రోడ్డు అవడం మూలానా రోడ్డంతా గతుకులుగా ఉంది. గత రెండు మూడు రోజుల నుండి వర్షాలు పడుతున్నందున రోడ్డంతా బురదగా ఉంది. హెడ్ లైట్ కాంతి సరిగ్గా లేనందున తన ముందున్న గోతిని గమనించక వాహనంతో సహా గోతిలోకి దిగబడిపోయాడు శేఖర్.

"ఛ! ఈ తొందరలో ఇదొకటి! ఎప్పుడూ ఇంతే!" తనలో తాను గొణుక్కున్నాడు శేఖర్. "కొంపదీసి ఇంజన్ ఏమయినా ట్రబుల్ ఇవ్వదు కదా! ఒకవేళ అలా ఇంజన్ ట్రబుల్ ఇస్తే....? ఈ అడవిలో ఒంటరిగా...." ఆ భావన రాగానే శేఖర్ ఒళ్ళు జలదరించింది. చుట్టూ ఉన్న దట్టమైన, ఎత్తైన వృక్షాలు, ఆ చీకట్లో నల్లగా దయ్యాలలాగా ఊగుతూ కనబడు తున్నాయి. ఏదో చప్పుడు అవడంతో ప్రక్కకు చూశాడు శేఖర్. ఏవో నల్లని ఆకారం అతని వైపే వస్తున్నది. అది దగ్గరవుతున్న కొలదీ శేఖర్‌లో భయం ఎక్కువ కాసాగింది. "ఖచ్చితంగా అది ఎలుగే! ఇప్పుడేమి చేయాలి? దీని నుండి ఎలా తప్పించుకోవడం? చేతిలో కనీసం ఒక కర్ర అయినా లేదే!" అని అనుకుంటూ మోటార్‌బైక్‌కు ఆ వైపున చేరి తచ్చాడసాగాడు. భయంతో ముడుచుక పోతున్నాడు శేఖర్. ఇంతలో వికృతంగా అరుస్తూ శేఖర్‌పై పడిందా ఎలుగు. వాహనానికి ఆవలి వైపున శేఖర్, ఈవలి వైపున ఎలుగు. శేఖర్ ప్రాణాలు గాలిలో తేలియాడు తున్నాయి. వాహనాన్ని వదిలి పరుగెడుదామంటే, చుట్టూ దట్టమయిన అడవి. దానికి తోడు బురద, ముళ్ల పొదలు. ఎలుగుబారి నుండి తప్పించుకోవడానికి సకల ప్రయత్నాలు చేస్తున్నాడు శేఖర్. తలమీద, భుజం మీద గాయాలయ్యి రక్తం కారుతోంది. ఒక్కసారిగా భయంకరంగా అరుస్తూ ప్రక్కనున్న ఆకారం మీద పడిందా ఎలుగు. శేఖర్‌కు అంతవరకే గుర్తు. తిరిగి అతనికి స్పృహ వచ్చేసరికి అతను ఓ గుడిసెలో ఉన్నాడు. భారంగా కళ్ళు తెరిచాడు. తలమీద అయిన గాయం చాలా నొప్పెడుతోంది. బాధగా మూలిగాడు. చేతికి, తలమీద ఏదో పసరు పూసి ఆకుతో కట్టు కట్టారు.

"దాహం" అంటూ ప్రక్కకు తిరగబోయాడు. ఒళ్లంతా నొప్పులు. కదల లేక పోయాడు.

"నీళ్లా దొరా!" అంటూ దగ్గరగా వచ్చిందామె.

"ఆఁ!" అంటూ కళ్ళు తెరిచాడు.

నీళ్ల ముంతతో వచ్చింది ఆమె. చేయూత నిచ్చి కూర్చో బెట్టింది. ఆ గుడ్డి దీపపు వెలుతురులో అతనికి స్పష్టంగా కనిపించినవి ఆమె కళ్లే! క్షణం సేపు అతని కళ్ళు ఆమె కళ్లతో కలిశాయి. "ఏం దొరా! అలా సూత్తుండావు! ఇంద ఈ నీళ్ళు తీసికో, నేను ఎల్లి పాలు తీసికొస్త. కాసిన్ని పాలు తాగితే పాణం నిమ్మల పడతది. నొప్పిగా ఉందా దొరా! చెట్టు ఆకుతో కట్టు కట్టినంగా దొరా! తెల్లారేకల్లా నొప్పి తగ్గుతాది. ఇక్కడ మీకేం భయం లేదు దొరా! హాయిగా పడుకో దొరా!" అంటూ అక్కడి నుండి వెళ్లిందామె. శేఖర్ ఆ నులక మంచం మీద పడుకున్న మాటేగాని నిద్ర అతని ఛాయలకు రావడం లేదు. ఒకవైపు గాయాల నొప్పి శారీరకంగా బాధ పెడుతూ ఉంటే, ఒక వైపు హృదయం కెలుకుతూ మానసికంగా బాధ పెడుతోంది. అతని మనసంతా గజిబిజిగా తయారయ్యింది. అతని కళ్ల ముందు దాదాపు సంవత్సరం క్రితం జరిగిన సంఘటన మెదిలింది. మనసు గతంలోకి వెళ్లింది.

★ ★ ★ ★

శేఖర్ ఆ పట్టణంలో బి.ఏ. చదువు తున్నాడు. ఫైనల్ ఇయర్ కావడం వల్ల చాలా కష్టపడి చదువు తున్నాడు. క్లాస్ తేవాలని అతని పట్టుదల. అతనికి ఏ రకమయిన ఇబ్బందులు లేవు. డబ్బు పుష్కలం. అలా అని అతడు ఎలాంటి దుర్వ్యసనాలకు లోనుకాలేదు. తనకున్న దానిలో కొంత ప్రక్కవానికి పెట్టాలనే మనస్తత్వం అతనిది. అందుకే అతనంటే అందరూ ఇష్టపడతారు. మరుసటి రోజు ఎకనామిక్స్ ఎగ్జామ్ ఉన్నందున రాత్రి చాలా పొద్దుపోయే వరకు చదివాడు. రాత్రి పన్నెండు గంటలు కావస్తోంది. టీ త్రాగి వద్దామని రూమ్‌కి తాళం వేసి బయటికి నడిచాడు శేఖర్. దగ్గర్లో ఉన్న బస్ స్టాండ్‌లోని టీస్టాల్ వైపుకి వెళుతున్నాడు అతను. దాదాపు బస్‌స్టాండ్ అంతా నిర్మానుష్యంగా ఉంది. కొంత మంది జనం ప్లాట్‌ఫామ్ మీద నిద్రపోతున్నారు. నేరుగా క్యాంటీన్‌లోకి నడిచాడు శేఖర్. టీ త్రాగుతూ తనకు కొద్ది దూరంలో ప్లాట్‌ఫామ్ మీద కొందరు కుర్రాళ్ళు చేస్తున్న అల్లరిని గమనిస్తున్నాడు. వారు ఆమె చుట్టూ చేరి ఏదో మాట్లాడు తున్నారు. ఆమె దిక్కుతోచక అటూ ఇటూ చూస్తోంది. ఆమెను ఏదో అల్లరి చేసేటట్లున్నారు వాళ్ళు. బిల్లు చెల్లించి లేచాడు శేఖర్. శేఖర్ వాళ్ల దగ్గరకు చేరగానే ఇబ్బందిగా అతని వైపు చూస్తూ ప్రక్కకు తప్పుకున్నారు ఆ కుర్రాళ్ళు. శేఖర్‌ని చూడగానే ప్రాణం లేచివచ్చినట్లయ్యింది ఆమెకి. అతని కళ్లలోకి కృతజ్ఞతా భావంతో చూసింది.

"ఎక్కడికి వెళ్లాలి?" ప్రశ్నించాడు శేఖర్.

చెప్పింది ఆమె.

"నీ వొక్కదానివే వచ్చావా? మీ వాళ్ళు ఎవరు రాలేదా?"

"వచ్చింద్రు. కాని అల్లగూడేం సాయంత్రేల యెల్లిపోనారు. నానేమో సినమా సూసి పది గంటల బస్సు కెల్దమనుకొన్న దొరా! ఈ బస్సేమో ఇయ్యాల రాలేదు! నాకేమో భయంగా ఉంది" అంటూ శేఖర్ వైపు దీనంగా చూసింది ఆమె.

"నాతో వస్తావా?"

"వస్తా!" అంటూ అతన్ని అనుసరించిందామె.

ఇంటికి చేరారిద్దరు. "ఏమయినా అన్నం తింటావా? అదిగో చూడు! ఆ గదిలో తినేటందుకు అన్నీ ఉన్నాయి తిను" అంటూ ముందు గదిలోకి వచ్చి కూర్చున్నాడు అతను.

బెదురు బెదురుగా చూస్తూ తన ముందు అతను లేకపోవడంతో ఆకలితో ఉన్నది కాబోలు గబాగబా తినేసింది.

"ఎవరో! ఇతను! ఎంత మంచోడు! కాకపోతే ఇంటికి తీసికొచ్చి అన్నం పెడతడా? ఎంతయినా పెద్దోళ్ల గుణం పెద్దోళ్లదే!" అని తనలోనే అనుకుంది.

మెల్లగా ఆ గది నుండి శేఖర్ ఉన్న గదిలోకి వచ్చి గోడకు వోరగా నిలబడింది. గాజుల సవ్వడి అవడంతో తలెత్తి చూశాడు శేఖర్.

"ఏం! తిన్నావా? సరిపోయ్యిందా?"

"ఆ(!" అంటూ తలూపింది. ఇంత రాత్రేల సదువుతూ ఉంద్రు. పెద్ద సదువులు చదివితే ఇట్టాగే సదవాలా దొరా!"

ఆ ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో శేఖర్‌కి తోచలేదు. ఆమె వైపు చూస్తూ ఉండి పోయాడు. ఆమె కళ్ళలోని అమాయకత, ఒక రకమయిన వింత ఆకర్షణ అతన్ని ఓ క్షణంసేపు స్తబ్దున్ని చేశాయి. ఆ ట్యూబ్ లైట్ వెలుతురులో అప్పుడే దిగివచ్చిన వనదేవతలా ఉందామె. విరిసీ, విరియని పుష్పంలా, పరిమళాలు వెదజల్లే పారిజాతంలా ఉందామె.

"ఆ(!".... అవును ఇలాగే చదవాలి అంటూ జవాబిచ్చాడు. నీకు నిద్ర వస్తుంది కాబోలు. చూడు! ఆ మధ్య గదిలో చాప ఉంది పరుచుకొని పడుకో" అంటూ అటు వైపు చూపించాడు శేఖర్.

"అలాగే" అంటూ మధ్య గదిలోకి వెళ్ళింది. పడుకున్న కాసేపట్లోనే మంచి నిద్రలోకి, జారిపోయిందామె.

శేఖర్ చదువుతున్నాడన్న మాటేకాని తలకేమి ఎక్కడం లేదు. ఏదో లోపం ఉంది తనలో. అతని మనసులో ఏదో వికారం చోటు చేసి కొంటోంది. మనసును అదుపులో పెట్టుకొనే ప్రయత్నం చేస్తున్నాడు అతను. కాని మానసిక పోటీ అధికం కాసాగింది. జీవితంలో కొన్ని కొన్ని మధురమయిన అనుభూతులు, అనుభవాలు ఒకసారి జారివిడిచితే తిరిగి రావు అని అతని మనసు వత్తిడి చేస్తోంది. అందుబాటులో ఉన్న అందాలను అందుకోవడంలో తప్పు లేదని ప్రేరేపిస్తున్నది అతని అంతరాత్మ.

మనసంతా చికాకుగా తయారయ్యింది. రాత్రి రెండు గంటలు కావస్తోంది. ఓ వైపు అతని మనసు తప్పు చేస్తున్నావని హెచ్చరిస్తున్నా, అతని అడుగులు మధ్య గదిలోకి పడ్డాయి. ఆమె మంచి నిద్రలో ఉంది. పచ్చని వన్నెలతో ఆమె శరీరచ్ఛాయ మిలమిలా మెరిసి పోతోంది. ఉచ్ఛ్వాస, నిశ్వాసలకు ఆమె ఎత్తులు ఎగిరెగిరి పడుతున్నాయి. ఆ వయసు పొంగులను దాయలేక దాస్తున్నదా అన్నట్టుంది ఆమె బిగుతయిన జాకెట్టు. పమిట స్థానం తప్పడంతో మరింత పిచ్చెక్కించేట్టుగా ఉందామె పరువం. శేఖర్‌లోని "వయసు" ఒక్కసారిగా మేల్కొంది. అతనిలోని విచక్షణా శక్తి నశించి-పోతోంది. అతని కళ్ళ ముందు ఆమె నగ్న రూపం మెదలాడుతోంది. అతనిలో అంతవరకు దాగిఉన్న మానవత్వం చోటున్నే దానవత్వం చోటు చేసికొంది. ఒక్కసారిగా ఆమెను చుంబించాడు. తనకు కలిగిన స్పర్శతో మెల్లగా కళ్ళు తెరిచిందామె.

ఆమె నిద్ర పటాపంచ లయ్యింది. శేఖర్ కళ్ళు కామపుపొరలతో భైర్లు కమ్మాయి.

"ఏంటి దొరా! తమరేనా ఇలా సేత్తా వుండారు? దేముడి లాంటోళ్ళు!"

అతని కేమి వినిపించడం లేదు.

ఆమె అమాయతకు దీనత్వం చోటు చేసికొంది. ఆ కళ్ళలోని వింత ఆకర్షణ భయం మాటున దాగి బిక్కు బిక్కు మంటోంది. అసహాయంగా చూస్తూ ఉండి పోయింది. అతని కౌగిలిలో నలిగి పోతోంది. ఆ క్షణికోద్రేకం చల్లారేవరకు అతని బిగి కౌగిలిలో ఇమిడి పోయిందామె. తెల్లవారి అతను లేచి చూసేసరికి ఆమె వెళ్ళి పోయింది.

* * * *

తెల్లవారింది. గూడెం నిద్ర లేచింది. శేఖర్‌కు ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. ఎలాగో ఓపిక కూడ గట్టుకొని లేచి కూర్చున్నాడు.

"లేశారా దొరా!" అంటూ దగ్గరగా వచ్చింది ఆమె. సూర్యుని లేత కిరణాలు నేరుగా ఆ గుడిసెలో పడుతున్నాయి. ఆమెను నఖశిఖపర్యంతము పరీక్షించి చూశాడు శేఖర్. సందేహం లేదు. తన ఊహ నిజమే! నోట మాటరాక అచేతనుడై చూస్తూ ఉండి పోయాడు.



"ఏంటిదొరా! మాట్టాడకుండ అయ్యింద్రు?"

.... ....

"గుర్తు పట్టింద్రా దొరా! ఆ రోజు.... మావా! ఇట్రా" అంటూ పిలిచింది.

శేఖర్ ఒడలు భయంతో కంపించి పోతోంది. ఆమె మోములోని చిరునవ్వు అతనికి కంపరం పుట్టిస్తోంది. ఆ దారిలో ఆ ఎలుగుబారిన పడక [illegible] యినా

# ఎడ్ల పందాలలో ఛాంపియన్ పోటీని కనిపెట్టిన శ్రీ వెంకయ్య

ఒక్కొక్క రంగానికి ఒక్కొక్కరు ఎనలేని సేవ చేసి, ఆరంగం చరిత్ర పుటల్లో చిరస్మరణీయులుగా నిలిచిపోతారు. అటువంటి వారిలో శ్రీ వెంకయ్యగారొకరు. 1971లో మంత్రిపాలెంలో జరిపించిన ఎడ్ల పోటీల్లో జాక్‌పాట్ పోటీని కనిపెట్టి బంగారు పతకాన్ని, 1986లో విజయవాడలో ఎడ్ల పోటీలను జరిపించి, ఛాంపియన్ ఆఫ ఛాంపియన్ పోటీని ప్రవేశపెట్టి, బంగారు నందిని బహూకరించిన ఘనత శ్రీ వెంకయ్య గారికే దక్కింది.

1984లో విజయవాడలో ఎడ్ల పోటీలు నిర్వహించాలనే ఉత్సాహం కలిగింది– శ్రీ వెంకయ్య గారికి, నాకూ. మేమిద్దరం కలిసి పోలీసు అధికారికి ఆర్డరు యిప్పించమని పిటిషను పెట్టాము. అందుకు పోలీసు అధికారి అంగీకరించలేదు. మచిలీపట్నం మీటింగులో ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావు గారిని కలుసుకుని మా ఆశయాన్ని విన్నవించుకున్నాము. ఆయన అసెంబ్లీకి నివేదికను పెట్టమని చెప్పారు. వెంటనే ఎడ్ల పోటీలకు పర్మిషను ఇప్పించ మని నివేదికను అసెంబ్లీకి పెట్టాం. ఆ రెండు సంవత్సరాలు మేమిద్దరమూ కృషి చేశాము. మిత్రుడు శ్రీ చలసాని కృష్ణారావు ప్రభృతులు కృషితో ఎడ్ల పోటీలు నిర్వహించటానికి రాష్ట్ర ముఖ్యమంత్రిగారి పర్మిషను పొంది, 1986లో ఎడ్ల పోటీలు విజయవాడలో జరిపించిన ఘనత శ్రీ వెంకయ్య గారికే దక్కింది.

కృష్ణాజిల్లా, మొవ్వ మండలంలో ఉన్న మంత్రిపాలెం గ్రామ చౌదరి శ్రీ చిగులూరి వెంకట్రామయ్య – లలితాంబ పుణ్య దంపతులకు 1943లో వెలుగు రేఖగా జన్మించారు శ్రీ వెంకయ్యగారు.

1971, 73 సంవత్సరములలో స్వగ్రామంలో రాష్ట్రస్థాయి ఎడ్ల పరుగు, లాగుడు, అందాల పోటీలు నిర్వహించి పోటీ విజేతలకు ఘనమయిన బహుమతులు యిచ్చి ఖ్యాతి పొందారు వెంకయ్యగారు.

1974, 86 లోనూ విజయవాడలో ఎడ్ల పోటీలు నిర్వహించి, ఎడ్ల పోటీ నిర్వహణలో శ్రీ వెంకయ్యగారు ఘనులని పించుకున్నారు. 1986లో విజయవాడలో జరిగిన శ్రీ కాకాని వెంకటరత్నం. మెమోరియల్ రాష్ట్ర ఎడ్ల లాగుడు పోటీలు భారి ఎత్తున జరిపించి, పోటీలను వీడియో కేసెట్టు తీయించడం, మరియూ ఎడ్లపోటీ విజేతలను, రిఫరీలను, రచయితగా నన్నూ ఘనంగా సన్మానం – హోం శాఖా మంత్రి శ్రీ వసంత నాగేశ్వరరావుగారి చేత



శ్రీ చిగులూరి వెంకయ్య

చేయించిన ఘనత శ్రీ వెంకయ్య గారికే దక్కింది. ఆ పోటీల సావనీరును ప్రచురించి అశేష ప్రజానీకం యొక్క ఆదరాభిమానాలు పొందిన శ్రీ వెంకయ్య గారు తన చేతి సొమ్ము కూడా కొంత వరకూ ఖర్చు చేయడం కమిటీ వారికే బాధాకరంగా తోచింది.

–బొజ్జా సత్యనారాయణ

## మానవత్వమా! మన్నించు!

చేయదలచారా ఈ ఆటవికులు? అతని మెదడు చురుకుగా వేగంగా పని చేయసాగింది.

"ఆఁ!" అంటూ అటు వచ్చాడు ఒకతను. బలిష్ఠంగా ఉన్నాడు. మోములో మొరటుదన్నం కొట్టవచ్చినట్లుగా కనపడుతోంది.

"మావా! ఆ రోజు చెప్పానుగా! పట్నంలో ఆ రాత్రి ఒక్కదాన్నయిపోతే నన్ను ఆళ్ల ఇంటికి తీసిక పోయుండని ఆయనే గియన."

"ఓర్నీ! అట్టనా! సెప్పవేందే మరి."

"దండాలు దొరా!"

"ఓస్! సెప్పనీ ఇంకా...."

శేఖర్ ఊపిరి బిగబట్టి వింటున్నాడు, ఆమె నోటి నుండి ఏమి వెలువడుతుందో అని.

"ఇంకేంటే?"

"ఆళ్ల ఇంటికి తీసికెళ్లి బువ్వ పెట్టింద్రు! పడుకో అని సాప ఇచ్చింద్రు."

ఆమె మోములో ఎలాంటి భావాలు లేవు. నిర్మలంగా ఉందామోము. బయట ఎవరో పిలవడంతో అతడు వెళ్లిపోయాడు.

"ఆ రోజు నేను చేసిన తప్పిదానికి నన్ను క్షమించు. తీరని ద్రోహం చేసిన నన్ను ఎందుకు రక్షించావు?" అంటూ ఆమె వైపు చూశాడు.

"దాని దేముంది దొరా! తోటి మనిషి కట్టాల్లో ఉంటే సాయం సేసినం" ఆమె మోములో గంభీరం ప్రశాంతత చోటు చేసికొన్నాయి.

"ఆఁ! అన్నట్లు నీ పేరేంటి?"

"ఆ రోజున అక్కర్లేని పేరు ఇయ్యాలెందుకు దొరా! ఆ రోజున మీ ఇంట్లో నీ ముందున్న మనిసి ఈ మనిసి ఒకటేకదా!"

కొరడాతో కొట్టినట్లయింది శేఖర్‌కి.

"జరిగిపోయిన ఇసయాల గురించి దేనికిగాని వంట్లో ఎలాగుంది దొరా! ఆ పాడు ఎలుగు మీ మీదనే పడాల్నా? అట్ట పడుకోండి. మావను పాలకు తోలుత."

శేఖర్ మంచం మీద నుండి లేచాడు. "ఇక నేను వెళ్తాను." అంటూ బయిటికి వచ్చాడు.

"ఈ నొప్పులతో ఎల్లగలరా దొరా? ఈ రోజుకి ఉండి పోండి."

ఆమె మానవత్వం ముందు అతని చదువు, సంస్కారం సిగ్గుతో తలవంచుకుంది. అతని మనసు ఆవేదనతో ఏదేదో ఆమెకు చెప్పాలని ఆరాటపడుతోంది కాని నోరు పెగలడం లేదు.

"ఏం ఫర్వాలేదు. వెళ్లగలను." అంటూ దగ్గర్లోనే ఉన్న తన వాహనాన్ని సమీపించాడు శేఖర్. అప్రయత్నంగా అతని కనుకొనుకుల్లోకి నీళ్లు జారాయి. చేతులు జోడించి, "ఇక వెళ్లొస్తాను." అంటూ ఆమె దగ్గర సెలవు తీసికొన్నాడు అతను.

పెద్ద శబ్దం చేసికొంటూ వాహనం ముందుకు కదులుతూ ఉంటే ఆ వైపే చూస్తుండి పోయింది ఆమె. □

# ఇప్పుడు సౌందర్య పరిచర్యలో ఆనందం...
# చందనము, పసుపుతో అనుదినం!




# సంతూర్
## చందనము, పసుపు చేరిన సబ్బు.

సుఖానుభూతినిచ్చే సుగంధం గల చందనం. సౌందర్య పరిచర్య చేసే శుభ్రకారకమైన పసుపు. సాంప్రదాయిక సౌందర్య పరిచర్య గురించిన ఈ రహస్యం ఇప్పుడు ఒక కొత్త సౌమ్యమైన సబ్బుకు పరిమితం.

సంతూర్. నిన్నటి సౌందర్య రహస్యం నేటి స్త్రీకి స్వంతం.

100 గ్రా. గరిష్ఠ ధర: రు. 3.21 స్థానిక పన్నులు అదనం.

WIPRO LIMITED
Closer to the consumer

**మీ సహజ సౌందర్య పరిచర్య.**

everest/86/WIL/309·tl

# సీరియల్: నిశ్శబ్ద సంగీతం

## బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

రెండు వివాహాలకీ ముహూర్తాలు నిశ్చయమయాయ్. శుభ లేఖలు ప్రింటింగ్‌కివ్వాలి.

రఘు తండ్రి ధర్మరాజుగారికి అన్నదమ్ములులేరు! ఆయనే ఏకైక సంతానం! పినతండ్రిగానీ పెదతండ్రిగానీ వుంటే వారి పేరున శుభలేఖలు అచ్చువేయించొచ్చు! వివాహానికి ఎవరో ఒకరు పెద్దగా వ్యవహరించాలి. తండ్రిపోతే, మేనమామని ఆశ్రయించమని సామెత వుంది. మేనమామను ఆశ్రయించాల్సిన కర్మ తనకులేదు. తాను సర్వస్వతంత్రుడు. బాధ్యతల నెరిగినవాడు!

మేనమామకదా! చెల్లెలి మొహంచూసైనా పెళ్ళికి పెద్దరికం వహించడానికి యిచ్ఛాపూర్వకంగా ముందుకు రావల్సింది! పెళ్ళిళ్ళ విషయంలో ఆయన ఏ విధమైన ఆశక్తి కనబర్చలేదు. అంటీ అంటనట్టుగా మసలుతున్నాడు. అటువంటి పరిస్థితుల్లో మావయ్య పేరున శుభలేఖలు అచ్చువేయించడం తనికిష్టంలేదు! తన పెళ్ళికి ఆహ్వానించుకొంటూ తన పేరున వేయించుకోలేడు! అది పద్ధతిగాదు!సందిగ్ధావస్థలో పడ్డాడు రఘు.

"బంధుత్వాలు – రాకపోకలూ ఎలావున్నా వాడు నీకు మేనమామ!మావయ్య పేరునే అచ్చువేయించుబాబూ!" అని తల్లి మరోసారనడంతో -

"అలాగేనమ్మా!" అనకతప్పలేదు రఘుకి.

రెండు పెళ్ళిళ్ళూ ఒకేరోజున ఒకే పందిట్లో చేయడానికి యేర్పాట్లు జరిగాయ్.. పెళ్ళి యింక నాలుగు రోజులుందనగా వచ్చిన అన్నయ్యతో నిష్ఠూరంగా మాట్లాడింది అనసూయమ్మ.

"దగ్గరుండి అన్ని యేర్పాట్లు చూడాల్సింది! ఏవీ సంబంధం లేనట్టుగా తిరుగుతున్నావ్! మీ బావగారే కనుక బతికివుంటే నిన్నంతలా బతిమాలాల్సిన అవసరం వుండేది కాదన్నయ్యా! ఫోనుమీద ఫోనుచేస్తే యిప్పుడొచ్చావ్! రఘుబాబు ఒక్కడూ ఎన్నని చూసుకోగలడు చెప్పు! ఎప్పుడైన చూసాడా చేసాడా?"

మొహానికి పట్టిన చెమటను ఉత్తరీయంతో తుడుచుకొన్నారు రామనాధంగారు.

"ఎప్పటికప్పుడు రావాలనే అనుకొంటున్నానమ్మా! వరంగల్‌దగ్గర బ్రిడ్జి కట్టిస్తున్నా! లక్షలమీద పని! కూలీల మధ్య తగవులొచ్చి వారం రోజులు పని ఆగిపోయింది. రోజూ వుదయమే వెళ్ళి అర్ధరాత్రప్పుడు తిరిగి వస్తున్నా! మహూర్తం దగ్గరపడ్తోందని నాకుమాత్రం తెలీదా! అందుకొచ్చా! రఘుబాబేడీ?" అడిగాడు.

"రమకి గాజులూ గొలుసూ చేయిస్తున్నాడు! తయారయ్యాయని షావుకారు ఫోన్ చేసాడు. వస్తువులు తేడానికి వెళ్ళాడు!"

"మీ ఒదినకు ఆరోగ్యం బాగులేదు! డాక్టరుకి చూపించి ఆమెను యింటికి పంపి నేనిలావచ్చాను!" అన్నారు పొడిగా.

"ఏమిటో అన్నయ్యా! నా ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే వుంది! ఓసారి వచ్చి చూద్దామన్నా యింట్లో బోలెడు పనులు! ఈ పెళ్ళిళ్ళు అయేవరకూ బెంగ! ఒదినకు అనారోగ్యం! నీకు తీరుబడి వుండదు!"

బెంగపడ్డారు అనసూయమ్మ.

అంతలో కొన్ని శుభలేఖలూ, లిస్టూ పట్టుకొనివచ్చింది రమ.

"ఇదిగో మావయ్యా శుభలేఖలు! మాకు తెల్సినంతవరకూ బంధువులందరికీ పోస్టుచేశాం! వారిపేర్లు ఈ లిస్టులో వున్నాయ్! మిగిలిన వారందరికీ నీవే పంపాలి!" అంటూ కొన్ని శుభలేఖల్నీ, లిస్టునీ అందించింది రమ.

ఒక శుభలేఖ విప్పి చదివారు రామనాధం గారు. ఉష పేరు వుండాల్సిన చోట రేణు పేరుని చూసాక ఆయన మనసు శకావికల మైంది. మౌనంగా శుభలేఖలను పక్కన పెట్టారు. తన కూతుర్ని రఘుకిచ్చి వివాహం చేస్తారని బంధువులూ స్నేహితులూ అంతా అనుకొంటున్నారు. రఘుకి మరో కన్యతో వివాహం అనీ, ఆ శుభకార్యానికి తానే పెద్ద అని అందరికీ ఆహ్వానాలు పంపించాల్సి వస్తోంది. తన కుమార్తె వివాహం ఒక సమస్యగా మిగిలి పోయింది. కళ్ళు చెమర్చటంతో తలెత్తకుండా లిస్టు చూస్తున్నట్టుగా నటిస్తూ వుండి పోయారు.

"అత్తయ్యనీ, ఉషనీ రేపే పంపించు మావయ్యా!" అన్న రమ అభ్యర్ధనకి తలెత్తారు.

"మీ అత్తయ్యకి ఒంట్లో బాగుండ లేదమ్మా! అమ్మకి సపర్యలు చేస్తూ వుంది ఉష!" అన్నారు అతిహీన స్వరంలో.

తల్లీ కూతుళ్ళు ఏవీ అనక పోవడంతో మళ్ళీ తనే అన్నారు.

"ఏమాత్రం తగ్గినా తప్పకుండా పంపిస్తా! మీ పెళ్ళిళ్ళు జరిపించాల్సిన బాధ్యత మాదే కదా!"

"ముందుగా పంపకపోతే మేము కూడా ఉష పెళ్ళికి పెళ్ళినాటికే వస్తాం!" అన్న కూతుర్ని మందలించింది తల్లి.

"ఏవిటే ఆ మాటలు! అత్తయ్యకి ఒంట్లో బాగులేదని చెబుతున్నాడు కదా! దాని మాటలకేం అన్నయ్యా! ఏమాత్రం సుళువుగా వున్నా వెంటనే పంపు!" అన్నయ్యకి కోపం రాకుండా సర్ది చెప్పారు అనసూయమ్మ.

"తప్పకుండా పంపుతానమ్మా!" అంటూ లేచారు రామనాధం గారు.

* * * *

రమా రేణూ లిద్దరూ షాపింగ్ కోసం బయలు దేరారు. లక్డీకాపుల్ స్టాప్ దగ్గర రామనాధంగారి నౌకరు రంగయ్య కన్పించాడు.

"ఏం రంగయ్యా బావున్నావా?" పలకరించింది రమ. రమని చూసి సంబరపడ్డాడు రంగయ్య.

"బావున్నానమ్మా! తమర్ని చూసి సానాకాల మైంది! మావయ్య గారింటికి రావడమే మానేసారు!"

**జరిగిన కథ-7:** రామనాధంగారు తన కూతురి ప్రేమ వ్యవహారం చెల్లెలితో చెపుతారు. అనసూయమ్మ కృంగిపోతుంది. రమ రేణుని తన అన్న పెళ్ళి చేసుకొంటే బాగుంటుందని తల్లికి సలహా ఇస్తుంది. రమ పెళ్ళిచూపులు అయ్యాయి. తల్లికి తెలీకుండా చంద్రశేఖర్‌కి నగలు ఇచ్చింది ఉష. అవి అతను వారం రోజులు అయినా తిరిగి తెచ్చి ఇవ్వలేదు. చంద్రశేఖర్ మోసగాడని తెలుసుకొని రామనాధం దంపతులు కుప్పకూలిపోయారు. తన కుమారుడు రఘుబాబుని వివాహం చేసుకోమని రేణుని అడుగుతారు అనసూయమ్మ. తన తల్లినీ, మామయ్యనీ ఒకసారి అడగాలని అంటుంది రేణు.

"మానేయలేదు రంగన్నా! అవసరం పడలేదు! రాలేదు! అంతే!"

"అదేటమ్మగారూ! ఇదివరకు అవసరం వుంటేనే వచ్చేవోరా! బజారు కెళ్ళినప్పుడూ సినీమాల కెళ్ళినప్పుడూ వచ్చేవోరు కదా! తమకి ఆరి మీద కోపం వచ్చినట్టుంది!" ఆరోపించారు రంగయ్య.

"ఏ కోపమూ లేదు! యింద ఈ రెండు రూపాయలూ తీసుకొని టిఫిన్ చేసి పో!" అంటూ రెండు రూపాయల కాగితాన్ని అందించబోయి వాడి చేతుల్లో వున్న టాబ్లెట్సుని, మందు సీసాని చూసింది. వాటిని తన చేతిలోకి తీసుకొని పరీక్షగా చూసింది.

"ఈ మందు లెవరికీ?" అడిగింది ఆత్రంగా.

"ఉషమ్మగారికి నిన్నటి నుంచీ జొరం! అయ్యగారు నిన్న బెజవాడెళ్ళి యింకా తిరిగి రాలేదు! అమ్మగారికి కూడా కులాసాగా లేదమ్మా! ఆరి పరిస్థితి చూస్తే నాకే బెంగగా వుంది!" సానుభూతిగా చెప్పాడు రంగయ్య.

"ఏం? ఏమైంది?" కంగారుగా అడిగింది రమ.

వారి మాటలు వింటూ మౌనంగా వుండి పోయింది రేణు.

రహస్యం చెబుతున్నవానిలా రమకు దగ్గరగా అడుగు వేసి నెమ్మదిగా అన్నాడు రంగయ్య.

"అసలు వారికి ఏ జబ్బూ లేదమ్మా!"

రమా రేణూ యిద్దరూ ఆశ్చర్యపోయారు. కుతూహలం ఎక్కువైంది!

"మరి మందు లెందుకు?" అడిగింది రమ.

"ఉషమ్మగారికి సమ్మందం తప్పిపోయిందిట! ఆ బెంగతో యింటిల్లిపాది మంచం పట్టారు! అంతేగానీ ఏ జబ్బూ లేదు! మనోవ్యాధికి మందులేం పని జేస్తాయ్ చెప్పండి!"

వాడి మాటలకు ఆ యిద్దరూ అదిరిపడ్డారు.

"ఛ! ఎవరు చెప్పారు?" నమ్మలేదు రమ.

"ఎవరూ సెప్పలేదమ్మగోరూ! ఆరనుకొంటూంటే యిన్నా! పెద్దింటోర్ని ఎలా ఆ సంగ్గలం సెప్పండి! అడిగితే మాత్రం సెబుతారా!"

"అయ్యోపాపం!" అనుకొంది రేణు! ఆమె కనుల ముందు ఉష లీలగా కదలాడింది.

షాక్ తింది రమ. ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"ఆ దెవడో మినిస్టరుగారి బామ్మర్దినని సెప్పి మోసం చేసాడు! ఆడి మాయ మాటలు నమ్మింది ఉషమ్మ! అమ్మగారి నగలన్నీ పట్టుకు పారిపోయాడు! ఆ బెంగతో మంచం పట్టారు! నేను సెప్పానని ఎవరితోను అనకండి! కొన్నాళ్ళుబోతే తమర్కి తెలుస్తాది!" అంటూ జారుకొన్నాడు రంగయ్య.

కూతురు చెప్పిన మాటలు విని నిర్ఘాంతపోయారు అనసూయమ్మ. చాలా విచారించారు.

* * * *

మర్నాడు రాత్రి పెళ్లనగా పెళ్లాన్నీ, కూతుర్నీ చెల్లెలింటికి దిగబెట్టి ఆదిలాబాద్‌లో అర్జంటు పని వుందని సాయంత్రానికి వస్తానని వెళ్లారు రామనాథంగారు. వారిని చూసాక కొండంత ధైర్యం వచ్చింది అనసూయమ్మకి. ఏ నిష్ఠూరోక్తులూ లేకుండా వారిని ఆహ్వానించారు. అప్పటికి రెండు రోజులు ముందే రేణు తల్లి సత్యవతీ, తమ్ముడు శంకరం, మేనమామా అతని భార్యా పిల్లలూ వచ్చారు. బంధువులతో యిల్లు కళకళలాడుతుంది. పిల్లలు కేరింతాలు కొట్టుకొంటూ ఆడుకొంటున్నారు.

ఉషా, రమా, రేణూ మరి ముగ్గురూ కల్సి కాలక్షేపం కోసం వైకుంఠపాళీ ఆట మొదలు పెట్టారు. ఉష గబగబా నిచ్చెన లెక్కింది. తక్కిన వారు పడుతూ లేస్తూ మూడో వరుస దాటలేక పోతున్నారు. ఉష పావుని పెద్ద పాము మింగింది. కొందరు పకాల్న నవ్వారు. అయితే రేణూ రమా మాత్రం నవ్వు నాపుకొన్నారు. ఉడుకుమోతు మొహంతో అందరి వైపూ చూసింది ఉష. రమా రేణూ లిద్దరూ నవ్వు మొహాల్తో ఉండడం గమనించింది. ఉక్రోషం ఎక్కువైంది.

దగ్గరలోనే వాలు కుర్చీలో కూర్చొని వున్న ఉష తల్లి పార్వతమ్మ పరిస్థితిని గమనించి వారిని మందలించింది.

"ఆటాడు కొంటున్నారా? వేళాకోళా లాడుకొంటున్నారా?"

చివాల్న లేచి నిలబడింది ఉష. వైకుంఠపాళీ కాగితాన్ని చర్రున లాగింది. పావులన్నీ ఎగిరి పోయాయ్! రమా రేణు లిద్దరు కిమ్మనకుండా అక్కడ నుంచి జారుకొన్నారు. గుడ్ల నిండా నీరు కక్కుకొంటూ ఓ మూల కూర్చొంది ఉష అవమాన భారాన్ని భరించలేక. పెళ్ళి పీటల మీద రఘు పక్కన ఉషను వూహించుకొంది పార్వతమ్మ. మనసు వికలమైంది. ఉష పుట్టినప్పుడే రఘుకి పెళ్ళాం పుట్టిందని అంతా అనుకొన్నారు. కాని ఏమిటీ విపరీతం? తమ చేతుల్తోనే రఘుకి మరో కన్యతో వివాహం జరిపించడమా? కడుపు చించుకొంటే కాళ్లమీద పడుతుంది. ఆ దొంగ వెధవని నమ్మి జీవితాన్ని పాడుచేసుకొంది కూతురు!" ఉష పెళ్ళెప్పుడు?" అని అంతా అడుగుతూంటే సమాధానం చెప్పలేక



# నిశ్శబ్ద సంగీతం

సతమత మవ్వాల్సి వస్తోంది" త్వరలో నే!" అని చెప్పుకొంటోంది.

ఇక ఉష –

తనలో ఏ కోశానా చలాకీతనం లేదు! పరాకూ చిరాకూ ఎక్కువయ్యాయ్. తెచ్చి పెట్టుకొన్న హుషారుతో ఎంతసేపని తిరగ్గలదు! ప్రపంచం అంటే ఏమిటో తెలీక ఆ వేషగాని మోసంలో పడింది. చేజేతులా జీవితాన్ని నాశనం చేసుకొంది. అతను ఆరాటపడినా తాను శీలాన్ని అర్పించలేదు! తాను అదృష్టవంతురాలే కొంతవరకూ! ఏకాంతం కావాలని మనసు కోరుకొంటుంది. రేణుఎంత అదృష్టవంతురాలు! తన స్థానం ఆమెకు దక్కింది. తనది స్వయంకృతాపరాధం! ఎవరినీ నిందించి ప్రయోజనం లేదు!

అన్నట్టుగానే ఆ రాత్రికి ఆదిలాబాదు నుంచి తిరిగొచ్చారు రామనాధం గారు. పెళ్ళికి జరిగిన యేర్పాట్లన్నింటినీ పర్యవేక్షించారు. ఆఖరి సమయంలోనైనా అన్నయ్య వచ్చి శ్రద్ధ వహిస్తున్నందుకు సంతోష పడ్డారు అనసూయమ్మ. మర్నాడు తెల్లవారు ఝామున మూడు గంటలకి ముహూర్తం. ముహూర్తానికి మూడు గంటలు వ్యవధి వుందనగా పార్వతమ్మకి బి.పి. పెరిగి పోయింది. కారుమీద నర్సింగ్‌హోంకి తీసుకెళ్ళారు రామనాధం గారు. ఆమెకు సపర్యలు చేయడానికి కూతురు ఉష కూడా కారులో వెళ్ళింది.

రామనాధంగారు తిరిగి వచ్చేసరికి మాంగళ్యధారణం అయిపోయింది. దంపతులపై అక్షింతలు జల్లి మనసారా దీవించారు.

పెళ్ళికి వచ్చిన బంధువులంతా వెళ్లారు. రేణు తల్లీ, తమ్ముడూ కూడా ప్రయాణానికి సిద్ధమయ్యారు. వారిని కొన్ని రోజులుండమని అర్థించారు అనసూయమ్మ.

"మా రేణుకి అత్తగారూ తల్లీ మీరేనండి ఒదినగారూ! ఆమె గురించి నాకు బెంగ లేదు! అది చాలా అదృష్టవంతురాలు! చేతి కందిన కొడుకు పోయాడు! కూతురి పెళ్ళి చేయలేమన్న బెంగతో నే వీరి నాన్నగారు పోయారు! బంగారంలాంటి సంబంధం దొరికింది. వారి ఆత్మ సంతోషిస్తుంది!" సంబరపడింది సత్యవతి.

"కూతురు కాపరం చూద్దురుగాని! కనీసం పది రోజులైనా వుండి వెళితే మా కానందంగా వుంటుంది!" అన్నారు అనసూయమ్మ.

శంకరం రాజమండ్రిలో బియ్యీడి ట్రైనింగవుతున్నాడు. వంట చేసుకొని కాలేజికి వెళ్ళాలి! చాలా యిబ్బంది పడ్తాడు! వాడు ఉద్యోగస్తుడై ఓ యింటివాడైతే నాకే బెంగా వుండదు! అప్పుడు నా యిష్టం! అంతవరకూ నన్ను వదలండి ఒదినా!" ప్రాధేయపడింది సత్యవతి.

"సరే మీ యిష్టం! దూరంగా వున్నామని అశ్రద్ధ చేయకుండా వీలు చూసుకొని తరచుగా వస్తూండమని మా కోరిక!"

వారి ఆప్యాయతకీ, అనురాగానికీ మరోసారి ముగ్ధురాలైంది సత్యవతి. రేణూ - రఘూ, రమా - శశిధర్ నలుగురూ స్టేషన్కు వెళ్ళి వారిని ట్రైనెక్కించి తిరిగి యిల్లు చేరుకొన్నారు.

* * * * * * * * *

కూతురూ, అల్లుడూ, కొడుకూ - కోడలూ డైనింగ్ టేబిల్‌కి అటూ యిటూ ఎదురెదురుగా కూర్చున్నారు. వారినిచూసి మురిసిపోయారు అనసూయమ్మ. వారికి దగ్గరగా కుర్చీ వేసుకొని కూర్చున్నారు వేడుగ్గాచూడాలని.

"నువ్ కూడా రామ్మా! అందరవూ కల్సి భోజనం చేద్దాం! వెంకాయమ్మగారున్నారుగా వడ్డించడానికి!" తల్లిని పిలిచింది రమ.

"అవునండీ! మీరు కూడా కూర్చోండి! టేబిలుమీద అన్ని ఉన్నాయ్! ఏమైనా కావలిస్తే తెస్తా!" అంది వెంకాయమ్మ.

అయినా ఆమె యిచ్చగించలేదు.

"తర్వాత నేనూ, వెంకాయమ్మా తింటాం!" అని తల్లి అనడంతో ఊరుకొంది రమ.

చలోక్తులతోనూ, చతుర సంభాషణల్తోనూ భోజనాలవుతున్నాయ్

అంతా హాయిగా నవ్వుకొంటున్నారు. అనసూయమ్మగారి ఆనందానికి హద్దుల్లేవు. భర్త జ్ఞప్తికి రాగానే మనసు కలుక్కుమంది. "ఆయన వుంటే ఎంత ఆనందించేవారో!" అనుకొన్నారు.

"అన్నయ్యా! నువ్ మరో పది రోజులు శలవు పొడిగించాలి!" అంది రమ వున్నట్టుండి.

"ఏం? ఎందుకు?" అడిగాడు రఘు.

అంతా రమ వైపు చూసారు. రేణు కూడా.

"మీరు హనీమూన్ ట్రిప్ వేయాలి! ముందుగా తిరుపతి - ఆ తర్వాత బెంగుళూరు, మైసూరు వగైరా!"

"ఈ ప్రపోజల్ నీదా? లేక రేణు ప్రతిపాదనా?" భార్య వైపు కొంటెగా చూస్తూ అడిగాడు రఘు.

సమాధానం చెప్పకుండా భర్త వైపు చూస్తూ వుండిపోయింది రమ.

భర్త తన చెల్లెల్ని అడిగినా దానికి సమాధానం చెప్పాల్సిన పూచీ, వివరణ యివ్వాల్సిన బాధ్యతా తనదేనని గ్రహించింది రేణు. అందుకు కారణం భర్త చేసిన ఆరోపణే! నిజానికి హనీమూన్ విషయం అంతవరకూ తనకు తెలియదు. భర్త మొహంలోకి చూస్తూ అంది రేణు.

"మీ చెల్లెలికి హనీమూన్ వెళ్లాలన్న ఉబలాటం ఎక్కువగా వుంది కాబోలు! అందుకే ముందు మనల్ని ప్రయాణం చేయిస్తోంది! వాళ్ళు కూడా వెళ్ళొచ్చుని!"

అని రమ వైపు తిరిగి,

"నీకు వెళ్లాలని వుంటే వెళ్ళండి రమా! అందుకోసం మమ్మల్ని ముందుకు తోయడం ఎందుకు? అన్నయ్యగారికి శలవు ఎలాగూ వుంది!" అంది.

అనసూయమ్మ కలుగజేసుకొన్నారు.

"అందరూ వెళ్ళి దైవ దర్శనం చేసుకొని రండి!"

"అంతా ఒకేసారి వెళ్తే యిల్లు బోసి పోతుందమ్మగారూ! ఒక్కో జంటా వెళ్ళి వస్తే బావుంటుంది!"

తన అభిప్రాయాన్ని తెలిపింది వెంకాయమ్మ.

"అవును రమా! వెంకాయమ్మగారు చెప్పింది బావుంది! ముందు మీరిద్దరూ వెళ్ళి రండి! అంది రేణు.

"పెద్దవారు! ముందు మీరే వెళ్ళండి!" అంగీకరించలేదు రమ.

"అన్నయ్యా ఒదినా తర్వాత వెళ్తారు! ముందు మీరు వెళ్ళి రండి. అన్నయ్య కిక్కడ యింకా కొన్ని పనులున్నాయ్!" సర్ది చెప్పారు అనసూయమ్మ.

ఒక జంట తర్వాత రెండో జంట హనీమూన్‌కి వెళ్ళింది.

* * * * * * * * * *

సంవత్సరం గడిచాక కొడుకుని కని అత్తగారి కోరికను తీర్చింది రేణు. మరో ఆరు నెలలు గడిచాయ్. ఆరోజు రేణు పుట్టిన రోజు. ఉదయాన్నే లేచి తలకు స్నానం చేసింది. భర్త కొన్న చీర కట్టుకొంది. అత్తగారి పాదాలకి నమస్కరించింది.

"పసుపు కుంకుమతో భర్త అనురాగంతో వంద సంవత్సరాలు జీవించు తల్లీ!" మనసారా దీవించి కోడల్ని లేవనెత్తారు అనసూయమ్మ. కోడలు మొహం చూసి,

"అదేవిటమ్మా! నగలు పెట్టుకోలేదు! వట్టి పుస్తెలతాడుతో వున్నావ్?" ఆశ్చర్యపోయారు.

"నాకు మీ అబ్బాయిగారే పెద్దనగ అత్తయ్యగారూ! క్రితం జన్మలో పుణ్యం చేసుకొని వారిని భర్తగా పొందే భాగ్యాన్ని సంపాదించుకొన్నా!" అంది.

"సరి సరి! మాటల్తో నానోరు మూయిస్తావ్! వెళ్ళి నగలుపెట్టుకొనిరా!" ఆదేశించారు అత్తగారు.

"సాయంత్రం పెట్టుకొంటా నత్తయ్యగారూ! ఈ వేళ మీ అబ్బాయిగారు పెందరాళే వస్తానన్నారు!" అంది.

"వాడు వస్తానన్నాడా? నాకు నమ్మకంలేదు!

ఆఫీసుకెళ్తే అన్నీ మర్చిపోతాడు! సాయంత్రం నాలుగ్గంటలకి ఓసారి ఫోనుచేసి జ్ఞాపకం చెయ్యి!"

'అత్తగారి మాటలకి నవ్వుకొంటూ మేడమీదికి భర్త దగ్గరికి వెళ్ళింది రేణు. గదిలో అడుగుపెట్టగానే తలుపుచాటున ఉన్న రఘు ఆమెను వాటెసుకొన్నాడు. విడిపించుకోవాలని ప్రయత్నం చెయకుండా ఆ కౌగలిలో ఉక్కిరి బిక్కిరైంది రేణు! కొంతసేపు తన్మయత్వం పొంది తేరుకుంది.

"అత్తగారు!" అంది.

భర్త పట్టువదలగానే దూరంగా పోయి నిలబడి కిలకిలా నవ్వింది.

"వేగంగా తెమలండి! బిర్లామందిర్‌కి వెళ్లాలి! ఆలస్యం అయితే భోజనం చేయకుండానే ఆఫీసుకి పోతానంటారు!" భర్తను తొందర చేసింది.

వెంకటేశ్వరుని దర్శనం చేసుకొని ఆలయ ప్రాంగణంలో ఓమూల కూర్చున్నారు భార్యాభర్తలిద్దరూ.

"వెంకటేశ్వరుని ఏవరం కోరుకొన్నావ్?" అడిగాడు రఘు.

"రెండు వరాలు యిప్పించమని అర్థించా!"

"ఏవిటవి?"

"ఒకటి – జన్మజన్మలకీ మీరే నాకు భర్తగా లభించేలా చేయమని! రెండు – ఒక్క క్షణం కూడా మనకు ఎడబాటు లేకుండా చూడమని"

భగవంతు డెప్పుడూ రెండు వరాలు ప్రసాదించడు ఒక్కటే యిస్తానంటాడు! ఒక్కటే కోరుకో!" అన్నాడు.




"మొదటి వరం తీరిస్తే చాలు! రెండో వరం ఈపతి దేవుడు తీర్చగలడు!" అంది అనురాగపూరిత నయనాల్తో భర్త కళ్ళలోకి చూస్తూ.

"ఎన్ని కష్టనష్టాలొచ్చినా నిన్ను ఎడబాసి వుండలేను రేణూ! నా కోరిక అదే! అలాగే భగవంతుణ్ణి వేడుకొన్నా!"

ఆనందపారవశ్యంలో భర్త ఎదపై ఒరిగిపోయింది రేణు. కొంత సేపటికి తేరుకొని

"ఏమండి!" అంది.

"చెప్పురేణూ!"

"మన బాబుకి ఆమధ్య జ్వరం వచ్చింది కదా!"

"అవును!"

"అప్పుడు మీ అనుమతి లేకుండా మీతో సంప్రదించకుండా ఒక మొక్కు మొక్కుకొన్నానండి!"

"ఏవని? చెప్పు రేణూ!"

"మన బాబుని తిరుపతి తీసుకొని వెళ్లాలి! వాడి తలనీలాలు అర్పిస్తానని మొక్కుకొన్నా!"

"అలాగే! తప్పకుండా! మనం యిద్దరవూ వెళ్ళి వాడి తలనీలాలు అర్పిద్దాం!" అన్నాడు.

(ఇంకా వుంది)



ఎడారిలో ఒయాసిస్సు, కారు చీకటిలో కాంతిరేఖ మొదలైన పడికట్టురాళ్లను వాడేంత అగత్యం లేకపోయినా కాంతారావుకు అలాంటిదే కనిపించింది ఆనాటి దినపత్రికలో బాక్సుకట్టి మరీ వేసేరు ఆ ప్రకటన.

"మద్యపాన వ్యసనం నుండి విముక్తులు కావాలను కుంటున్నారా..... ?" ఇదీ శీర్షిక. ఆ ప్రకటన సారాంశమేంటంటే– ఇటీవలే విదేశాలను ఒంటికాలితో చుట్టివచ్చి అదేనగరంలో ఓ స్టార్‌హోటల్లో బస చేసిన ప్రముఖ హిప్నటిస్టు వెంకటస్వామిగారు హిప్నాటిజం ద్వారా తాగుడు వ్యసనం నుండి తాగుబోతుల్ని రక్షించే తరుణోపాయం కనుక్కున్నారు(ట). ఆయనను సంప్రదించి యిప్పటికే అనేకమంది రోగులు (తాగుడు రోగం అని విజ్ఞుల, అనుభవజ్ఞుల అభిప్రాయం) స్వస్థత పొందారు(ట). వాళ్ల ఫొటోలతో సహా సాక్ష్యం చెప్పిస్తూ మరి రూపొందించేరు ప్రకటన. తాగుబోతు వ్యసన తీవ్రత, స్వభావాన్ని (ఉత్తరోత్తరా ఆర్థిక స్థితి గతుల్ని) విచారించేక ఫీజు నిర్ణయిస్తారు(ట).

కాంతారావు ఆ ప్రకటన చదివీ చదవగానే ఆలోచనలో పడ్డాడు. ఆ ఆలోచనలన్ని తన మిత్రుడు బలరాం గురించే. బలరాం వంటివాడు తాగుడుకు బానిసయ్యేడంటే అది ఆలోచించాల్సిన విషయమే అంటారు అతన్ని బాగా ఎరిగున్న కొందరు తాగిన వాళ్ల మధ్య వుండడంగానీ, బార్లు, సారా అంగళ్లు మొదలైన ప్రదేశాలలో నిలబడడం గానీ అతను సహించేవాడు కాదు. సాధ్యమున్నంత వరకు వాటికి దూరంగా సంచరిస్తూండేవాడు.

ఒకరోజు స్నేహితుడి పెళ్లి విందుకు హాజరయ్యేడు. భోజనాలకు ముందు స్నేహితులందరూ ఓ గదిలో కూర్చుని తాగడం మొదలెట్టేరు!

"నేను బైటికెళ్తాను". అన్నాడు బలరాం.

"ఏం?"

"నాకసలు ఆ వాసనే పడదు".

"వచ్చే జన్మలో సారాసీసావై పుడతావు."

"సారాసీసాగానా?" నవ్వేడు బలరాం.

"అవును. నేను తాగను. తాగుబోతులంటే నాకసహ్యం అనే వాళ్లందరికీ లోపల్లోపల అదెలా వుంటుందో ఓ సారి రుచి చూద్దామని వుంటుంది. కాని తాగరు. తాగలేరు. అన్నెం పున్నెమూ ఎరగని కోరికను నిలువునా హత్య చేసిన పాపం ఊరికే పోతుందా... జన్మ జన్మలకు పట్టికుడుపుతుంది. నువ్వు చేసిన పాపం నెక్స్టు జన్మలో నిన్ను ఓ సారాసీసాగా పుట్టిస్తుంది. నీలో ఎంత సారా..... పోనీ.... బ్రాందీ.... అదీగాకుంటే.... విస్కీవున్నా, దాన్ని రుచి చూడాలన్న తాపత్రయం నీలోవున్నా ఒక్క బొట్టుకూడ తాగలేవు. ఆఖరికి కుమిలి కుమిలి చచ్చి, పెటీళ్లున పగిలిపోయి ఏ పెంటకుప్పలోనో కలుస్తావు." అంటూ గ్లాసులోకి ఒంచుకోకుండా, నీళ్లసలే కలుపుకోకుండా విస్కీ సీసా ఎత్తి గటగటా తాగేసేడు ఆ స్నేహితుడు.

పకాల్న నవ్వేడు బలరాం. "నీ మొహం నీ మోర" అన్నాడు.

"తర్వాత్తర్వాత నువ్వే చూస్తావు."

ఇంటికొచ్చేడు బలరాం.

ఆ రాత్రంతా దాన్ని గురించే ఆలోచించేడు. మధ్య మధ్యన "ఏమిటీ తాగుడు గురించి యిలా ఆలోచిస్తున్నాను" అని అనుకుంటూనే ఆలోచించేడు. 'నిజంగా తాగడంలో అంతటి గొప్ప అనుభూతి వుందా' అని అనుకున్నాడు ఆఖర్న.

అదే స్నేహితులు మళ్లీ యింకో బర్త్‌డే పార్టీలో కలిసేరు. ఎప్పట్లానే మందు సేవనం ప్రారంభించేరు. ఆనవాయితీగా బలరాంకి కూడా ఆఫర్ చేసేరు ఓపెగ్గు.

'ఊహూ నాకొద్దు' అని అన్నాడే గానీ అతని చూపులు, ఆలోచనలు దాని చుట్టే తిరుగుతున్నాయి.

"పర్లేదు పుచ్చుకో, ఒక్కసారికి ఏం కాదులే", బలవంతంగా గ్లాసు అతని చేతిలో పెట్టేడు హోస్టు.

ఆ గ్లాసును పట్టుకున్నాడో లేదో చేతివేళ్లలో సన్నటి వణుకు ప్రారంభమయింది బలరాంకి. ఆ వణుకును చూసి స్నేహితులేమయినా ఎగతాళిగా చెప్పుకుంటారేమోనని క్షణంపాటు తటపటాయించేడు.

"ఊఁ కానీ..... చీర్స్"

గ్లాసుల గలగలలో, రంగు ద్రవపు మిలలో, చేతనాంతశ్చేతనల ఘర్షణలో బలరాం జీవితంలో కొత్త అధ్యాయానికి శ్రీకారం చుట్టబడింది.

తర్వాత బలరాం చాలా సార్లు తాగేడు. కొన్నాళ్ల పాటు 'తాగడంలో తప్పులేదు. ఎటొచ్చీ దానికి బానిస అవడమే నిందార్హం. తన డబ్బులతో కాక ఎవరేనా యిప్పిస్తేనే పుచ్చుకోవాలి' అనుకున్నాడు. అలానే కొన్నాళ్ల పాటు నెట్టుకొచ్చేడు.

తనకి ఎమ్మెస్సీలో గోల్డు మెడల్ రావడంతో మిత్రులకు పార్టీ యివ్వడానికి నిశ్చయించుకున్నాడు బలరాం.

సొంత డబ్బు వెచ్చించి రకరకాల మద్యాన్ని తెప్పించాడు.

"పార్టీ యిస్తే యిలా వుండాలి". అన్నారు స్నేహితులు. ఆ మాటలకు ఎంతగానో పొంగిపోయేడ సహజంగానే.

అప్పట్నుంచి సొంత డబ్బుతో తాగుతూ, మిత్రులకు తాగిస్తూ రావడం ప్రారంభించేడు.

పెళ్లయిందతనికి.

కట్నానికి ఆశపడి చేసుకున్నాడు గానీ ఆ అమ్మాయి పట్ల అతనికి యిష్టంలేదు. శోభనపు రాత్రి నుండే కొట్లాటలు ప్రారంభమయ్యేయి. ఆ యిద్దరి ఆలోచనలకు, అలవాట్లకు, నడవడులకు ఎక్కడా పొంతన కుదరదని తేలిపోయింది. అయినా తప్పనిసరిగా పయనించాల్సిన దూరం ఆ యిద్దర్నీ ఓ గాట కట్టేసింది.

చింతలు, వలవంతలు, గోరంతలు, కొండంతలు.

బలరాం తాగడం ఉధృతం చేసేడు.... సొంత డబ్బుతోనే కాక అప్పులు చేసి తాగేదశను కూడా అందుకున్నాడు.

సరిగ్గా ఆ సమయంలోనే తెలిసింది కాంతారావుకి, బలరాం సంగతి. కొన్నేళ్ల వనవాసం (ఉద్యోగ రీత్యా) తర్వాత సొంత ఊరికి బదిలీ అయింది. ఆ యిద్దరికీ 'ఒరే' అనుకునేంత చనువుంది. బంధువులు కాకపోయినా బావా అంటూ వరసలు కలుపుకుని పిల్చుకునే అనుబంధమూ వుంది.

చదువులో మిగతా జీవితంలోనూ ఆణిముత్యం అనిపించుకున్న బలరాం బొగ్గుముక్క అయ్యేడని తెలిసి బాధపడ్డాడు. అతని తాగుడ్ని కళ్లారా చూసి కృంగిపోయేడు. హితబోధ ప్రారంభించేడు.

"నీ బోధలు వినడానికి నాకేం అభ్యంతరం లేదు. దయచేసి ఒక్క బాటిల్ ఆరిస్టోక్రాట్ యిప్పించు. సీసా ఖాళీ చేస్తూ నీ బోధల్ని నాలో నింపేసుకుంటాను". అన్నాడు బలరాం హేళనగా.

కాంతారావు కృంగిపోలేదు.

బలరాం కోసం యింటికెళ్లినప్పుడల్లా అతని భార్య దీనవదనం చూసి అతడి గుండెలు తరుక్కుపోయేవి. క్రితం రాత్రి తనను ఎలా హింసించిందీ ఆమె ఎక్కిళ్ల దుఃఖంతో కలిపి మరీ చెబుతూంటే నరాలు తెంపుకున్నట్టుండేది. స్నేహితుడి శ్రేయస్సు నిజంగా కోరుకుంటున్న వాడు కనుక అతన్నెలాగయినా ఆ వ్యసనం నుండి బైటపడేసి ఆ సంసారాన్ని చక్క దిద్దాలనుకున్నాడు.

అదృష్ట వశాత్తు అప్పుడే "ఆల్కహాలిక్స్ అనానిమస్" వాళ్ల స్వర్ణోత్సవ కార్యక్రమాలు జరుగుతున్నట్టు తెలిసింది కాంతారావుకి. అక్కడికి లాక్కెళ్లేడు బలరాంని బలవంతంగా. అక్కడ

ప్రముఖ మాజీ తాగుబోతుల చరిత్రలు విన్నాడు. సైక్రియాట్రిస్టుల ప్రసంగాలు విన్నాడు. ఆఖర్న అన్నాడు.... "ఇప్పుడప్పుడే నేనీ సంస్థలో చేరను. వాళ్ల మాదిరి తాగుడులో తల పండిపోయేక అప్పుడు చేరతాను".

పెద్దప్పేరచక తప్పలేదు కాంతారావుకి.

అదేదో తాగుడుకు, విరుగుడుగా పసరు పోస్తారని విని అక్కడికి లాక్కెళ్లేడు. పసరు తాగింతర్వాత మత్తుగా కనిపించేడు బలరాం.

"మళ్లీ యింకోసారి ఆ పసరు పోయించవూ" అనడిగేడు కాంతారావుని.

అవాక్కయ్యేడతను.

"ఏమిటా తలతిక్క.... ?" విసుక్కున్నాడు కాంతారావు.

"ఫారిన్ విస్కీ కన్నా ఘాటుగా వుంది."

పసరు కూడా పన్చెయ్యలేదు. తర్వాత ఏవేవో మూలికలు.... ఏవేవో కేప్సూల్సు..... కనపడ్డ ప్రతి మార్గానా పోయేడు. ఫలితం లేదు.

మళ్లీ యిన్నాళ్లకు ఆ ప్రకటన చూసేడు.

'ఇందుకూ' అని ప్రత్యేకించి చెప్పలేం గానీ ఎందుకనో ఆ ప్రకటన మీద నమ్మకం కుదిరింది కాంతారావుకి. నేరుగా బలరాం యింటికెళ్లాడు.

ఆఫీసుకు సెలవు పెట్టి భార్యతో కొట్లాట పెట్టుకున్నాడు బలరాం. కాంతారావు వెళ్లడంతో అది కాస్తంత సద్దుమణిగింది.

"ఒరే రాస్కెల్.... త్వరగా తయారవ్వు."

"ఎక్కడికి?"

ప్రకటన చూపించేడు కాంతారావు.

"నేన్రాను."

"మక్కెలిరుగుతాయి". చనువుకొద్దీ బెదిరించేడు కాంతారావు.

"మీ ఆరోగ్యం పట్ల అన్నయ్యగారికున్న శ్రద్ధ మీకు లేకపాయె అంది బలరాం భార్య.

"ఆట్టే పేలకు".

"తమరు నోర్మూసుకుని నా వెంట కదలవలసింది". కాంతారావు కొద్దిగా వెటకారం మేళవించి మరీ అన్నాడు.

ఇద్దరూ కలిసి నేరుగా హిప్నటిస్ట్ వెంకటస్వామి దగ్గరికెళ్లేరు. అదృష్టం అదేమిటో గానీ వెళ్లగానే అపాయింట్‌మెంట్ దొరికింది.

ప్రాథమిక పరీక్షలయ్యేక "ఫీజు వెయ్యిదాటుతుంది" అన్నాడు వెంకటస్వామి మంద్ర








Rao —

స్వరంతో.

"కావాలంటే రెండు వేలయినా యిస్తాను. ముందు ఆ రాస్కెల్ని బాగు చెయ్యండి" అన్నాడు కాంతారావు.

దాదాపు అర్ధగంటసేపు సజేషన్స్ యిచ్చీ యిచ్చీ బలరాం మీద తన అస్త్రం ప్రయోగించేడు వెంకటస్వామి. గంట తర్వాత–

"ఇహ చస్తే సారాముట్టడు" అని భరోసా యిచ్చి "కావాలంటే పరీక్షించండి". అంటూ ఓ విస్కీ బాటిల్ తెప్పించి బలరాంకి యిచ్చేడు వెంకటస్వామి.

విస్కీ బాటిల్ వంక తదేకంగా చూసీ చూసీ, తటాల్న అందుకుని గటగటా తాగేసేడు బలరాం.

తాగుడు వ్యసనం అందే ఏమనుకుంటున్నారు మరి! □

బి. కె. సోంపేట

★ ఆడది పెట్టిన బిక్ష మగాడు అన్నారు ఆధారపడేది ఆడది అని ఓ ఆంగ్ల కవి అన్నారు. దీనికేం అంటారు?

● దేనికి? తిండికి! నిజంగా స్త్రీ రుణం తీర్చుకోగలడా ఏ మనిషైనా ఆలోచించండి -ఒక్కసారి.

★ ఇంతకీ యింట్లో వంట ఎవరు చేస్తున్నారు?

● వంట మనిషి! రాకపోతే - బ్రెడ్డు!! వి. ఎ. కె. మాత్రం కాదు. కేకుమీద ఐసింగుగా టూత్‌పేస్టు వేస్తాడాయన!

బి. ఎల్. తిరుపతి

★ ఈమధ్య తిరుపతికి వచ్చి స్టేజీమీదకు మీ వారితో రాకుండా చాటుమాటుగా దాగి వుండి సభలో వారిని నిరుత్సాహ పరిచారు. ఏం? మిమ్మల్ని చూసి దడుసుకుంటామనా? ఎత్తుకుపోతామనా?

● స్టేజీమీద కెందుకు? గాలేనా లేదు! హాయిగా ఆరుబయట చెట్టుకింద కూర్చుంటే చాటుమాటుగా దాక్కున్నానంటా రేమిటి? ఇక భయపడ్డమో పడకపోవడమో - మీ యిష్టం. ఎత్తుకుపోవడం అంటారా - అసంభవం!! నేను వైట్ ఎలిఫెంట్‌ని - ఆరుద్ర తప్ప నన్నెవరూ భరించలేరు.

యు. ఎమ్. ఆర్. కొంకుదురు

★ ప్రపంచంలో అత్యంత విలువైనది ఏమిటి?

● మానవజాతి ఉనికి. దాని మనుగడకే ఎసరుపెట్టే ప్రమాదం వస్తుందని భయంగా వుంది.

డి.ఎస్. కాశీబుగ్గ

★ రామలక్ష్మిగారూ నేను చిత్ర రంగంలోకి దూకి ఒక చిత్రం నిర్మించి ఆ చిత్రానికి దర్శకత్వం చేయాలనుకుంటున్నాను. మీ సలహా?

● రోగికి పత్యం నచ్చదు; ఉత్సాహికి సలహా సొక్కదు. కానివ్వండి– దిగాక మీకే తెలుస్తుంది. ఇక్కడ ఎవరూ ఏ పరిస్థితినీ యదార్థంగా చెప్పరు. ఎక్స్‌పీరియన్స్‌గా చెప్తారు. అంచేత – స్వీయానుభవాన్ని మించినది– కాదు సలహా.




డి. ఎన్. ఆర్. పటాన్ చెరువు

★ నేటి సమాజంలో దేనికి విలువ వుంది?

● మాట నేర్పుకి, మోసానికి.

★ చస్తారని తెలిసీ డబ్బంటే అంత వ్యామోహం ఎందుకు మనిషికి?

● అది ఉంటే సుఖంగా చావచ్చుని!

★ జీవితంలో సుఖంగా బ్రతకాలంటే?

● పిచ్చి కోరికల రెక్కలు ఎప్పటికప్పుడు కత్తిరిస్తూ వుండడం ఒక పద్ధతి; పిచ్చి కోరికలన్నీ తీర్చేసుకుంటూ వుండడం రెండో పద్ధతి. మొదటిది - నయం - రోగాన్ని అరికడుతుంది. రెండోది పెంచుతుంది.

★ జీవితాన్ని కాచి వడబోయడం అంటే ఏమిటి?

● కష్ట సుఖాలన్నీ అంచనా కట్టేసి వుండడం.

★ సంసారాన్ని సాగరంతో ఎందుకు పోలుస్తారు?

● దిగేదాకా లోతు తెలియదు. ఓసారి ఉరికాక మరి బయట పడడం కష్టం - అంచేతనేమో అలా అంటారు. కొందరంటూంటారు. కాస్త కెరటాలు తగ్గాక దిగుదామని!!

మధు. అంబుసోలి

★ డబ్బుకి లోకం దాసోహం?

● అవును. కాదనకలరా?

★ సంతోషంతో వచ్చే కన్నీటిని ఏమంటారు?

● ఆనందభాష్పాలు!

★ ఆడదాని అమాయకత్వం చూసి మోసపోయేది మగవాడే!

● పాపం పసివాడు!

డి. ఎస్. వి. ఆర్. కాశీబుగ్గ

★ కవి గొప్పా? కవి కలం నుండి వెలువడిన కావ్యం గొప్పా?

● మిగిలే కావ్యమైతే అదే గొప్ప. కవి పోయినా కావ్యం జ్ఞాపకం వుండి పోతుంది.

★ మా ప్రశ్నలకు సమాధానాలు చెప్పడం చాలా కష్టం అని మాకు తెలుసు. కాని ఎంతో వినోద భరితంగా విజ్ఞానవంతంగా మీ రిచ్చే జవాబులకి మేం ఏం బహుమతి యివ్వకలం?

● ఏం యివ్వక్కర లేదు ఉడుక్కో కుండా ఉండడమే పెద్ద బహుమతిగా భావిస్తా!నాకు గొప్ప ప్రశ్న లేదు. గొప్ప జవాబూ లేదు!

ఎస్. వి. సంగం జాగర్లమూడి

★ కుల ప్రసక్తి లేకుండా వర్ణ వ్యవస్థలో వివరించినట్టు వ్యక్తి తరహానుబట్టి మనుషులను వర్గీకరించడం ప్రాక్టికల్‌గా సాధ్యపడుతుందా?

● పడవచ్చు. కాని అది రాజకీయవేత్తలకు లాభసాటి కాదు. అంచేత పడనివ్వరు!

ఎ. పి. అనంతపల్లి

★ ఎవరో చెప్పిన మాటలని పట్టుకొని....

● చెప్పుడు మాటలు వినే వాళ్లనే పట్టాను నేను. ఏం? ఎదురుగా ఆయా వ్యక్తులున్నప్పుడు - అడిగి క్లియర్ చేసుకోలేరా? అది సవ్యమైన పద్ధతి - తమ తప్పులేనివాళ్ళు చేపట్టవలసిన పద్ధతి.

కె. వి. వి. ఆర్. రాజమండ్రి

★ మీరు మేధావి ననుకుంటూ జవాబులిచ్చేస్తున్నారు. రోడ్డునవెళ్లే వారిని ఎవరినైనా ఆపి ప్రశ్నిస్తే వాళ్ళు చెప్తారు జవాబు.... ఏమిటి మీ గొప్ప?

● మరి నాకెందుకు రాసినట్టు శేషగిరిరావుగారూ యీ ఉత్తరం - మీ దారిలో ఎవరూ పిలిస్తే ఆగలేదా?!.... ఇక నా గొప్ప - చెప్పకల్గడం కాదు - రాయకల్గడం. అంతే!

రాజా. నారాయణపేట

★ నేడు దిన వార పత్రికలు పుట్ట గొడుగులలాగా పుట్టు కొస్తున్నాయి. కారణం ఏమిటంటారు?

● అక్షరాస్యత పెరగడం మటుకు కాదు!

★ సాధువులు సన్యాసులు బాబాలు ఎక్కువై పోయారు. వారి వద్ద మహిమలున్నాయా?

● ఎలా తెలుస్తుంది? నేనూ ఓ అమ్మావతారం ఎత్తనివ్వండి చెప్తాను.(ఇంకో ఐదేళ్ల తర్వాత అమ్మ నవుతాను, సారి అమ్మగా అవతరిస్తాను – కాని భాష్యం నే చెప్పను. నా మౌన భాషకి ఏ లతనో వ్యాఖ్యానం చెప్పడానికి పెట్టుకుంటాను. ముందు వి. ఎ. కె. ని అనుకున్నాను కాని ఆయన భాష్యం నాట్యంలో చెప్తారేమోనని భయం వేసి యీ మార్పు అనుకున్నా!) □



# వాంటెడ్ టెనెంట్

భమిడి వెంకటేశ్వర్లు




అప్పారావులో బెంగ, విచారం, భయం, ఆందోళన, చికాకు, కోపం వారం రోజుల క్రితం నుంచి చోటు చేసుకున్నాయి. ఇవన్నీ అతన్ని బాధిస్తున్నాయి. ఈ బాధ నుంచి బయటపడాలంటే డబ్బు కావాలి. ఆ డబ్బు అతనికి లేకపోలేదు. కాని అది యిల్లు గడవటానికి సరిపోదు. జీతంతో పాటు, యింటి అద్దె తోడై వేణ్ణీళ్లకు చన్నీళ్లలా కలిసిపోవటంతో యీ పదేళ్లు సాఫీగా గడిచిపోయాయి. కాని ప్రస్తుతం ఆ యిల్లు ఖాళీ అయింది వారం రోజుల క్రితం. ఆ యింట్లో వున్న సుందరమ్మగారు హటాత్తుగా యిల్లు ఖాళీ చేసి వెళ్లిపోయారు. ఓ వైపు అప్పారావుకి ఆవిడ వెళ్లిపోయినందుకు ఆనందంగానే వుంది. కొత్తవారికి ఎక్కువ అద్దె చెప్పవచ్చునన్న కారణంతో.

అయితే ఆ రోజు నుంచే అప్పారావుకి అసలు కథ ఆరంభమైంది. నగరంలో యిళ్ల కొరత బాగా వుంది. ఇల్లు దొరకడం అంటే పార్టీ టిక్కెట్టు దొరికినంత సంతోషంగానే చెప్పాలి. అటువంటి పోష్ కాలనీలో వున్న తన యిల్లు, ఎక్కువ సదుపాయాలున్న యిల్లు, మిగిలిన యిళ్ల కన్న తక్కువ అద్దె వున్న యిల్లు యింతవరకూ భర్తీ కాలేదంటే బాధగానే వుంది.

ఈ రోజుల్లో "టులెట్" బోర్డు పెట్టక్కర్లేకుండానే లారీలోంచి సామాన్లు ఎక్కిస్తుంటేనే జనం ఎగరేసుకుపోతారు. కాని ప్రస్తుతం పరిస్థితి భిన్నంగా వుంది. వారం రోజులు సునాయాసంగా దొర్లిపోయాయి. ఎవరూ గుమ్మం తొక్కలేదు. కనీసం సుందరమ్మగారైనా తెలిసినవారిని చేర్పించలేదు. మూడేళ్లు హాయిగా వుండి, అప్పారావు నుంచి ఏ మాటా పడకుండా, యిబ్బంది లేకుండా కాలక్షేపం చేసి - కేవలం రెండు రోజుల ముందర "అసలు విషయం" చెప్పి వెళ్లిపోవటం ఆలోచిస్తుంటే అతని రక్తం వేడెక్కుతూంది.

ఇప్పుడేం చేయాలి! పోనీ "టులెట్" బోర్డు పెడితే! కాని మరుక్షణంలోనే అది అవమానంగా తోచింది. తన యింటికన్నా చిన్నది ... సదుపాయాలు అంతగా లేనిది ... ఎక్కువ అద్దె వున్నది - అదే కాలనీలో వున్న మూడు యిళ్లు యిట్టే భర్తీ అయ్యాయి. అప్పారావుకి యీ పదేళ్ల కాలంలో ఎప్పుడూ యిటువంటి పరిస్థితి ఎదురవలేదు. ట్రాన్సఫరు, క్వార్టరు యివ్వటం, పెద్ద సంసారం కారణంగానే సుందరమ్మగారికి ముందున్న వాళ్లు వెళ్లిపోయారు ...

కాని సుందరమ్మగారు వెళ్లిన కారణంఎవరూ హర్షించలేనిది! అందుకు అప్పారావు బాధ్యుడు కాడు. సదుపాయాలు కల్పించి, వాటిని వుపయోగించుకోమని చెప్పటం మంచిదికాదు! సరిగ్గా యిదే అపవాదు ఆవిడను బాధించి యిల్లు ఖాళీ చేసేందుకు తోడ్పడింది. చివరికి అప్పారావుకి ఓ ఆలోచన వెన్నుతట్టింది. "టులెట్" బోర్డు పెట్టటం తప్ప మరో గత్యంతరంలేదు. అంతే, వెంటనే డ్రాయింగు పేపరు, ఎర్ర సిరా, అరటావు సైజు అట్ట తీసుకొని వ్రాయసాగాడు. సరిగ్గా ఆ సమయంలో గుమ్మంలో ఓ ఆకారం నిలబడినట్లు నీడగా కనిపించింది. తలెత్తి చూసాడు. అతను ... ఎదురుగా సుందరమ్మగారు!

ఎందుకొచ్చినట్లు ... తనకు ఏమి బాకీ లేరే .... కరెంటు, నీళ్ల ఛార్జీలు కూడా చెల్లించారు. ఈ రాకలోని ఆంతర్యం ఏమిటో? ముందు ప్రోగ్రాం లేకుండా, చెప్పకుండా ప్రైమ్ మినిస్టరు రాజధానికొచ్చినట్లుగా... అనిపించింది.

"బాగున్నారా" అంటూ పలకరించారు సుందరమ్మగారు.

నోటితో చెప్పలేక, కళ్లతోనే జవాబు చెప్పాడు అప్పారావు.

"వదినగారున్నారా" అంటూ లోపలకు నడిచారు

ఆవిడ.

ఆలోచనలు అప్పారావుని నిలవనీయటంలేదు. టులెట్ బోర్డు రాసేందుకు చేయి వణుకుతోంది.

* * * * * *

సుందరమ్మగారికి సంతానం ఎక్కువే! ముగ్గురు కొడుకులు వుద్యోగాలు చేస్తూ మద్రాసు, కోయంబత్తూరు, విశాఖపట్నంలో వుంటున్నారు. ముగ్గురే కూతుళ్లతో ఆవిడ అప్పారావు యింటికి అద్దెకోసం వచ్చారు. పెద్దకూతురు రైల్వేలో స్టెనోగ్రాఫరు ... రెండో కూతురు ఏ. జీ. ఆఫీసులోను ఉద్యోగాలు చేస్తున్నారు. మూడో కూతురు బి. ఎస్సీ. చదువుతోంది. కొడుకులకి వివాహాలు అయ్యాయి. ఆడ పిల్లలకు ఎందుకో వివాహాలు చేయలేదు ఆవిడ.

మూడేళ్ల క్రితం సుందరమ్మగారు అప్పారావు యింటికి వచ్చారు. తన గురించి చెప్తూ, పిల్లల గురించి చెప్పిందావిడ. తన గురించి తెలిసినవాళ్ల పేర్లు చెప్పింది. "నాకు మీ యిల్లు కావాలి ... నచ్చింది. ఇవ్వాలి" అన్నదావిడ.

అప్పారావు ఓ క్షణం ఆలోచించాడు.

"మీకు నావల్ల ఏమి ఇబ్బంది వుండదు. ఫస్టు తారీఖుకి అద్దె యిచ్చేస్తాను. మా చుట్టాలు దగ్గర్లోనే వున్నారు. మూడో అమ్మాయికి కాలేజీ దగ్గర. ఈ రోజుల్లో బస్సుల్లో వెళ్లి రావటం అంటే బాధే కదా ... దయచేసి నాకు మీ యిల్లు యివ్వండి" అంటూ పర్సులో చేయిపెట్టారు డబ్బు యిచ్చేందుకు.

"మీకుయిల్లు నచ్చిందికదా ... సదుపాయాలు తృప్తికరమేగా ... పోతే ... " అంటూ ఆగాడు అప్పారావు ఓ క్షణం.

"మా ఇంటికి చుట్టాలు, స్నేహితులు ఎవరూ రారు. వచ్చినా రెండు మూడు రోజుల కంటే వుండరు." అప్పారావు వుద్దేశాన్ని గ్రహించినట్లుగా చెప్పారు సుందరమ్మగారు. అతన్ని మరో విషయం ఆలోచింపజేస్తోంది.

సుందరమ్మగారు తన ధోరణి కొనసాగించారు.

"మీ మొక్కలకు రోజు నీళ్లు పోస్తాము. మీ అనుమతి లేకుండా పూలు కోయం ... మా యింటిలాగే చూసుకుంటాం. ఇల్లు పాడు చేస్తామని భావించకండి ... ఇల్లు కాళీ చేసేటప్పుడు మీ యింటిని పువ్వుల్లో పెట్టి అప్పగిస్తాము." అంటూ.

"రేపు చెప్తాలెండి" అని అన్నాడు అప్పారావు ఆలోచించుకునేందుకు.

"కాని మాకు మీ యిల్లు యివ్వాలి ... ఆడదాన్ని, ఆడపిల్లలున్నదాన్ని, తిరగలేను" అంటూ అర్థించిందావిడ వెళ్లే ముందు.

అప్పారావు ఆలోచించేది లేదు. ఇల్లు యిచ్చేవరకూ చాలామంది యిలాగే అర్థిస్తారు. ఎన్నికల్లో నాయకులు వాగ్దానాలు చేసినట్లు ... నిరుద్యోగులు చెప్పినట్లు ... ఆ తరువాతే కథ మరో మలుపు తిరుగుతూంది. కాళీ చేయమంటే ఎదురు తిరగటం ... కోర్టుకెక్కటం ... పోట్లాడటం ... ఇలా రక రకాల అస్త్రాలు ప్రయోగించటం




## వాంటెడ్ టెనెంట్

మామూలే. తనకే అవి అనుభవాలయ్యాయి. ఒకసారి -

సూర్యనారాయణ అప్పారావు కొలీగు. ఇల్లు నిర్మాణం నుంచి తనని వేధించసాగాడు. పోనీ కదాని ... కొలీగని యిల్లు యిచ్చాడు అప్పారావు.

సూర్యనారాయణతో పాటు, భార్య, ముగ్గురు తమ్ముళ్లు, తల్లి మాత్రమే వుంటామని చెప్పాడు అతను. సరే అన్నాడు అప్పారావు. మొదటి తారీఖున అద్దె యిచ్చి, పదో తారీఖున వచ్చి చేరతామని చెప్పి వెళ్లిపోయాడు. పదో తారీఖున వాళ్లు వచ్చి చేరారు. ఇరవై తేదీనాటికి అతని నలుగురు చెల్లెళ్లు వచ్చారు. సంఖ్య పదికి పెరిగింది. ఇల్లు సరిపోక, సామానులు సర్దుకోలేక, జనాన్ని సముదాయించలేక అవస్థపడేవాడు సూర్యనారాయణ.

రెండో నెల అద్దె యిచ్చేందుకు వచ్చాడు సూర్యనారాయణ. మొదటి నెలలో పది రోజులకు అద్దె తగ్గించి యివ్వబోయాడు అతను.

"ఇదేమిటి" అని అడిగాడు అప్పారావు.

"అవును, మేము పదో తేదీన చేరాంగదా. అంతవరకు యిల్లు నీ అధీనంలోనే వుంది కదా ..." అని సర్ది చెప్పబోయాడు కొలీగు.

"కాని యిల్లు నీకు యిచ్చినట్లే కదా ... మినహాయిస్తే ఎలా"

"అప్పారావు ...నిన్నటి వరకూ నువ్వు అద్దెకున్నవాడివి. అప్పుడే యింటి యజమానిలవెల్లో మాట్లాడుతున్నావు. పది రోజులు నేను లేను కాబట్టి అద్దె యివ్వనవసరంలేదు". నిశ్చయంగా చెప్పాడు సూర్యనారాయణ.

అప్పారావు ఖంగుతిన్నాడు. "నువ్వు ఎవరినైనా అడుగు. నీకు ఏది మంచిదని తోస్తే అలా చేయి. నేను నువ్విచ్చే అద్దెమీద బతకడంలేదు. ఆలస్యమైనా ఫరవాలేదు. ఈ అద్దె తీసుపో" అంటూ తిరిగి యిచ్చేసాడు అతను.

"ఇంత నిక్కచ్చిగా వుండటం మంచిదికాదు."

"నేను డబ్బుకంటే మనిషికి, మాటకు విలువ నిస్తాను. ఆ విషయం నువ్వు గ్రహించే వుంటావు. కొలీగువని యిల్లు ఇస్తే యిలా మాట్లాడటం భావ్యంకాదు. నాతో ఆరుగురుంటామని చెప్పావు. కాని పదిమంది వుంటున్నారు. మీరు యిబ్బందిపడటం నాకు కష్టంగా వుంటోంది." చెప్పాడు అప్పారావు బాధపడుతున్నట్లుగా.

"చూడు అప్పారావ్ ... బాధపడిన, యిబ్బందిపడినా అది నా విషయం. మీ యింట్లోకి జనాన్ని తోలటంలేదు కదా ... పైగా వున్నవాళ్లని ఎక్కడకు పంపించమంటావు ... ఆ నలుగురికీ విషంపెట్టి చంపేయమంటావా ..." కోపంగా అన్నాడు సూర్యనారాయణ.

ఆ ధోరణి అప్పారావుని బాధించింది. "ఇక్కడ నేను యింటి యజమానిని నువ్వు టెనెంటువి అని మరిచిపోదాం కాసేపు. కాని నీ మీద ఆధారపడ్డ మనుషులు ... నీకున్న సామానులు ... నీకు తెలీవూ! ఇల్లు నాలుగైదుసార్లు చూసావు కదా ... వూళ్లోవాళ్ల దగ్గర చిన్న గదులు ఉంటే, వాళ్లేమి పెద్దది చేస్తారా... నిన్ను ఆదుకుంటారా... నావల్ల నీకు యిబ్బంది వుంటే చెప్పు ...అంతేగాని యితరుల దగ్గరనడం బాగోలేదు." నచ్చ చెప్పాడు.

ఈ విధంగా సూర్యనారాయణ మాట్లాడేవాడు. రోజూ సామానులు మార్చేవాడు. రాత్రి పన్నెండు, ఒంటి గంట వరకూ వాళ్లింట్లో గొడవగా వుండేది. ఫలితంగా అప్పారావుకి చికాగ్గా వుండేది. కొలీగు, స్నేహితుడు అన్న కారణంతో మవునంగా వుండేవాడు. అది లోకువగా భావించాడు సూర్యనారాయణ. అయినా సర్దుకు పోయేవాడు అప్పారావు.

ఏడు నెలల తరువాత సూర్యనారాయణ హటాత్తుగా యిల్లు కాళీచేసి వెళ్లిపోయాడు. అప్పుడు అప్పారావు, ఫామిలీ పెళ్లికి వెళ్లారు. తిరిగివచ్చేసరికి తాళం కప్ప దర్శనమిచ్చింది.

"నీకు యిబ్బంది కలిగించటం యిష్టంలేక కాళీచేసాను. ... ఇవిగో తాళం చెవి" అంటూ తాళం చెవి యిచ్చాడు సూర్యనారాయణ రెండు రోజుల తర్వాత.

"సూర్యనారాయణా ... నేను నువ్వనుకున్నంత వెధవనుకాను. కేవలం స్నేహానికి విలువిచ్చి సర్దుకుపోయాను. కాని నువ్వెందుకు కాళీచేసావో ఏ యింటికి వెళ్లేవో నాకు తెలిసింది. అది వదిలేయ్ ... కరెంటు రీడింగు చూసుకున్నావా ..."

"అంతా చూసాను. నేను మొత్తం రెండు వందల నలభై రూపాయలు కరెంటుకి, నలభై ఎనిమిది రూపాయలు నీళ్లకు యివ్వాలి ... మళ్లీ నెలలో ప్రావిడెంటు ఫండు లోను పెట్టి యిస్తాను"

# శ్వాసలో తాజాదనం కోసం లవంగం నమలడం సాంప్రదాయికంగా వస్తున్న ఆచారం



చైనా దేశంలో రాజ దర్బారులకు వెళ్లే ప్రజలు, అధికారులు, రాజ దర్శనానికి వెళ్లే ముందుగా, తమ శ్వాసలో తాజాదనము, సువాసన రావడానికని లవంగం నమిలేవారట. అదే లవంగం ప్రస్తుతం ప్రామిస్ టూత్‌పేస్టులో అత్యంత ప్రధానమైన దినుసు. ప్రామిస్‌తో పళ్లు తోముకున్నారంటే, చైనా రాజ దర్బారులకు వెళ్లే ప్రజలు, అధికారులకు లాగానే మీ శ్వాస కూడా తాజాదనము, సువాసన నిండి ఉంటుంది. ఇది లవంగ నూనె అద్భుత గుణమన్నమాట. ప్రామిస్‌లోని ప్రత్యేక ఫార్ములా కారణంగా ఇది. నోటిలోనూ శ్వాసలోనూ దుర్వాసన కలిగించే సూక్ష్మజీవులను కూల్చివేసి, మీ శ్వాసలో తాజాదనం నింపితెస్తుంది.

ఇంతేగాక, లవంగ నూనెలోని మరొక సుగుణమేమిటంటే, ఇది మీ పళ్లలో మూలమూలలా చేరి, మీ పళ్లకు హాని చేస్తున్న సూక్ష్మజీవులను తరిమికొట్టుంది. పీటిను నుండి విముక్తి పొందిన మీ పళ్లు ఆరోగ్యవంతంగానూ, దృఢంగానూ, మెరిసిపోతూనూ ఉంటాయి. మీ శ్వాసలో తాజాదనము, సువాసనా నిండిపోతాయి. అంటే ఇప్పుడు మీరు కూడా పూర్తి ఆత్మవిశ్వాసంతో ఏ రాజ దర్శనానికై వెళ్లవచ్చు. ఏ రాణి దర్శనానికైనా వెళ్లవచ్చు!






Promise



లవంగ నూనెతో అద్భుత సృష్టి – ప్రామిస్ టూత్‌పేస్టు

3 బల్సారా— టూత్‌పేస్ట్ విశేషజ్ఞులు

అన్నాడు సూర్యనారాయణ.

"ఒక్క విషయం గుర్తుంచుకోవాలి నువ్వు. నువ్విదివరలో వున్నవాళ్ళకుదాదాపు ఆరొందలు కరెంటు, నీళ్ళకు బాకీపడ్డావు. నాకు తెలుసు. వారికి ఎంత యిచ్చావో నీకు తెలుసు. ఇప్పుడు నామీద ఆ తెలివితేటలు ప్రదర్శిస్తున్నావు. నిజంగా యిస్తావా" నిలదీసినట్టుగానే అడిగాడు అప్పారావు.

సూర్యనారాయణకు కోపం వచ్చింది. "అంటే నీ బాకీ యివ్వననా నీ వుద్దేశం ..." అన్నాడు వెంటనే.

"కోపం వద్దు. నా యిల్లు కాళీచేసి వెళ్ళిపోయినా, మనమిద్దరంయీ ఆఫీసులో కొలీగ్సు అన్న విషయం మరిచిపోకు. ఈ బాకీ నీకు గుర్తుకు వచ్చినప్పుడల్లా గిల్టీగా వుంటుంది నీకు. కాని ఓ విషయం గుర్తుంచుకో ... నువ్వు యిల్లు కట్టేక, నీకు ఓ టినెంటు వచ్చాక, వాడు నీలాగే ప్రవర్తిస్తే ఎలాగుంటుందో అప్పుడు తెలిసివస్తుంది. డబ్బు శాశ్వతంకాదు. కాని మనిషి మాట, ప్రవర్తన నిలిచిపోతాయి. తెలివైన టినెంటు పనికిమాలిన యింటి యజమానికి తోడుగా వుంటాడు - అనే నిజం నాకిప్పుడిప్పుడే బోధపడుతోంది. నువ్వు చెల్లించాల్సిన బాకీలో కనీసం సగమైనా యిచ్చేందుకు ప్రయత్నించు". అప్పారావు సుదీర్ఘంగా చెప్పాడు.

నేటివరకూ ఆ బాకీ చెల్లుకాలేదు.

ఇప్పుడు అప్పారావు ఆలోచనల్నుంచి తేరుకున్నాడు.

అన్నమాట ప్రకారంమర్నాడు వచ్చారు సుందరమ్మగారు. పర్సులోంచి డబ్బు తీసి యివ్వబోయారు ఆవిడ.

"ఆడవాళ్ళు ... మగతోడు లేని సంసారం" అని జాలిపడి యిల్లు యిచ్చాడు అప్పారావు.

రెండు సంవత్సరాలు సాఫీగా గడిచాయి. సుందరమ్మగారు నిజంగా దేవత. మంచి మనసున్న స్త్రీమూర్తి. కాని సంతానానికి ఆ పోలికలు లేకపోవటం దురదృష్టమే. కూతుళ్ళు రోజూ ఏదో విషయంలో పోట్లాడుకునేవాళ్ళు. పెద్దకూతురికి టీ. వీ, రెండో కూతురికి రేడియో కార్యక్రమాలు, మూడో కూతురికి పత్రికలు కావాలి. ఈ విషయంలో తరచు సంఘర్షణే! పోటీపడి టీ. వీ. రేడియో గొంతు పెంచేసేవారు. ఈ పోట్లాట సుందరమ్మగారికి గుండె దడని, బి. పీని పెంచేవి. కూతుళ్ళిద్దరికీ ఉద్యోగస్తులమనే అతిశయం, అహంభావం వుండేవి. మాటల్లో స్పష్టంగా తెలిపేవారు.

"ఇంత యిల్లు కట్టేరు ... కిచెన్ ప్లాట్‌ఫారం మీద తాండూరుషాబాద్ స్టోను, గోడకి పింగాణీ టైల్సు వేయించలేదే" అని అడిగింది సుందరమ్మగారి పెద్దకూతురు ఓసారి.

"ఆలోచిస్తున్నాను ... త్వరలో వేయిస్తాను." అన్నాడతను.

"నీళ్ళకు తొట్టిలు కట్టించండి ... బావికి చప్టా వేయించండి." రెండో కూతురు అడిగింది యీసారి.

"అప్పారావుగారు పరిశీలిస్తున్నారు" ఠక్కున అంది మూడో కూతురు నవ్వుతూ.

## వాంటెడ్ టినెంట్

అప్పారావు వారి తెలివితేటలకు, సమయస్ఫూర్తికి నవ్వుకున్నాడు.

"ఆరు నెలల్నుంచీ దాటుకు పోతున్నారు మీరు. పనిలో పని యింటి చుట్టూ నాపరాళ్ళు వేయించండి... శుభ్రంగా, అందంగా వుంటుంది" అన్నారు ముగ్గురు కూతుళ్ళు ముక్తకంఠంగా - ఓ రోజు.

ఈ సదుపాయాలు సుందరమ్మగారు అడిగిస్తున్నారో ... లేక వాళ్ళే ఆటపట్టించేందుకు అంటున్నారో అప్పారావుకు అర్థంకావటంలేదు. వారి నోటికి తాళం వేసే వుద్దేశంతో తను ఆ పనులకు సిద్ధమయ్యాడు. దాదాపు ఎనిమిదివేల దాకా ఖర్చు అయింది.

మరో దెబ్బ! నగరంలో నీటి ఎద్దడి ఏర్పడింది. రోజు విడిచి రోజు నీళ్ళు వదులుతున్నారు. అదైనా సరిగా రావటంలేదు. వచ్చినా నీళ్ళు చాలటంలేదు. ఈ విషయంలో కూడా మళ్ళీ సుందరమ్మగారి కూతుళ్ళు అప్పారావుని ఆటపట్టించసాగారు. టినెంట్సుకి సదుపాయాలు కల్పించడని అపవాదు వేసారు.

"బావి తవ్వించండి ... నీళ్ళు చాలటంలేదు కదా" అంది అతని శ్రీమతి ఓ రోజు వారి ధోరణికి జవాబుగా.

అప్పారావు రెండేళ్ళలో బావిని అయిదుసార్లు తవ్వించాడు. ఎండలకు, చుట్టుపక్కలవాళ్ళు బోరింగులు వేయించటంతో నీళ్ళు నిలిచేవికాదు. బావి లోతు పాతిక అడుగులకు పెరిగింది. బావి పూర్తిగా ఎండిపోయింది - ప్రస్తుతం. కరెంటు లేకపోతే కిరసనాయిలు దీపంతో కాలక్షేపం చేయవచ్చు కాని లేచినప్పట్నుంచి, పడుకునే వరకూ నీళ్ళు కావాలి. దీనికి ప్రత్యామ్నాయం మరొకటి లేదు. అందుకే అయిదువందలు ఖర్చుచేసి రెండు గజాలు తవ్వించాడు అప్పారావు. అదృష్టం బాగుంది. రోజూ నీళ్ళు తోడినా మర్నాటికి గజం లోతు నీళ్ళు వుంటున్నాయి. అతనికి, సుందరమ్మగారికి చాలా సంతోషంగా వుంది. లాటరీలో బహుమతి వచ్చినంత ఆనందంగా వుంది.

కాని దురదృష్టం అప్పారావుని మరో రూపంలో వెంటాడుతూనే వుంది. సుందరమ్మగారికి ఓ పనిమనిషి వుంది. దానికున్న పొగరు, గర్వం, దర్పం మరెవరికీ, వుండదేమో ... నిర్లక్ష్యం, బద్ధకంకు మరో పేరుగా దాన్ని చెప్పచ్చు. చెప్పిన పని చేయకపోవటం దాని కలవాటు. చేసే పని అసహ్యంగా వుంచటం మరో అలవాటు. పెరడు తుడవదు. నీళ్ళు చల్లదు. తుక్కు ఏరి బయటకు వేయదు. అప్పటికి సుందరమ్మగారు ఎన్నోసార్లు చెప్పారు. వినిపించుకొనే గుణం దానికి లేదు. మళ్ళీ మళ్ళీ చెప్తే పని మానేస్తుందేమోనన్న భయంతో చూసీ చూడనట్టుగా వుండేవారు వాళ్ళు. అక్కడికీ నాలుగైదుసార్లు అప్పారావు కూడా చెప్పి చూసాడు. దానికి పనిమనిషి సమాధానం యిలా వుంది. "నువ్వు నాకు చెప్పక్కర్లేదు. నేను నీ పనిమనిషిని కాదు. కావాలంటే తుడిపించుకో" అంటూ చీపురు పడేసింది. అప్పట్నుంచీ చెప్పటం మానేసాడు తను.

ఆఫీసుల్లో ఉద్యోగులే పనిచేయరు. అటువంటిది పనిమనుషుల చేత చేయించటం కంటే అంతరిక్షం లోకి షికారుకి వెళ్ళటం తేలికేమో!

నూతిలో నీళ్ళున్నా బాధ తప్పలేదు. రోజూ సుందరమ్మగారి కూతుళ్ళు ఏదో రూపంలో విమర్శించేవాళ్ళు అప్పారావుని.

"నీళ్ళు తోడుకోడం కష్టంగా వుంటోంది. మోటారు పెట్టించండి". అని వాళ్ళు రెండు మూడుసార్లు అడిగారు.

అప్పారావు సుందరమ్మగారి సమక్షంలో చేతులు జోడించాడు. "క్షమించండి. నాకు శక్తిలేదు. ఎందరి బావులకు మోటారులున్నాయి? నీళ్ళు తోడుకోడం కష్టము. ... పనిమనిషిని వుంచుకుని కూడా దానిచేత పని చేయించుకోలేక పోతున్నారు. అది కాకపోతే మరొకటి! దేశంలో బోలెడుమంది తిండిలేక తిరుగుతున్నారు. మీరు దాన్ని అలా వుండనిస్తే, అది మీ చేతకానితనంగా భావించి మొండికెడుతుంది. వారానికోసారి నేను కూలిమనిషి చేత మీ వైపు తుడిపించి, కడిగిస్తున్నాను. అందుకు డబ్బు నేను మిమ్మల్ని అడగడంలేదు. రేపు డాబా ఎక్కేందుకు కష్టంగా వుందని, లిఫ్టు పెట్టించమని అడగొచ్చు మీరు ...దయచేసి అర్థం చేసుకోండి

"మేము అప్పు యిస్తాం ... చేయించండి" అంది పెద్దకూతురు.

"నాకు అప్పు అంటే భయం. నా దృష్టిలో అది నిప్పులాంటిది. ఓ విషయం మీరు గుర్తుంచుకోండి. రేపు నీకు పెళ్ళవుతుంది. పిల్లలు పుడతారు. వాళ్ళు అది కావాలి ... యిది కావాలి అని నిన్ను అడుగుతారు. అన్నీ తీర్చేయగలవా? అవసరం, అనవసరం గురించి ఆలోచించేది తల్లీ, తండ్రి. ఇంటి విషయం కూడా అంతే. అలమారాలకు తలుపులు పెట్టించమని నువ్వు యింకా అడగనందుకు నాకు సంతోషంగా వుంది. మీ అమ్మగారు మీ ఆయనకు ఎంతవరకు కోరికలు తీరుస్తారో మరి!" విపులంగా చెప్పాడు అప్పారావు.

"దానికీ దీనికీ సామ్యం ఏమిటి? బట్టతలకు,

## అందమైన అవినీతి

నీతీ న్యాయం
లేవు వాడికి!
తప్పులూ దోషాలూ
నెమిలి కన్నుల వలె
అందంగా ఆకర్షణీయంగా
వాడి బతుకంతటా
నిండిపోయాయి-
అవి మనల్ని రక్షించక
వాణ్ణి రక్షిస్తున్నాయి;
వాణ్ణి భక్షించక
మనల్ని భక్షిస్తున్నాయి!

-కలువకొలను సదానంద

# ఈ 'వేమన' పద్యాలు




నేరనన్నవాడు నెరజాణ మదిలోన
నేర్తునన్నవాడు వ్యర్థుడెందు
నూరకున్నవాడె యుత్తమ యోగిరా
విశ్వదాభిరామ వినురవేమ.

మోకాలికి పోలికా"

"అంతా ఒక్కటె ... అర్థం చేసుకుని ఆలోచిస్తే ఏ విషయమైనా సరిపోతుంది. ఆ మాత్రం ఓపిక మనకుండాలి" అతని జవాబు.

ఆ తరువాత వారి పెద్దకూతురు ఓ మనిషిని తీసుకొచ్చి బావిని చూపించి మోటారుకు అయ్యే ఖర్చు గురించి విచారించింది. అందుకు అభ్యంతరం పెట్టాడు అప్పారావు.

"ఇది బాగోలేదు. మీ పిల్లలు చదువుకోవచ్చు. ఉద్యోగస్తులు కావచ్చు. అంతమాత్రాన యిలా చేయటం బాగాలేదు. మీకు నీళ్ళు తోడుకోటం కష్టమైతే, నేను పనిమనిషిని పెట్టి తోడిస్తాను. అందుకు ఖర్చు యివ్వనవసరంలేదు. అంతేగాని నా యింటికి, నా బావికి, నా అనుమతి లేకుండా యిలా మనుషుల్ని తీసుకొచ్చి బేరసారాలు చేయటం ఏం బాగాలేదు." అన్నాడతను బాధపడుతూ.

## వాంటెడ్ టెనెంట్

"అంటె మీ ఉద్దేశంలో మేమంత గతిలేని వాళ్ళమా!" ఎదురు తిరిగింది రెండో కూతురు.

"జవాబు మీ అమ్మగారే చెప్పాలి".

సుందరమ్మగారు మౌనం వహించారు.

"ఈ కాలంలో కూడా బజారులో దొరికే... సదుపాయాలు అనుభవించకపోవటం దురదృష్టం దేనికైనా పెట్టి పుట్టాలి." పెద్దకూతురు లోపల్నుంచి గొణగటం అప్పారావుకి వినిపించింది.

"నిజమేనమ్మా ... నాకు యోగంలేదు. పాకులాడటం చేతకాదు. ఏదో యింతవరకే పెట్టి పుట్టాను. నేను మరే సదుపాయాలు కల్పించలేను. నా యిల్లు ఖాళీగా వున్నా భరిస్తాను." చివరిసారిగా చెప్పాడు.

"మీ దృష్టిలో యిదొక్కటె యిల్లా ... డబ్బు పడేస్తే బోలెడు యిళ్ళు దొరుకుతాయి. రెండు రోజుల్లో యిల్లు ఖాళీ చేస్తాం ... చూస్తూ వుండండి." అంటూ ఛాలెంజి చేసింది ఆ అమ్మాయి.

"నువ్వు వయసుకి మించి మాట్లాడుతున్నావు. అనుభవానికి దాటి అవసరాలు కోరుతున్నారు. నేను ఖాళీ చేయమని చెప్పను. కాని నేను ఖాళీ చేయించానని అనకుండా వుంటే అదే పదివేలు. ఆ తరువాత మీ యిష్టం."

అంతే, సుందరమ్మగారు యిల్లు ఖాళీ చేసేసారు.

* * * *

ఇప్పుడు సుందరమ్మగారి రాకలోని అంతర్యం అప్పారావుకి తెలియకపోలేదు. అతనింటి నుంచి వాళ్ళు శారదానగర్‌కి మారిపోయారు. ఆ యిల్లు ఎగువ భాగాన వుండటంతో గాలికి లోటు లేకపోయినా నీటికి మాత్రం యిబ్బంది. కుళాయి నీళ్ళు ప్రెషరు లేకపోవటంతో పై భాగానికి వచ్చేవికాదు. కింద నుంచి మోసుకెళ్లాలి. ఇద్దరు కూతుళ్ళు ఉద్యోగాలకి, మూడో కూతురు కాలేజీకి వెళ్ళిపోతే యిక మిగిలేది సుందరమ్మగారు. ఆవిడ బిందెలతో నీళ్ళు పైకి తీసుకెళ్ళగలదా అంటే ఆయాసం ... అదిగాక కింద భాగంలో యింటి యజమానితో పాటు మరో రెండు వాటాల వాళ్ళున్నారు. మొత్తంమీద నాలుగు వాటాలకు సరిపోయే నీళ్ళు కావాలి. అసలు గండిపేటలోనే నీళ్ళు లేకపోతే కుళాయిల్లో నీళ్ళు ఎలా వస్తాయి! ఈ యిబ్బందుల కారణంగా ఆ యింట్లో తరచు ఏదో వాటా ఖాళీ అవుతుంటుంది. అసలు యింట్లో బావి వుంటే ఏదో టైములో తోడుకోవచ్చు. ఆ మాత్రానికి బాధపడితే, ఒళ్ళు కందిపోతుందనుకుంటే ఏం లాభం! వంద రూపాయలు ఎక్కువిచ్చి నీళ్ళులేని యింట్లో కాపురం ఎలా! ఆ తల్లికూతుళ్ళు బాగా చర్చించుకున్నారు ...

ఈ విషయంలో తల్లీకూతుళ్ళు మరుసటి రోజు నుంచి తగువుపడసాగారు. అప్పారావు యింట్లోని బావిలో చేద వేయనివాళ్ళు, మరో యింటికి వెళ్ళి నీళ్ళు తెస్తారా ఉద్యోగస్తులైన పిల్లలు ... పనిమనుషులు!

"నేను మళ్ళీ మీ యింటికే వస్తాను." అన్నారు సుందరమ్మగారు. ఇప్పుడు ఆలోచనలో పడ్డాడు అప్పారావు మళ్ళీ. ఇల్లు యివ్వాలా వద్దా అని!

"మళ్ళీ నా యింటికేనా ... అసలు యింట్లో చేరి దీపం పెడితే చాలనేయింటి యజమానులు బోలెడుమందున్నారు. పైగా ఉద్యోగాలు దొరక్కపోయినా, యిళ్లకు ఆ పరిస్థితి రాలేదు. మీ అమ్మాయిలను సంప్రదించారా!" అని అన్నాడు అతను.

"వారి మాటలు పట్టించుకోకండి. చిన్నతనం. ఈ నెల అద్దె వదులుకుని రేపే మీ యింట్లో చేరిపోతాం. ఇదిగో యీ నెల అద్దె ... దయచేసి యిల్లు యివ్వండి." అర్థించారు ఆవిడ. అప్పారావుకి ఆవిడ మీద జాలి కలిగింది. డబ్బు అందుకున్నాడు. ఆ సాయంత్రమే వారు చేరిపోయారు. ఇప్పుడెవరికీ పట్టింపులు, పంతాలు లేవు ... □

# ఒక సాంకేతిక అద్భుతం......



## ఫ్యాంటసీ కలర్ టివి. యొక్క ప్రత్యేకత ఏమిటి?

మేల్మైన ప్రదర్శనకు దోహదం చేసే గ్రహణ శక్తి. మరియు లోకాతీతమైన రంగులు మీకు సమర్పించడం కోసం కేవలం ప్రతి ఫ్యాంటసీ టివి. సెట్టులో చూపెట్టబడే అత్యధికమైన శ్రద్ధ.

ప్రపంచానికి పున్నత శ్రేణులైన ఫిలిప్స్ వారి సరిక్రొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని. పరికరాలను పరిపొందించుకొని తయారైనది ఫ్యాంటసీ కలర్ టి.వి.

ఫ్యాంటసీ కలర్ టి.వి. తో (పిక్చర్ ట్యూబ్‌తో సహా) ఒక సంవత్సరపు వారంటీ ఇవ్వబడుతుంది. ఒక వేళ అవసరమొస్తే ఒక్క ఫోన్ చేస్తే చాలు. తక్షణం, సమగ్రమైన. విశ్వసనీయమైన సేవ హాజరు.

వెంటనే మీకు సమీపంలో ఉండే డీలరు వద్దకు వెళ్ళి ఫ్యాంటసీ ప్రదర్శన పరికించండి. ఫ్యాంటసీ గుణగణాలు తప్పక మీ నిర్ణయానికి దోహదం చేస్తాయి.

అందుకే మీరు కలర్ టి.వి. లో కోరుకొనే లక్షణాలన్నీ "ఫ్యాంటసీ" సంతరించుకొంది.




FANTASY

COLOUR TV

MAA(S) H VE 86

Marketed by: Vijai Electronics Pvt. Ltd., 13, Progressive Towers, 6-2-913 & 914, Khairthabad, Hyderabad-500 004.

## హరేకృష్ణ ల్యాండులో వైభవోపేతంగా జన్మాష్టమి:-

ఆగస్టు 27, 28 తేదిలలో జంటనగరాల హరేకృష్ణల్యాండులో శ్రీకృష్ణ జన్మాష్టమి వైభవోపేతంగా జరిగింది. దాదాపు 50 వేలమంది భక్తులు నాంపల్లి స్టేషను రోడ్డులోని హరేకృష్ణల్యాండ్‌లో రాధా మదన్‌మోహన్ మందిరానికి వచ్చి, తొక్కిసలాటతో రాధా మదన్‌మోహన్ అర్చావతార మూర్తులను దర్శించుకొన్నారు. ఈ ఉత్సవం 27వ తేదీ ఉదయం లోకకల్యాణ హవనంతో ప్రారంభమైంది. ఈ హవన కార్యక్రమంలో హైదరాబాద్ హరేకృష్ణల్యాండ్ మందిరాధ్యక్షులు శ్రీ మహామన్‌దాస్ అధికారి అనంతరూపస్వామి మహారాజ్ (న్యూయార్క్) మందిర కార్యదర్శి శ్రీ ఆనందమయదాస్ మున్నగువారు, వందలాది భక్తులు పాల్గొన్నారు. మధ్యాహ్నం రాజభోగ అరతి, భజన సంకీర్తనలు జరిగాయి. సాయంకాలం 6-30కు బేబి కోశిరెడ్డి వసుంధర అనే పదకొండు సంవత్సరాల విద్యార్థిని శాస్త్రీయ నృత్యం ప్రదర్శించింది. దీనిలో కృష్ణ జననాది లీలలు ప్రదర్శించబడినాయి. సాయంకాలం సంధ్యారతి తర్వాత శ్రీ త్రిదండిస్వామి భక్తి వైభవ మధుసూదన మహారాజ్ జన్మాష్టమి వైశిష్ట్యాన్ని గురించి వివరించారు. ధర్మానికిగాని, అధర్మానికి అభ్యుత్థానం కలిగినప్పుడల్లా తాను అవతరిస్తానని కృష్ణుడు భగవద్గీతలో చెప్పినట్టు ద్వాపరాంతంలో ప్రపంచం రాజకీయాధికారాహంకారులతో,

దుష్టులతో నిండి, ధర్మానికి నామరూపాలు నశించిపోయే దుస్థితిలో కృష్ణుడు సామాన్య మానవరూపంలో, సామాన్య గ్రామీణుల మధ్య అవతరించి, వివిధ లీలలు ప్రదర్శించి ధర్మాన్ని ఉద్ధరించాడని శ్రీ మదుసూదన మహారాజ్ అన్నారు. రాత్రి 8-30కు గురుశ్రీరామమూర్తి శిష్యబృందం కృష్ణలీలా నృత్యాలు ప్రదర్శించింది.

రాత్రి 11 గంటలకు శ్రీ అనంతరూపస్వామి మహారాజ్ (న్యూయార్క్) ప్రపంచమంతటా కృష్ణజయంతి జరుపుకొనే తీరును మనోరంజకంగా వర్ణించారు. లండన్‌లో, న్యూయార్క్‌లో, శాన్‌ఫ్రాన్సిస్కోలో, చైనా రాజధాని అయిన షాంఘైలో మత్స్యమాంసాలు తిని, మద్యం సేవించి వెర్రి చిందులు తొక్కేవారంతా కృష్ణజయంతినాడు ఉపవాసముండి, భజనలు చేసి, కృష్ణ కథాశ్రవణం కోసం, కృష్ణ ప్రసాదం కోసం పడిగాపులు కాస్తారని, కనీసం ఈ రోజన్నా వారు-మనోదేహాలను పవిత్రంగా పెట్టుకొనడానికి

ప్రయత్నించడం హర్షించదగిందని శ్రీ అనంతరూపస్వామి అన్నారు. రష్యాలోని పెక్కు నగరాలలో కూడ కృష్ణ జయంతిని అతి రహస్యంగా లైట్లు ఆర్పి, పైకి సంకీర్తన శబ్దం వినిపించకుండా సౌండ్ ప్రూఫ్ గదుల్లో జరుపుకుంటున్నారని అయన ఉదాహరణలిచ్చారు. తర్వాత రాధా మదన్‌మోహన్ ఉత్సవ విగ్రహాలకు పంచామృతాభిషేకం జరిపారు. పిదప, ఆ రాత్రి ఉపవసించాలి గనుక సగ్గుబియ్యం ప్రసాదం, పళ్ళు, కండచక్కెర, మేవాలు వినియోగం చేయబడ్డాయి. దీనిని ఏకాదశీ ప్రసాదమంటారు. సికిందరాబాద్‌లో సంగీతటాకీస్ ఎదుట వున్న హరేకృష్ణ మందిరంలోను అర్ధరాత్రి 5000 మందికి

# హైదరాబాద్ నోట్‌బుక్

ప్రసాదం వినియోగం జరిగింది. అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘ సంస్థాపకాచార్యులు శ్రీ భక్తి వేదాంతస్వామి ప్రభుపాదులు శ్రావణ బహుళాష్టమి చివరి గడియలలో అవతరించారు. కనుక ఇస్కాన్ భక్తులు శ్రీల ప్రభుపాదుల జన్మదినాన్ని కృష్ణాష్టమి మరుసటి దినం. నవమినాడు వ్యాసపూజగా జరుపుతారు. అష్టమి రాత్రంతా మేల్కొన్న నందుడు మరుసటి రోజు ఊరికంతా విందు చేశాడట. దానికి సూచనగా - నందోత్సవం జరుపుతారు. ఈ నందోత్సవ వ్యాసపూజలు ఆగస్టు 28న నాంపల్లి హరేకృష్ణ ల్యాండ్‌లో శిష్యులు ఘనంగా జరిపారు. ఉదయం పదకొండు గంటల వరకు శ్రీ ప్రభుపాదుల జీవిత విశేషాలను గురించి పలువురు ప్రసంగించారు. శ్రీ మహామన్‌దాస్, అనంతరూపస్వామి (న్యూయార్క్), శ్రీ మధుసూదనస్వామి మహారాజ్, శ్రీ అనంతపద్మనాభ దాస్ (ఆంధ్ర), శ్రీ నందకుమార్ (మణిపూర్) మున్నగువారు శ్రీ ప్రభుపాదుల దీక్షను గురించి ప్రసంగించారు. శ్రీ ప్రభుపాదులు 1965 న్యూయార్క్‌కు చిల్లిగవ్వ లేకుండా వెళ్ళి ఎంతో కష్టంతో అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘాన్ని ఐదుగురు శిష్యులతో స్థాపించారని, అది ఇప్పుడు ప్రపంచమంతా పెద్ద వటవృక్షంవలె వ్యాపించిందని, శ్రీ అనంతరూపస్వామి అన్నారు. పది సంవత్సరాలలో హరేకృష్ణోద్యమాన్ని విశ్వవ్యాప్తం చేసిన మహామహుడు ఆయన అని శ్రీ అనంతరూపస్వామి ప్రస్తుతించారు. శ్రీ మధుసూదనస్వామి మహారాజ్ ప్రసంగిస్తూ, హరినామ సంకీర్తనం ప్రపంచం నలుమూలలా వ్యాపించగలదని, 600 సంవత్సరాల క్రితం శ్రీ చైతన్య మహాప్రభువు చెప్పిన భవిష్యవాణిని వాస్తవం చేసినవారు శ్రీ ప్రభుపాదులని, దేనికైనా

అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘ స్థాపకాచార్యులు శ్రీ భక్తి వేదాంత ప్రభుపాదులు



గురుకృప అవసరమని, గురుకృప వల్లనే శ్రీ ప్రభుపాదులు భక్తిని విశ్వవ్యాప్తం చేయగలిగారని అన్నారు. పురాణాల నుంచి గురు కృపను గురించిన పెక్కు కథలను ఆయన ఉదహరించారు. పిదప 108 పక్వాన్నాలు రాధామదన్‌మోహన్‌కు నివేదన చేశారు. తర్వాత శ్రీల ప్రభుపాదుల బంగారు విగ్రహానికి శ్రీ మహామన్‌దాస్ అభిషేకాది షోడశోపచారాలు చేశారు. సంకీర్తన అనంతరం దాదాపు 5000 మందికి మృష్టాన్నంతో విందు జరిగింది. రాత్రి శ్రీ మధుసూదన మహారాజ్ శ్రీకృష్ణ లీలలను గురించి ప్రసంగించారు. పిదప ప్రభుపాదుల జీవిత చరిత్ర అనే ఇంగ్లీషు చలనచిత్రం ప్రదర్శించబడింది.

## సంస్కృతం అందరి సొమ్ము:-

ఏడు పదులు దాటినా వాడని ముఖ వర్చస్సుతో అగ్నిశిఖలాగ వెలుగుతూ వున్న శ్రీ పండరినాథాచార్యగల్గలే మృదు మధుర గంభీర వాణితో సంస్కృతంలో ప్రసంగిస్తూ వుంటే, శ్రోతలు ఆ సంస్కృతపీయూష వాహినిలో కొట్టుకొని పోవలసిందే. ఆయన కర్ణాటక రాష్ట్రంలో కవిపండితులకు కేంద్రమైన హుబ్బళ్ళి వాస్తవ్యులు. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామః, లోకమాన్య చరితమ్, అగ్నిస్ఫులింగః, రామ రసాయనమ్, శ్రీ రాఘవేంద్ర కావ్య పంచకమ్ మొదలైన సంస్కృత కావ్యాలు రచించారు. వైజయంతీ, మధురవాణీ అనే సంస్కృత మాస, వారపత్రికలను నిర్వహిస్తున్నారు సంపాదకులుగా. అష్టాదశ పురాణాలను కన్నడ గద్యంలో రచించడానికి పూనుకొని పదింటిని ముగించారు. శ్రీ గల్గలే సెప్టెంబర్ 3వ తేదీ సాయంత్రం నిజాం కాలేజ్ ఆవరణంలో సంస్కృత భాషపై సంస్కృతంలో మధుర గంభీరంగా ప్రసంగించి శ్రోతలను ముగ్ధులను చేశారు. సంస్కృత సంస్కృతి ఏ ప్రాంతానికీ సీమితం కాదని, విశ్వమానవ సంస్కృతిని, మానవజాతి సంస్కృతిని వర్ణిస్తుందని అన్నారు. సంస్కృతం బ్రాహ్మణ భాష కాదని, కింది నుంచి మీది వరకు అన్ని

వర్గాలవారి, దీనినీ, కట్టెలమ్ముకొనేవారు, గుడ్డలు నేసేవారు కూడ సంస్కృతంలో మాట్లాడేవారని, ఒక తంతువాయుడు కవయామి, వయామి, యామి అని చెప్పాడని అంటూ, సంస్కృత పండితులు ఆత్మ గౌరవంతో, గర్వంతో ప్రవర్తించాలని ఆయన కోరారు. పురాణాలలోని కావ్య సౌందర్యాన్ని ఆయన వివరించారు. సభ ప్రారంభంలో నిజాం కాలేజి సంస్కృత రీడరు డాక్టర్ వర్‌ఖేడ్‌కర్ శ్రీ గల్గలేను పరిచయం చేశారు. డాక్టర్ గిరిజాశంకర్ శర్మ (హిందీ) స్వాగతం చెప్పారు. శ్రీమతి కమల, శ్రీ మూలంపల్లి చంద్రశేఖరశర్మ ప్రసంగించారు.

## ఉపశ్రుతి:-

హైదరాబాద్ -బెంగుళూరు లక్జరి వీడియో బస్సు. సీట్ల మధ్య దారిలో కిరసనాయిల్ డబ్బాలు వరుసగా పెట్టారు. ఇవెందుకు అడ్డంగా దారికి?- అనడిగాను. ఇవి సీట్లు సార్ - అన్నాడు కండక్టర్. వంద రూపాయలు చెల్లించి ఈ డబ్బాలమీద ఎవరు కూర్చుంటారయ్యా?- అన్నాను. నిద్ర సుఖమెరగదు, ఆకలి రుచి ఎరగదు అన్నట్టు పని తొందర సౌకర్యాన్ని ఎరుగదు సార్ - అని కండక్టర్ అంటూ వుంటే, నాకు భర్తృహరి జ్ఞాపకం వచ్చాడు.

- తిరుమల రామచంద్ర

# పంది వెంట్రుకలతో బ్రష్‌లు!

పందిని అందరూ అసహ్యించుకుంటారు. పెయింటు బ్రష్‌లను పంది వెంట్రుకల నుండే తయారు చేస్తారని అందరికి తెలియదు. మిగతా జంతువుల వెంట్రుకలతో పోల్చిచూస్తే, పంది వెంట్రుకలను అన్నిటికన్నా శ్రేష్ఠమైనవిగా భావిస్తారు. ఈ వెంట్రుకలు కిలో మూడు వందల రూపాయల చొప్పున అమ్ముడు పోతాయి. అందుకే పంది వెంట్రుకల బ్రష్‌ల ధర ఎక్కువ.

వెంట్రుకలను పంది శరీరం నుండి ఒక్కొక్కటి లాగి ప్రోగు చేస్తారు. లాగిన వెంట్రుకలకు కొవ్వు, రక్తం మరియు ధూళి- దుమ్ము అంటి ఉంటాయి. వీటన్నిటిని తీసేయడానికి వెంట్రుకలను మొదట పలచని క్షారంలో, తరువాత పలచని ఆమ్లంలో ఉంచి, చివరకు నీటితో బాగా కడిగి ఆరబెట్టుతారు. అపుడు వేంట్రుకలు బాగా శుభ్రమవుతాయి. వివిధ పొడవుల్లో ఉన్న ఈ వెంట్రుకలను, పొడవును బట్టి వేరు చేస్తారు. బ్రష్‌ల వెడల్పు, మందం మరియు పొడుగులు వెంట్రుకల పొడవుపై ఆధారపడి ఉంటాయి.



1 కట్ట కట్టిన పంది వెంట్రుకలు.

2 రేకు తొడుగు.

3 వెంట్రుకలను అమర్చిన రేకు తొడుగులు- వివిధ సైజులు.

4 కర్రహేండిల్.

5 పూర్తయిన బ్రష్.

వెంట్రుకలను కట్టలు కట్టి సరిచేస్తారు. చేయబోయే బ్రష్ కొలతలను బట్టి లెక్క ప్రకారంగా వెంట్రుకలను తూచి రేకు తొడుగుల్లో అమర్చి లక్కతో కదలకుండా బంధిస్తారు. మరో వైపున్న రేకు తొడుగు చివరలో కర్ర హేండిల్‌ను బిగించుతారు. ఆకర్షణీయంగా కనబడటానికి రేకు తొడుగుకు మెరుపు మరియు హేండిల్‌కు రంగులు వేస్తారు.

పంది వెంట్రుకల్లో ఇతర జంతువుల (బర్రె, ఆవు, గుర్రం మొదలగునవి) వేంట్రుకలు కలిపి 'కల్తీ' చేస్తారు. ఈ వెంట్రుకలు చాలా చౌకగా లభిస్తాయి. మన దేశంలో కాన్‌పూర్ (ఉత్తర ప్రదేశ్) పెయింట్ బ్రష్‌లకు ప్రసిద్ధి. విదేశాల్లో కూడా మంచి గిరాకీ ఉంది.

బ్రష్‌లను తయారు చేసే 'టిక్నాలజీ' ఎంతో సులభమైనది. పంది వెంట్రుకలకు మంచి ఉపయోగం లేదని భావించే వారు ఈ టిక్నాలజీని ఉపయోగించి ఆదాయాన్ని పెంచుకోవచ్చు.

—టి. సంపత్‌కుమార్.

# న్యూఢిల్లీ లేఖ

( 4 వ పేజీ తరువాయి)

...) కదా. వాటిలో ఏ ఒక్కదాని నుంచైనా ...తీసుకొని చాలా రోజులు అయింది. సరే. ...రు రూపాయి విలువని ఎప్పుడు తగ్గించ...రు?

రా. గాం.: ఇక తగ్గించే ప్రసక్తే లేదు. ఇప్పటికే అది అట్టడుగుకి దిగిపోయింది. ఎవరికీ తెలియకుండా మేము దాన్నలా చేశాము. కానీ మీరు దాన్ని ప్రచురించకండి.

నేను: అంటే మీరు కావాలనే అలా చేసారంటారా?

రా. గాం.: కావాలనో, కాదో కానీ ప్రపంచంలో మీరు దానితో ఏదీ కొనలేరు. ఒక వంద రూపాయల నోటుకి లండన్‌లో ఒక ఆస్ప్రిన్ మాత్రకానీ, పారిస్‌లో ఒక గడ్డం చేసుకొనే బ్లేడు కానీ రాదు.

నేను: త్వరలో నే మీరు ప్రధానమంత్రిగా రెండేళ్ళు పూర్తి చెయ్యబోతున్నారు. ఇంతవరకూ మీరు సాధించిన అతి పెద్ద విజయం ఏమిటని మీరనుకుంటున్నారు?

రా. గాం.: రెండేళ్ళలో నేను 20 సార్లు విదేశాలకి వెళ్ళాను. మరే ప్రధానమంత్రీ అలా చెయ్యలేదు, చివరికి ఈ ఆనవాయితీని మొదలుపెట్టిన మా తాతగారు కూడా. ఈ విదేశీ వ్యవహారం అంటే ...మాషా కాదు. శారదాప్రసాద్ రాసే విసుగు ...ించే ఉపన్యాసాలని చదవాల్సి ఉంటుంది. అది ...పసందైన పదార్థాలు వడ్డించే విందులలో. మొన్నమధ్య 10, డౌనింగ్ స్ట్రీట్‌లో మార్గరెట్ థాచర్ ఇచ్చిన విందులో నేను మాట్లాడుతూనే ఉన్నాను, ఆవిడ మాత్రం చాలా మామూలుగా పీచ్‌మెల్బాని మూడోసారి వడ్డించుకొనే ఏర్పాటులో ఉన్నారు.

నేను: ఇంకా ఏదైనా చెప్తారా?

రా. గాం.: మూడు ఒప్పందాల మీద నేను సంతకం చేసాను. ఒకటి కమలాపతి త్రిపాఠీతో, మరొకటి జగన్నాథ్ మిశ్రాతో, ఇక మూడవది భజన్‌లాల్‌తో. త్రిపాఠీ ఆయనకి ఇష్టం వచ్చినన్ని ఉత్తరాలు రాయవచ్చు. మేము వాటిని చదివినట్లే భావించి వాటిని గురించి పట్టించుకోము. మిశ్రా తన గుండె బరువుని దింపుకునే వరకూ దూబేని ఎన్నైనా తిట్టవచ్చు. కానీ ఆయనపై నిజంగా దాడి చెయ్యనంతవరకూ మేము వాటిని పట్టించుకోము. అలాగే భజన్‌లాల్ తరచుగా ఆయనకు ఎప్పుడు కావాలంటే అప్పుడు తమ నేత్రచికిత్స కోసం అమెరికా వెళ్ళవచ్చు. అయితే చండీఘర్ మీదుగా వెళ్ళకూడదు. మొన్న మధ్య పి. సి. సేతీ టెలిఫోన్ ఎక్స్‌ఛేంజి వద్ద తెచ్చినటువంటి గొడవ లాంటిది అక్కడ తిసుకురాకూడదు. ఈ మూడు ఒప్పందాలూ వాటి పద్ధతిలో అవి చరిత్రాత్మకమైనటువంటివే. ఆనాడు ఇర్విన్ ప్రభువు మరొక గాంధీతో చేసుకున్న ఒప్పందంలాగా.

నేను: కానీ ఇవన్నీ మీ పార్టీ అంతర్గత విషయాలు. దేశానికి మీ ప్రభుత్వం చేసింది ఏమిటి?

రా. గాం: అడిగిన ప్రశ్నని బట్టే సమాధానం ఉంటుంది. అసలు నా ప్రభుత్వం దేశానికి చెయ్యనిదేమిటి? అన్నట్టు, మీ అంగరక్షకులు ఏరి?

నేను: నాకు ఎవరూ లేరు. వాళ్ళ అవసరం నాకు లేదు.

రా. గాం.: నిజమే. మీరు రాజీవ్ మంత్రివర్గంలో లేరు కదా! నా మంత్రులెవరూ అంగరక్షకులు లేకుండా ప్రయాణం చెయ్యలేరు, అసలు వాళ్ళ బంగళాల నుంచే కదలరు. వాస్తవానికి సమర్థుడైన ఏ కాంగ్రెసువాడైనా అంతే. నేనెంతగా ఉపాధి అవకాశాలని కల్పించానో చూడండి. అన్ని రకాల ఆయుధాలనీ తయారు చెయ్యటంతో ఆయుధ కర్మాగారాలన్నీ ఎక్కువ సమయం పనిచేస్తున్నాయి. మన తలసరి మొత్తం జాతీయ ఉత్పత్తి తక్కువే ఉండవచ్చు. కానీ మన తలసరి రక్షణ ప్రపంచంలో అందరికన్నా ఎక్కువగా ఉన్నది. అది ఘనవిజయం కాకపోతే మరేమిటో నాకు తెలియదు. వస్తాను, వాళ్ళు నా విమానం గురించి ప్రకటిస్తున్నారు, మిమ్మల్ని వచ్చే నెలలో కలుస్తాను. □

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna; Phones :- Business : 61247, 61248, Editorial: 75667*

# బొమ్మల సీరియల్!

సీక్రెట్ ఏజెంట్
విక్రమ్
దిలీప్ కదమ్
మోహన్
4

విక్రమ్ రేణూలు రోడ్డుని దాటుదామను కుంటుండగానే ఎదురు చూడని సంఘటనలు జరగటం మొదలైంది.



విక్రమ్ రేణూతో సహా ఒక పక్కకి దూకేసాడు.



విక్రమ్ ఆ భవనం గోడకి ఒక మూలగా వెళ్ళి తనని చంపటానికి సిద్ధమైన ఆ వ్యక్తిని గమనించాడు.




తన ఆటోమాటిక్ తుపాకి రేణుకి ఇచ్చాడు.




ఆ హంతకుడు తుపాకీ కనిపిస్తున్న దిశగా నెమ్మదిగా ముందుకి వెళ్తున్నాడు.



విక్రమ్ మరి ఆలస్యం చెయ్యలేదు. వెనుక నించి అతన్ని వొడిసి పట్టి గొంతు మీద కత్తిని ఉంచాడు.







హఠాత్తుగా విక్రమ్‌కి హెడ్ లైట్లు లేని కారొకటి మలుపు తిరగటం కనిపించింది. జరగబోయే దేమిటో విక్రమ్‌కి స్ఫురించింది.




మరుక్షణంలో –

